యవధాన్యము; కొంకణము - బరారు మధ్య గల ప్రదేశపు ఒకప్పటి పేరు; చిన్న గిన్నె.

**कुंद** - पुं० జాజి పువ్వు మాదిరి ఒక తెల్లని పువ్వు; తామర పువ్వు; గన్నేరు (చెట్టు) 9 సంఖ్య; విష్ణువు; కుబేరుని నిధులలో ఒకటి. वि० మొక్కపోయిన; స్తబ్ధమైన.

**कुंदन** - पुं० మేలిమి బంగారము; అపరంజి वि० స్వచ్ఛమైన; స్వస్థత గల.

**कुंदन-साज** - वि० బంగారు రేకులు వేయు వాడు.

**कुंदरू** - पुं० దొండకాయ లేక తీగ.

**कुंदा** - पुं० కొయ్యమొద్దు; తుపాకి మడమ; పాలఖోవా.

**कुंदी** - स्त्री० బట్టలు బాగుచేయునపుడు కొయ్య పలకతో కొట్టుట.

**कुंदीगर** - पुं० బట్టలు బాగుచేయువాడు.

**कुंदेरना** - स०क्रि० గీకుట; చీల్చుట; చిత్రిక పట్టుట.

**कुंदेरा** - पुं० తరిమనపట్టువాడు; చిత్రిక పట్టువాడు.

**कुंभ** - पुं० కుంభము - కుండ; ఏనుగు కుంభస్థలము; గుగ్గిలపు చెట్టు.

**कुंभकार** - पुं० कुम्हार ; కుమ్మరి; కోడి పుంజు.

**कुंभी** - पुं० ఏనుగు; మొసలి; కుంభీపాక నరకము ; గుగ్గలము; स्त्री० చిన్న వంట కుండ.

**कुंभीपाक** - पुं० ఒక విధమగు నరకము.

**कुँवर** - पुं०दे० कुँअर.

**कुँवारा** - वि०दे० कुँआरा.

**कुँवाँ** - पुं०दे० कुँआ.

**कुआर** - पुं० ఆశ్వయుజ మాసము.

**कुइयाँ** - स्त्री० చిన్న నుయ్యి.

**कुई** - स्त्री० చిన్నబావి ; తెల్లకలువ.

**कुकडी** - स्त्री० నూలు చిప్ప లేక కండె; అడవి కోడి పెట్ట.

**कुकरी** - स्त्री० అడవికోడి పెట్ట.

**कुकर्म** - पुं० చెడుపని; చెడునడత; పాప కార్యము.

**कुकर्मी** - वि० పాపి; చెడు నడత గలవాడు.

**कुकर** - पुं० కుక్క; ఒకపాము; ప్రాచీన యదు వంశీ క్షత్రియులకు చెందిన ఒక శాఖ.

**कुकर खाँसी** - स्त्री० కోరింత దగ్గు; పొడి దగ్గు.

**कुकुर दाँत** - पुं० గొగ్గిపన్ను.

**कुकुरमाछी** - स्त्री० कुकुरौंधी ; గోమాలు - పశువుకు పట్టు పేను మాదిరి ఒక పురుగు.

**कुकुरमुत्ता** - पुं० కుక్కగొడుగు; పుట్టకొక్కు.

**कुकुरौंधी** - स्त्री० दे० कुकुरमाछी.

**कुक्कर** - पुं० కోడిపుంజు; అగ్నికణము; ఊడలు దిగినమొక్క.

**कुक्कुभ** - पुं० అడవి కోడిపుంజు.

**कुक्कुर** - पुं० కుక్క; యదు వంశీయులకు సంబంధించిన ఒకశాఖ.

**कुक्षि** - स्त्री० పొట్ట; కడుపు पुं० బలిచక్రవర్తి.

**कुखेत** - पुं० చెడ్డచోటు; కుక్షేత్రము.

**कुख्यात** - वि० बदनाम; చెడుపేరుగల.

**कुगति** - स्त्री० దుర్గతి; దుర్దశ.

**कुघात** - पुं० మోసము; చెడ్డచోటు; అననుకూల ప్రదేశము.

**कुचकुचाना** - स०क्रि० కొంచెముగా మర్దించిన లేకదంపిన; మాటిమాటికి గ్రుచ్చుట లేకనాటుట.

**कुचक्र** - पुं० षडयन्त्र ; కుట్ర.

**कुचक्री** - पुं० కుట్రచేయువాడు.

**कुचलना**-स०क्रि० త్రొక్కుట, కాలరాయుట; దంచుట.

**कुचाल** - स्त्री० చెడునడత; దురాచరణము; దుర్మార్గము.

**कुचाली** - वि० దుష్టుడు; దుర్మార్గుడు.

**कुचेष्टा** - स्त्री० చెడునడత; దుర్మార్గము.

**कुचेल** - पुं० మురికిగుడ్డ.

**कुचैल** - वि० మురికిగుడ్డలవాడు; पुं० మురికి గుడ్డ

**कुचैला** - वि० दे० कुचैल.

**कुछ** - वि० కొంచెము; కొద్ది; కొన్ని.

**कुछएल** - वि० थोडा सा ; కొలది.

**कुछ ऐसा** - वि० విలక్షణమైన; విశిష్టమైన; అసామాన్యమైన.

**कुछ का कुछ** - वि० విపరీతముగా; ఒక దానికిమరొకటిగా ; అసంగతముగా.

**कुछ कुछ** - क्रि०वि० కొద్దికొద్దిగా; కొందరు కొందరుగా.

**कुछ न कुछ** - क्रि०वि० थोडा-बहुत ; ఒకించుక

**कुछ हो** - अव्य० ఏమైనా సరే.

**कुछेक** - वि० दे० कुछएल.

**कुज** - पुं० కుజ లేక మంగళ గ్రహము లేక అంగారకుడు; మంగళవారము. చెట్టు; పృథ్వీపుత్రుడనబడు నరకాసురుడు.

**कुजस**-पुं०बदनामी ; కుఖ్యాతి; అపఖ్యాతి.

**कुजोग** - पुं० చెడుసాంగత్యము; చెడు యోగము; చెడుకాలము.

**कुट** - पुं० చెట్టు; ఇల్లు; కుటీరము; గుడిసె; కోట, కొండ; ముక్క; కలశము; దంప బడినది.

**कुटनपन ; कुटनपना** - पुं० తార్పుడుపని; తార్పుడు వృత్తి; సంధానము చేయుట;

పోట్లాట పెట్టు పని.

**टनहारी** - स्त्री० వద్దు దంచు స్త్రీ; దంపుడు స్త్రీ.

**टना** - पुं० తార్పుడుకాడు; కొండెము చెప్పువాడు; తగాదా పెట్టువాడు; वि० కొట్టబడుట; దంచబడుట.

**टनाना** - स०क्रि० స్త్రీలను మభ్యపెట్టి వ్యభిచార వృత్తినందు ప్రవేశపెట్టుట.

**टनी** - स्त्री० తార్పుడు కత్తె; కొండెములు చెప్పి పోట్లాట పెట్టు స్త్రీ.

**टवाना** - स०क्रि० దంపించుట.

**टाई** - स्त्री० దంపుడు; దంపుడు కూలి.

**टिया** - स्त्री० చిన్న గుడిసె.

**टिल** -वि० **टेढा** ; వంకరగల; మోస పూరితమైన; వక్రమైన; వక్రబుద్ధి గల; पुं० దుష్టుడు.

**टिलता** - स्त्री० కపటము; వంచన.

**टिलपन** - पुं० ; **कुटिलाई** - स्त्री० వక్ర బుద్ధి; దుష్టత.

**टी** - स्त्री० ; **कुटीर** - पुं० కుటీరము; గుడిసె.

**टुंब** - पुं० కుటుంబము; పరివారము.

**टेव** - स्त्री० దురభ్యాసము; దురలవాటు; మొండిపట్టు.

**टौनी** - स्त्री० వడ్లదంపు.

**कुट्टिम** - पुं० రాతి కట్టడపునేల; రత్నముల గని; దానిమ్మ; గుడిసె.

**कुट्टी** - स्त्री० చొప్ప మొదలగు వానిని చిన్న చిన్న ముక్కలుగా నరికి పశువులకు వేయుమేత; ఈ విధమైన పశుగ్రాసము; మైత్రీ భంగము.

**कुठला** - पुं० ధాన్యముంచు పెద్దగాదె లేక బుట్టి; వడ్లపాతర.

**कुठाँव** - स्त्री० చెడు స్థలము; చెడ్డచోటు.

**कुठार** - पुं० దురాలోచన; అనుచితమైన ఏర్పాటు.

**कुठार** - पुं० గొడ్డలి ; గండ్రగొడ్డలి ; वि० నాశము చేయు.

**कुठाराधात** - पुं०గొడ్డలిపెట్టు; గొడ్డలిదెబ్బ; తీవ్రమైన ఆఘాతము.

**कुठारी** - स्त्री० చిన్న గొడ్డలి.

**कुठाली** - स्त्री० కంసాలి వాని మూస.

**कुठिया** - स्त्री० ; **कुठिला** - पुं० చిన్న ధాన్యపు గాదె.

**कुठौर** - पुं० చెడ్డచోటు; అదును కాని అదను.

**कुडक** - स्त्री० గుడ్లు పెట్టని కోడిపెట్ట.

**कुडकुडाना ; कुडबुडाना** - अ०क्रि० లోలోన కుములుట; ఇష్టములేనిది విని లేక చూచి లోలోపల బాధనొందుట. स०क्रि० పొలమునుండి పిట్టలను లేక

మృగములను పారద్రోలుట.

**कुडमल** - पुं० कली ; మొగ్గ.

**कुडमाई** - स्त्री०दे० सगाई.

**कुडौल** - वि० వికృతాకారము.

**कुढँग** - पुं० చెడు పోకడ; చెడు పద్ధతి.

**कुढँगा** - वि० తీరుతెన్నులేని; తెలివిలేని.

**कुढन** - स्त्री० మనస్సులోని మథన; లోలోన రగులుచుండు క్రోధము; కుళ్ళు (కోపము ఈర్ష్య వల్ల కలుగు) మనస్తాపము.

**कुढना** - अ०क्रि० లోలోన కుళ్ళుట - లోలోన ఈర్ష్య లేక క్రోధము వలన బాధ నొందుట.

**कुढब** - वि० వికారమైన; వికృతాకారముగల; కఠినమైన చెడు పద్ధతిగల.

**कुढाना**-स०क्रि० ఏడిపించుట; విసిగించుట; కోపము తెప్పించుట; బాధించుట.

**कुतका** - स०क्रि० గద; దుడ్డుకర్ర; అధికార దండము; బొటనవ్రేలు; బడిత; భంగు ఆకు నలుపుటకు ఉపకరించు దుడ్డుకర్ర.

**कुतना** - अ०क्रि० दे० कूतना.

**कुतरन** - स्त्री० కొరకబడిన ముక్క లేక తునియ ; అంశము.

**कुतरना** - स०क्रि० కొరుకుట; కొరికి ఒక వస్తువునుండి కొంత తీయుట.

**कुतर्क** - पुं० हुज्जत ; వితండ వాదము; మేరిండ వాదము.

**कुतर्की** - वि० हुज्जती ; వితండవాది.

**कुताही** - स्त्री० दे० कोताही.

**कुतिया** - स्त्री० ఆడకుక్క.

**कुतुब** - पुं० పుస్తకములు ; किताब का बहुवचन.

**कुतुब** - पुं० ధృవనక్షత్రము.

**कुतुबखाना** - पुं० గ్రంథాలయము.

**कुतुबनुमा** - पुं० దిక్సూచి; దిక్కులను చూపు యంత్రము.

**कुतुबफरोश** - पुं० పుస్తకములు అమ్మె వాడు.

**कुतूहल** - पुं० కుతూహలము, ఉత్సుకత.

**कुत्ता** - पुं० కుక్క.

**कुत्ती** - स्त्री० कुत्तिया ; ఆడకుక్క.

**कुत्ब** - पुं० दे० कुतुब.

**कुत्र** - क्रि० वि० कहाँ ; ఎక్కడ.

**कुत्सा** - स्त्री० నింద.

**कुत्सित** - वि० నిందనీయము; నిందింప బడిన; నీచమైన; గర్హింపదగిన.

**कुचना** - अ०क्रि० చావు దెబ్బలు తినుట.

**कुदकना** - अ०क्रि० कूदना ; దుముకుట.

**कुदक्कड** - वि० దుముకువాడు; దుముకు నట్టి.

**कुदरत** - स्त्री० ప్రకృతి; సృష్టి; మహిమ.

**कुदरती** - वि० ప్రాకృతమైన; ప్రకృతి సిద్ధమైన; స్వాభావికమైన.

**कुदाँव** - पुं० దుస్థితి; ఇబ్బంది; విషమస్థితి; విశ్వాస ఘాతము; మోసము.

**कुदाना** - स०क्रि० దుమికించుట.

**कुदाल ; कुदाली** - स्त्री० పార; గడ్డపార; త్రవ్వుకోల.

**कुनकुना** - वि० గోరువెచ్చని ( నీరు వగైరా)

**कुनबा** - पुं० परिवार ; పరివారము; కుటుంబము.

**कुनबी** - पुं० గృహస్థుడు; వ్యవసాయము వృత్తిగా చేయు ఒక హిందూ జాతి.

**कुनह** - पुं० వైరము; పగ.

**कुनही** - वि० వైరి; పగబూనినవాడు.

**कुनाई** - स्त्री० రంపపు పొట్టు; రంపపు పట్టుకాలి.

**कुनिया** - पुं० రంపము పట్టువాడు; లంచా వేయువాడు.

**कुन्दा** - पुं० दे० कुंदा.

**कुपाठ** - पुं० చెడుసలహా.

**कुपात्र** - वि० అపాత్రుడు; అయోగ్యమైన; తగని.

**कुपित** - वि० కోపగించిన క్రుద్ధుడగు.

**कुप्पा** - पुं० నెయ్యి; నూనె మొ॥ ఉంచుతోలు సిద్దె.

**कुप्पी** - स्त्री० చిన్నతోలు సిద్దె.

**कुप्रबन्ध** - पुं० कुव्यवस्था; చెడు ఏర్పాటు వ్యవస్థ.

**कुफ्र** - पुं० ఇస్లాము మతమునకు భిన్నమైన మతము; విగ్రహారాధన; కృతఘ్నత.

**कुबंड** - पुं० విల్లు; ధనస్సు.

**कुबजा** - स्त्री० గూని స్త్రీ; కొంకికర్ర.

**कुबडा** - पुं० గూనివాడు वि० వంకరగానున్న; వంగిన నడుముగల.

**कुबडी** - स्त्री० గూనిది; కొంకికర్ర.

**कुबानि** - स्त्री० చెడు అలవాటు; దురభ్యాసము.

**कुबानी** - पुं० చెడు వ్యాపారము.

**कुबेला** - स्त्री० చెడు కాలము; తగనికాలము.

**कुब्ज** - वि० గూనివాడు; पुं० గూనికలుగు జేయు ఒక వాత వ్యాధి.

**कुब्जा** - स्त्री० గూనిది; కంసునిదాసి; కృష్ణుని ప్రేయసి; భక్తురాలు.

**कुमंत्र** - पुं० ; **कुमंत्रणा** - स्त्री० చెడ్డ సలహా.

**कुमक** - स्त्री० సహాయము; కుమ్మకు; సమర్థన; పక్షపాతము.

**कुमकी** - वि० కుమ్మక్కైన; సాయమైన; పక్షపాతముగల; स्त्री० మగఏనుగుల పట్టుటకు సహాయపడు ఆడ ఏనుగు.

**कुमकुम** - पुं० కుంకుమ,కేసరము.

**कुमकुमा** - पुं० పిచకారు గొట్టము; లక్క గొట్టము.
**कुमारी** - स्त्री० 12 సంవత్సరముల లోపు బాలిక; పెళ్ళికాని పిల్ల లేక యువతి; స్త్రీ.
**कुमार्गी** - वि० చెడు నడతగల.
**कुमुद** - पुं० తెల్లకలువ.
**कुमुदनाथ** - पुं० చంద్రుడు.
**कुमुदनी ; कुमुदिनी** - स्त्री० కుముదముల సమూహము; తెల్లకలువ తీగె; కుముదముల తో నిండియున్న జలాశయము; తెల్ల కలువ పువ్వు.
**कुमुदिनीनाथ** - पुं० చంద్రుడు.
**कुम्मैत** - पुं० నలుపు వన్నె కలసిన ఎరుపు రంగు గుఱ్ఱము; वि० నలుపు - ఎరుపు రంగులు కలిసిన.
**कुम्हाडा** - पुं० గుమ్మడికాయ.
**कुम्हाडे की बतिया** - स्त्री० గుమ్మడిపిందె; అశక్తుడు.
**कुम्हडौरी** - स्त्री० గుమ్మడికాయ ఒడియము.
**कुम्हालाना** - अ०क्रि० వాడిపోవుట; కమిలిపోవుట; కాంతి విహీనమగుట.
**कुम्हार** - पुं० कुंभकार ; కుమ్మరి.
**कुम्हारिन** - स्त्री० కుమ్మరి స్త్రీ.
**कुयश** - पुं० बदनामी ; అపకీర్తి.
**कुरंग** - पुं० బాదము రంగుగల జింక; లేడి; నలుపు ఎరుపు రంగులు గల గుఱ్ఱము वि० చెడు రంగు గల.
**कुरंड** - पुं० బుద్ధ.
**कुरली** - स्त्री० दे० कुर्की.
**कुरकुर** - पुं० కరకరమను ధ్వని; పెళపెళ మను ధ్వని.
**कुरकुराहर** - स्त्री० కరకరమను ధ్వని.
**कुरता** - पुं० చొక్కా.
**कुरती** - स्त्री० రవిక; జాకెట్టు.
**कुरबान** - पुं० బలి; త్యాగము; वि० త్యజింపబడిన; బలి ఇవ్వబడిన.
**कुरबानी** - स्त्री० బలి; ఆత్మసమర్పణ; ఆహుతి; త్యాగము.
**कुरकुर ; कुरकुरा** - पुं० క్రౌంచపక్షి.
**कुररी** - स्त्री० క్రౌంచపక్షిణి.
**कुरसी** - स्त्री० కుర్చీ; తరము; కట్టడమునకు ముందు నిర్మించు చట్రము లేక పీఠము.
**कुरसीनामा** - पुं० వంశవృక్షము.
**कुरान** - पुं० ఇస్లాము మత గ్రంథము.
**कुरानशरीफ**-पुं० పవిత్ర కురాను గ్రంథము.
**कुराह** - स्त्री० చెడు మార్గము.
**कुराही** - वि० చెడు ప్రవర్తన గల; చెడు నడత గల.
**कुरिहार** - पुं० కోలాహలము; గందరగోళము.

**कुरी**-स्त्री॰ खानदान ; వంశము; మట్టి దిబ్బ.
**कुरीति** - स्त्री॰ దురాచారము; చెడు ఆచారము.
**कुरूख** - वि॰ కోపిష్ఠి; కోప స్వభావముగల.
**कुरेदना** - स॰ क्रि॰ గోకుట ; గీరుట; త్రవ్వుట.
**कुरेदनी** - स्त्री॰ కొలిమి లోనికి నిప్పులు మొదలైనవి ఎగత్రోయు తెడ్డు; గోకుటకు; త్రవ్వుటకు ఉపకరించు సాధనము.
**कुर्क** - वि॰ జప్తు; జప్తుకాబడిన; జప్తు చేయబడిన.
**कुर्कनामा** - पुं॰ జప్తుకు న్యాయస్థానము వారిచ్చు ఆజ్ఞాపత్రము.
**कुर्की** - स्त्री॰ సర్కారు వేలంపాట; జప్తు చేయుట.
**कुर्ता** - पुं॰ दे॰ कुरता.
**कुर्बानी** - स्त्री॰ दे॰ कुरबानी.
**कुर्मी** - स्त्री॰ వ్యవసాయము వృత్తిగా చేయు ఒకహిందూజాతి.
**कुर्रम** - पुं॰ भड़ुआ ; తార్పుగాడు; వేశ్యల దళారి తన భార్యచే వ్యభిచారము చేయించువాడు.
**कुर्स** - पुं॰ సూర్యబింబము; వెండినాణెము; మందుబిళ్ల.
**कुलंग** - पुं॰ కోడిపుంజు.
**कुल** - पुं॰ వంశము; కులము; గోత్రము. वि॰ మొత్తము; అంతయు; అందరు.
**कुल कानि** - स्त्री॰ వంశప్రతిష్ఠ, గౌరవము.
**कुलट** - पुं॰ వ్యభిచారి.
**कुलटा** - स्त्री॰ వ్యభిచారిణి.
**कुलत्थ** - पुं॰ ; **कुलथी** - स्त्री॰ ఉలవలు.
**कुलन** - स्त्री॰ टीस ; నొప్పి.
**कुलना** - अ॰क्रि॰ నొప్పి పెట్టుట; బాధ పెట్టుట.
**कुलफ** - पुं॰ ताला ; తాళము.
**कुलफत** - स्त्री॰ మనోవ్యథ; చింత.
**कुलफी** - स्त्री॰ గడ్డకట్టిన పాలపాత్ర - ఒక తిను పదార్థము.
**कुलबुलाना** - अ॰क्रि॰ వ్యాకులపడుట; కలతజెందుట; చిన్న చిన్న పురుగులు బిలాబిలా బయటికి వచ్చి ఇటూ - అటూ తిరుగుట.
**कुलबोरना** - पुं॰ వంశనాశకుడు.
**कुलह** - स्त्री॰ టోపి; గంత; వేటగాడు; పిట్టల కన్నులు మూయుటకు ఉపకరించు గంత.
**कुलही** - स्त्री॰ చంటి పిల్లల కుళాయి లేక టోపి.
**कुलांगार** -पुं॰ कुलबोरन ; కులనాశకుడు.
**कुलाँच** - स्त्री॰ దుముకు; గంతు.

**कुलाँचना** - अ०क्रि०छलाँगे मारना ; గంతులు వేయుట ; దుముకుతూ గంతులు వేయుట.
**कुलाल** - पुं० कुम्हार ; కుమ్మరి; అడవి కోడి; పుంజు; గుడ్లగూబ.
**कुलिक** - पुं० గొప్పశిల్పి; కులీనుడు; కులశ్రేష్ఠుడు.
**कुलिश** - पुं० వజ్రము; పిడుగు.
**कुली** - पुं० కూలివాడు.
**कुलीन** - पुं० కులీనుడు; మంచికులములో జన్మించినవాడు; సజ్జనుడు; సభ్యతగల.
**कुलेल** - स्त्री० క్రీడ; ఆట.
**कुलेलना** - अ०क्रि० క్రీడించుట; ఉల్లాసముగా కాలము గడుపుట.
**कुल्य** - पुं० ఎముక; కులీనుడు.
**कुल्या** - स्त्री० చిన్ననది; ఏరు; కులీనురాలు; తిప్పతీగ.
**कुल्ला** - पुं० పుక్కిలింత.
**कुल्ली** - स्त्री० दे० कुल्ला.
**कुल्हड** - पुं० మట్టి పిడత.
**कुल्हाडा** - पुं० పెద్దగొడ్డలి.
**कुल्हाडी** - स्त्री० గొడ్డలి.
**कुवलय** - पुं० నల్లకలువ; భూమండలము.
**कुवाँ** - पुं० कुआँ ; బావి; నుయ్యి.
**कुवाच्य** - पुं० దూషణ; తిట్టు.
**कुवार**-पुं० कुआर ; ఆశ్వయుజమాసము.
**कुविचारी** - वि० చెడు ఆలోచనగల; దురుద్దేశ్యముగల.
**कुव्वत** - स्त्री० कूवत ; శక్తి.
**कुश** - पुं० దర్భ; రాముని జ్యేష్ఠ పుత్రుడు.
**कुशल** - पुं० క్షేమము; ప్రావీణ్యము; శివుడు; वि० ప్రావీణ్యముగల; సమర్థుడైన.
**कुशल क्षेम** - पुं० క్షేమము; ఆరోగ్యము; శ్రేయస్సు.
**कुशाग्र**-वि० చురుకైన; తీక్షణమైన; పదునైన.
**कुशाग्रबुद्धि** - वि० సూక్ష్మ బుద్ధిగల.
**कुशादगी** - स्त्री० విస్తీర్ణము; వ్యాప్తి.
**कुशादा** - वि०విశాలమైన; వ్యాపించియున్న; బయలుగానున్న.
**कुशीलव** - पुं० భట్రాజులు; గాయకులు నటులు.
**कुश्तमकुश्ता** - पुं० లడాయి; కుస్తీ.
**कुश्ता** - वि० చంపబడిన पुं० పుటము వేసి సిద్ధముచేసిన భస్మము.
**कुश्ती** - स्त्री० మల్లయుద్ధము; కుస్తీ.
**कुश्ती खाना** - ० కుస్తీ ఓడిపోవుట.
**कुश्तीबाज** - वि० पहलवान ; కుస్తీ పట్టువాడు.
**कुश्ती मारना** - स०क्रि० కుస్తీగెలుచుట.
**कुसंग** - पुं० ; **कुसंगति** - स्त्री० చెడు

సాంగత్యము.
**कुसवारी** - पुं० అడవి పట్టుపురుగు.
**कुसाइत** - स्त्री० అశుభముహూర్తము; అసమయము.
**कुसी** - स्त्री० నాగలికఱ్ఱు.
**कुसीद** - पुं० सूद ; వడ్డీ ; వడ్డీధనము; వడ్డీకిచ్చిన డబ్బు.
**कुसीदा** - स्त्री० వడ్డీవ్యాపారము చేయు స్త్రీ.
**कुसीदिक ; कुसीदी** - पुं० వడ్డీ వ్యాపారి.
**कुसंभ** -पुं० కేసరము; బంగారము; కుంకుమ.
**कुसुम** - पुं० పువ్వు; స్త్రీరజస్సు; ఎఱ్ఱని రంగు; కుసుమ చెట్టు లేక పువ్వు.
**कुसुमांजन** - पुं० తుత్తునాగపు భస్మము.
**कुसुमांजलि** - स्त्री० పూలతో నిండిన దోసిలి.
**कुसुमाकर ; कुसु॰ ॥॥॥** - पुं० వసంత ఋతువు.
**कुसुमायुध** - पुं० कामदेव ; మన్మథుడు.
**कुसमावलि** - स्त्री० పుష్పపంక్తి; పూలగుత్తి.
**कुसुमित** - वि० పుష్పించిన; పూసిన.
**कुसूर** - पुं० दे० कसूर
**कुसूरवार** - वि० कसूर वार ; అపరాధి; దోషి.
**कुस्तंबरी** -स्त्री० ; **कुस्तूंबरु** - पुं० धनिया; కొత్తిమీర; కొత్తిమిరి.
**कुहक**-स्त्री० నెమలి; కోడి లేక కోయల కూత; पुं० మోసము; మాయ; దగాకోరు.
**कुहकना** - अ० क्रि० పక్షులు కూయుట.
**कुहकनी** - स्त्री० कोयल ; కోయిల.
**कुहना** - स० क्रि० చావ మోదుట; చితక కొట్టుట.
**कुहनिका** - स्त्री० మోసము; దంభము; కపటభక్తి
**कुहनी** - स्त्री० कोहनी ; మోచెయ్యి.
**कुहर** - पुं० గవ్వారము; రంధ్రము; బొరియ; పొగమంచు.
**कुहरा** - पुं० कुहासा ; పొగమంచు.
**कुहराम** - पुं० హాహాకారము; ఆర్తనాదము.
**कुहासा** - पुं० दे० कुहरा.
**कुही** - स्त्री० చిన్నడేగలాంటి పక్షి.
**कुहुक** - पुं० कूजन ; పక్షులకూత.
**कुहू** - स्त्री० అమావాస్యపు గాఢాంధకారము.
**कूँच** - स्त्री० సాలెవాని కొబ్బరినారతో తయారైన కుంచి; కాలి పెద్దనరము.
**कूँचा** - पुं० చీపురు.
**कूँची** - स्त्री० చిన్నకుంచె; చిన్న చీపురు; చిత్రకారుని కుంచె.
**कूंजडी** - स्त्री० కూరగాయలు అమ్ము స్త్రీ.
**कूँड** - स्त्री० శిరస్త్రాణము; మోటబాన; నాగలి చాలు.

**कूँडा** - पुं० పెద్ద బాన; పూలకుండి.
**कूँडी** - स्त्री० రాచిప్ప; పూలకుండి.
**कूँचना** - अ०क्रि० कराहना ; బాధతో మూలుగుట; పావురముల కూత.
**कूई** - स्त्री० తెల్లకలువ (పువ్వు)
**कूए** - पुं० సందు; గొంది.
**कूक** - स्त्री० कूजन ; కోకిల; నెమలి మొ॥ వాని మధుర కూజనము.
**कूकना** - अ०क्रि० పక్షులు కూయుట; గడియారమునకు కీ యిచ్చుట.
**कूकर** - पुं० कुत्ता ; కుక్క.
**कूच** - पुं० ప్రస్థానము; ప్రయాణము; అభిమానము.
**कूचकर जाना** - पुं० చనిపోవుట.
**(किसी के देवता) कूचकर जाना** - मु० ఉన్న చైతన్యము; వివేకము నశించుట.
**कूचा** - पुं० గొంది; సందు; చీపురు; క్రౌంచపక్షి.
**कूची** - स्त्री० दे० कूँची.
**कूज** - स्त्री० పక్షులకూత; బండి చక్రముల కదలిక శబ్దము.
**कूजन** - पुं० పక్షులకూత; మధురధ్వని.
**कूजा** - पुं० మట్టికూజా; మల్లెపూవు.
**कूजि.त** - वि० ధ్వనించిన; ప్రతిధ్వనించిన पुं० పక్షులకూత; బండి చక్రముల ధ్వని.
**कूट** - पुं० కల్ల; మోసము; పర్వత శిఖరము; చిక్కు ప్రశ్న; వ్యంగ్యము; కుట్ర; वि० మోసపు; అబద్ధపు.
**कूटकर्म** - पुं० మోసము.
**कूटकार** - पुं० प्रवंचक ; మోసగాడు.
**कूटनीति** - स्त्री० కుట్ర; రాజనీతిజ్ఞత.
**कूटना** - स०क्रि० దంచుట; కొట్టుట; నలుపుట; కూరుట.
**कूटायुध** - पुं० కర్రకత్తి; కర్ర; బెత్తము మొదలగు వానితో ఉంచిన కత్తి.
**कूटी** - स्त्री० దూతిక; తార్పుడుకత్తె.
**कूडा** - पुं० చెత్తా చెదారము; పెంట.
**कूडा–करकट** - पुं० కసువు; చెత్తచెదారము.
**कूढ** - पुं० వెర్రిబాగులవాడు; నాగలిసోగ.
**कूढ–मगज**-पुं० మూఢుడు; బుద్ధిహీనుడు.
**कूत** - स्त्री० अंदाजा ; అంచనా; ఊహ.
**कूतना** - स०क्रि० అంచనావేయుట.
**कूद** - स्त्री० గంతు.
**कूदना** - पुं० దుముకుట; ఎగిరిపడుట; स०क्रि० ఎగిరిదాటుట.
**कूद–फांद** - स्त्री० उछल-कूद ; కుప్పి గంతులు.
**कूप** - पुं० బావి; నుయ్యి.
**कूप मंडूक** - पुं० బావిలోని కప్ప; అల్ప పరిజ్ఞానము గలవాడు; అల్ప పరిజ్ఞాని.

**कूबड** - पुं० గూని; వంకర.
**कूर** - वि० క్రూరుడు; నిర్దయుడు.
**कूल** - पुं० తీరము; పటము; ఒడ్డు; పెద్ద కాలువ; సేన వెనుక భాగము; చెరువు; సెరూప్యము; अव्य० దగ్గర; సమీపమున.
**कूलवती** - स्त्री० कूलिनी ; నది.
**कूला** - पुं - నదినుండి త్రవ్విన చిన్న కాలువ; తుంటి ఎముక.
**कूलिनी** - स्त्री० दे० कूलवती.
**कूल्हा** -पुं० తుంటి ఎముక; ప్రక్కటెముక.
**कूवत** - स्त्री० कुव्वत ; శక్తి; బలము.
**कूवर** - पुं० బండిపోలు కర్ర वि० సుందరమైన; మనోహరమైన.
**कूष्मांड** - पुं० బూడిదగుమ్మడికాయ.
**कूह** - स्त्री० ఏనుగు ఘీంకారము.
**कूही** - स्त्री० డేగ జాతికి చెందిన ఒక పక్షి.
**कृत** - वि० చేయబడిన; రచింపబడిన.
**कृतक** - वि० కృత్రిమమైన; అనిత్యము; చేయబడిన.
**कृतकाम** - वि० కృతకృత్యుడు; కృతార్థుడు.
**कृतकार्य** - वि० ధనుడ్యు; కృతార్థుడు.
**कृतघ्न** - वि० పొందినమేలు మరచినవాడు; कृतघ्नी.
**कृतज्ञ** - वि० పొందినమేలు మరవనివాడు.
**कृतदंड** - पुं० यमराज ; యముడు.
**कृतवीर्य** - वि० పరాక్రమవంతుడు; కార్తవీర్యుని తండ్రి.
**कृतांजलि** - पुं० నమస్కరించినవాడు ; वि० జోడించినదోసిలి.
**कृतांत** - पुं० యముడు.
**कृतात्मा** - पुं० మహాత్ముడు.
**कृति** - स्त्री० రచన; చేత.
**कृती** - वि० పుణ్యాత్ముడు; ప్రవీణుడు.
**कृत्य** - पुं० కార్యము; కృత్యము; కర్తవ్యము.
**कृपण** - पुं० లోభి; పిసినిగొట్టు.
**कृपया** - क्रि० वि० कृपा करके; దయయుంచి.
**कृपाण** - पुं० ఖడ్గము; కత్తి.
**कृमि** - पुं० कीडा ; పురుగు; కీటకము.
**कृशानु** - पुं० నిప్పు; అగ్ని.
**कृशित** - पुं० కృశించిన; చిక్కిన.
**कृषक** - पुं० వ్యవసాయదారుడు; రైతు.
**कृषि** - स्त्री० వ్యవసాయము; సాగు.
**कृष्ण** - वि० నల్లని; దుష్టుడు; पुं० కాకి; వేదవ్యాసుడు; కోకిల.
**कृष्णा** - स्त्री० ద్రౌపది; కృష్ణానది.
**कृष्णाजिन** - पुं० నల్ల జింక చర్మము.
**कृष्णाभिसारिका** - स्त्री० చీకటి రాత్రియందు ప్రియునికొరకు సంకేతస్థలమునకు వెళ్ళు స్త్రీ.
**केंचली** - स्त्री० పాముకుబుసము.

**केंचुआ** - पुं० केंचुवा ; వానపాము; నులి పురుగు; ఎర (చేపలు పట్టుటకు)

**केंचुल** - पुं० - పాము కుబుసము.

**केंचुली**-वि०दे० केंचुल ; పాము కుబుసము వంటి.

**केंद्र** - पुं० ముఖ్యస్థానము; వృత్తపు మధ్య స్థానము; కేంద్రము.

**केकडा** - पुं० ఎండ్రకాయ.

**केकर** - पुं० మెల్లకన్ను; वि० మెల్ల కన్నుగల.

**केका** - स्त्री० నెమలి కూత; కేకారవము.

**केकी** - स्त्री० मोर ; నెమలి.

**केडा** - पुं० మొలక; చిగురుటాకు; నవయువకుడు.

**केत** - पुं० ఇల్లు; జండా.

**केतक** - पुं० జండా; మొగలి చెట్టు లేక పూవు. वि० చాలా; ఎన్ని; ఎంత; ఎందరు.

**केतकी** - स्त्री० మొగలిచెట్టు లేక పువ్వు.

**केतन** - पुं० జండా; స్థానము; ఇల్లు.

**केतिक** - वि० ఎన్ని; ఎందరు; ఎంత. क्रि०वि० ఎందరైనను; ఎంతైనను.

**केतो** -वि० ఎంత क्रि०वि० ఎంత అయినను సరే.

**केदार** - पुं० పాదు; మడి; ఒక రాగము (సంగీతము) హిమాలయ శిఖరము.

**केयूर** - पुं० బాజుబందు (ఒకనగ).

**केराना** - पुं० తిరగమూత - పోపు సామగ్రి स०क्रि० చేటలో బోసికొని నేముట.

**केला** - पुं० అరటిచెట్టు లేక కాయ; పండు.

**केरि** - स्त्री० केलि ; కేళి; ఆట; నవ్వులాట; మైథునము पुं० మొక్క.

**केरी** - स्त्री० अंबिया ; మామిడిపిందె.

**केवट** - पुं० मल्लाह ; పడవనడుపువాడు; చేపలు పట్టువాడు; పల్లె జాతిమనిషి.

**केवटी** - स्त्री० రెండు పప్పులు కలిపి వండిన పప్పు.

**केवडा** - पुं० మొగలి చెట్టు లేక పూవు.

**केवल** - वि० सिर्फ ; మాత్రము; కేవలము.

**केवा** - पुं० కమలము; మొగలి.

**केवाड** - पुं० दे० किवाड.

**केश** - पुं० జుట్టు; వెంట్రుక; జూలు; కిరణము.

**केशपाश** - पुं० కేశసమూహము; జూలు.

**केशर**-पुं० కుంకుమపువ్వు; పుష్పపరాగము.

**केशरी** - पुं० సింహము; గుఱ్ఱము.

**केशवेश** - पुं० వెంట్రుకల కొప్పు.

**केशी** - पुं०दे० केशरी.

**केस** - पुं० दे० केश.

**केसर** - पुं० కుంకుమపువ్వు; పుష్ప పరాగము; నాగకేసరము; జూలు.

**केसरिया** - वि० పసుపు వన్నెగల; కుంకుమ

పువ్వు వన్నె గల.

**केसरिया बाना**-पुं॰ వీరవేషము; 'జోహారు' సమయమున పసుపు వన్నెగల వేషము ధరించి ప్రాణములు తెగించి యుద్ధము చేయునపుడు వేషము.

**केसरी** - पुं॰ సింహము; నాగకేసరము; గుఱ్ఱము; హనుమంతుని తండ్రి పేరు.

**केसू** - पुं॰ टेसू ; మోదుగ పువ్వు.

**केहरि** - पुं॰ केसरी ; केहरी.

**केहरिनहा** - पुं॰ बघनख, बघनखा ; పులి గోరు.

**केहरी** - पुं॰ दे॰ केसरी.

**केहा** - पुं॰ मोर ; నెమలి.

**केहुनी** - स्त्री॰ कुहनी ; మోచేయి.

**कैंकर्य** - पुं॰ సేవ; దాస్యము.

**कैंचा** - पुं॰ పెద్దకత్తెర.

**कैंची** - पुं॰ చిన్నకత్తెర.

**कैडा** - पुं॰ పద్ధతి; ఒక విధమైన కొలత; రీతి.

**कै** - वि॰ ఎన్ని; ఎంతమంది; ఎందరు; स्त्री॰ డోకు; వమనము.

**कैटभ** - पुं॰ విష్ణువుచే చంపబడిన ఒక రాక్షసుడు.

**कैतव** - पुं॰ మోసము; ఉమ్మెత్త; జూదము.

**कैतून** - पुं॰ వస్త్రపు జరీ అంచులేక లేసు.

**कैथ ; कैथा** - पुं॰ వెలగ.

**कैथी** - स्त्री॰ చిన్న వెలగకాయ; ఒక లిపి.

**कैद** - स्त्री॰ జైలు శిక్ష; ప్రతి బంధము.

**कैदखाना** - पुं॰ బందిఖానా; జైలు ఖానా.

**कैदतनहाई** - स्त्री॰ అపరాధిని ఒంటరిగా ఇరుకైన చీకటి కొట్లో వేయు జైలు శిక్ష

**कैदमहज** - स्त्री॰ సాధారణమైన జైలు శిక్ష.

**कैदसक्त** - स्त्री - కఠిన కారావాస శిక్ష.

**कैदी** -वि॰ బందీ; ఖైదు చేయబడిన; అపరాధి.

**कैफ** - पुं॰ नशा ; మత్తు; కైపు.

**कैफियत** - स्त्री॰ వివరణ; స్పష్టీకరణ; సమాచారము; తబసీలు; ఆశ్చర్యకరముగా ఆనందము కలిగించు సంఘటన.

**कैफियत तलब करना** - पुं॰ నియమాను సారము వివరణ అడుగుట.

**कैफी** - वि॰ మత్తెక్కిన; నిషాలోనున్న.

**कैरव** - पुं॰ తెల్లకలువ; శత్రువు; మోసగాడు.

**कैरा** - वि॰ బూడిదరంగుగల; పిల్లికళ్ళు గలవాడు.

**कैरात** - पुं॰ నేలవేము.

**कैवर्त** - पुं॰ केवट ; పల్లెమనిషి; పడవ నడుపు మనిషి.

**कैवल्य** - पुं॰ మోక్షము; కైవల్యము; నిర్లిప్తత.

**कैसर** - पुं॰ రష్యా; జర్మనీ మొదలగు కొన్ని ఐరోపా దేశములలో చక్రవర్తి - బలుడు.

**कैसा** - वि॰ ఎటువంటి; ఎట్టి क्रि॰वि॰

**केंचुआ** - पुं० केंचुवा ; వానపాము; నులి పురుగు; ఎర (చేపలు పట్టుటకు)
**केंचुल** - पुं० - పాము కుబుసము.
**केंचुली**-वि०दे० केंचुल ; పాము కుబుసము వంటి.
**केंद्र** - पुं० ముఖ్యస్థానము; వృత్తపు మధ్య స్థానము; కేంద్రము.
**केकडा** - पुं० ఎండ్రకాయ.
**केकर** - पुं० మెల్లకన్ను; वि० మెల్ల కన్నుగల.
**केका** - स्त्री० నెమలి కూత; కేకారవము.
**केकी** - स्त्री० मोर ; నెమలి.
**केडा** - पुं० మొలక; చిగురుటాకు; నవయువకుడు.
**केत** - पुं० ఇల్లు; జండా.
**केतक** - पुं० జండా; మొగలి చెట్టు లేక పూవు. वि० చాలా; ఎన్ని; ఎంత; ఎందరు.
**केतकी** - स्त्री० మొగలిచెట్టు లేక పువ్వు.
**केतन** - पुं० జండా; స్థానము; ఇల్లు.
**केतिक** - वि० ఎన్ని; ఎందరు; ఎంత. क्रि०वि० ఎందరైనను; ఎంతైనను.
**केतो** -वि० ఎంత क्रि०वि० ఎంత అయినను సరే.
**केदार** - पुं० పాదు; మడి; ఒక రాగము (సంగీతము) హిమాలయ శిఖరము.
**केयूर** - पुं० బాజుబందు ( ఒక నగ).
**केराना** - पुं० తిరగమూత - పోపు సామగ్రి स०क्रि० చేటలో బోసికొని నేముట.
**केला** - पुं० అరటిచెట్టు లేక కాయ; పండు.
**केरि** - स्त्री० केलि ; కేళి; ఆట; నవ్వులాట; మైథునము पुं० మొక్క.
**केरी** - स्त्री० अंबिया ; మామిడిపిందె.
**केवट** - पुं० मल्लाह ; పడవనడుపువాడు; చేపలు పట్టువాడు; పల్లె జాతిమనిషి.
**केवटी** - स्त्री० రెండు పప్పులు కలిపి వండిన పప్పు.
**केवडा** - पुं० మొగలి చెట్టు లేక పూవు.
**केवल** - वि० सिर्फ ; మాత్రము; కేవలము.
**केवा** - पुं० కమలము; మొగలి.
**केवाड** - पुं० दे० किवाड.
**केश** - पुं० జుట్టు; వెంట్రుక; జూలు; కిరణము.
**केशपाश** - पुं० కేశ సమూహము; జూలు.
**केशर**-पुं०కుంకుమపువ్వు; పుష్పపరాగము.
**केशरी** - पुं० సింహము; గుఱ్ఱము.
**केशवेश** - पुं० వెంట్రుకల కొప్పు.
**केशी** - पुं०दे० केशरी.
**केस** - पुं० दे० केश.
**केसर** - पुं० కుంకుమపువ్వు; పుష్ప పరాగము; నాగకేసరము; జూలు.
**केसरिया** - वि० పసుపు వన్నెగల; కుంకుమ

పువ్వు వన్నె గల.

**केसरिया बाना**-पुं० వీరవేషము; 'జోహారు' సమయమున పసుపు వన్నెగల వేషము ధరించి ప్రాణములు తెగించి యుద్ధము చేయునపుడు వేషము.

**केसरी** - पुं० సింహము; నాగకేసరము; గుఱ్ఱము; హనుమంతుని తండ్రి పేరు.

**केसू** - पुं० टेसू ; మోదుగ పువ్వు.

**केहरि** - पुं० केसरी ; केहरी.

**केहरिनहा** - पुं० बघनख, बघनखा ; పులి గోరు.

**केहरी** - पुं० दे० केसरी.

**केहा** - पुं० मोर ; నెమలి.

**केहुनी** - स्त्री० कुहनी ; మోచేయి.

**कैंकर्य** - पुं० సేవ; దాస్యము.

**कैंचा** - पुं० పెద్దకత్తెర.

**कैंची** - पुं० చిన్నకత్తెర.

**कैडा** - पुं० పద్ధతి; ఒక విధమైన కొలత; రీతి.

**कै** - वि० ఎన్ని; ఎంతమంది; ఎందరు; स्त्री० డోకు; వమనము.

**कैटभ** - पुं० విష్ణువుచే చంపబడిన ఒక రాక్షసుడు.

**कैतव** - पुं० మోసము; ఉమ్మెత్త; జూదము.

**कैतून** - पुं० వస్త్రపు జరీ అంచులేక లేసు.

**कैथ ; कैथा** - पुं० వెలగ.

**कैथी** - स्त्री० చిన్న వెలగకాయ; ఒక లిపి.

**कैद** - स्त्री० జైలు శిక్ష; ప్రతి బంధము.

**कैदखाना** - पुं० బందిఖానా; జైలు ఖానా.

**कैदतनहाई** - स्त्री० అపరాధిని ఒంటరిగా ఇరుకైన చీకటి కొట్లో వేయు జైలు శిక్ష

**कैदमहज** - स्त्री० సాధారణమైన జైలు శిక్ష.

**कैदसक्त** - स्त्री - కఠిన కారావాస శిక్ష.

**कैदी** -वि० బందీ; ఖైదు చేయబడిన; అపరాధి.

**कैफ** - पुं० नशा ; మత్తు; కైపు.

**कैफियत** - स्त्री० వివరణ; స్పష్టీకరణ; సమాచారము, తబసీలు; ఆశ్చర్యకరముగా ఆనందము కలిగించు సంఘటన.

**कैफियत तलब करना** - पुं० నియమాను సారము వివరణ అడుగుట.

**कैफी** - वि० మత్తెక్కిన; నిషాలో నున్న.

**कैरव** - पुं० తెల్లకలువ; శత్రువు; మోసగాడు.

**कैरा** - वि० బూడిదరంగుగల; పిల్లికళ్ళు గలవాడు.

**कैरात** - पुं० నేలవేము.

**कैवर्त** - पुं० केवट ; పల్లెమనిషి; పడవ నడుపు మనిషి.

**कैवल्य** - पुं० మోక్షము; కైవల్యము; నిర్లిప్తత.

**कैसर** - पुं० రష్యా; జర్మనీ మొదలగు కొన్ని ఐరోపా దేశములలో చక్రవర్తి - బలుడు.

**कैसा** - वि० ఎటువంటి; ఎట్టి क्रि०वि०

ఎట్లు; ఎంత.

**कैसे** - क्रि०वि० ఎట్లు; ఏ విధముగా.

**कोंछना ; कोंछियाना** - स०क्रि० చీర కుచ్చిళ్ళు పోసి బొడ్డుక్రింద దూర్చుట.

**कोंछ** - पुं० చీరకొనలేక అంచు; స్త్రీలచెరగు కొన

**कोंछी** - स्त्री० కుచ్చిళ్ళు.

**कोंढा** - पुं० కొక్కెము; ఇనుపనాగవాసము.

**कोंढी** - स्त्री० కొక్కి; మొగ్గ; కొండి.

**कोंप** - स्त्री० कोंपल ; చిగురుటాకు.

**कोंपना** - अ०क्रि० చిగురువేయుట.

**कोंयल** - स्त्री० పల్లవము, చిగురుటాకు

**कोआ** - पुं० పట్టుపురుగు గూడ, కంటికొన; పనసతొనలేక పనస గింజ మీద ఉండు నన్నని పొర.

**कोइरी** - स्त्री० కూరగాయలమ్ము జాతి.

**कोइल** - स्त्री० कोयल.

**कोइली** - स्त्री० మామిడిటెంక; కోయిల

**कोई** - सर्व० ఎవరో, ఏదియో, ఎవ్వరైనను, రమారమి, దాదాపు.

**कोई न कोई** - सर्व० ఏదో ఒకటి, ఎవరో ఒకరు.

**कोक** - पुं० చక్రవాకపక్షి.

**कोकनद** - पुं० ఎర్ర తామర.

**कोकशास्त्र** - पुं० కామశాస్త్రము.

**कोका**-पुं० దాది సంతానము, కాఫీ, తేయాకు మాదిరి ఒక మొక్క ఆకు (లు); ఒక విధముగా

**कोख** - स्त्री० గర్భకోశము, ఉదరము, పొత్తి కడుపు.

**कोखजली** - वि० పుట్టిన సంతానము బ్రతకనట్టి స్త్రీ.

**कोच** - पुं० సంకోచము, ఒకవిధమగు (గుఱ్ఱపు) బండి.

**कोचवान** - पुं० గుఱ్ఱపు బండి తోలువాడు

**कोट** - पुं० किला ; దుర్గము, కోట; కోటబురుజు; కోటి.

**कोटर** -पुं० చెట్టుతొఱ్ఱ, కోట రక్షణ నిమిత్తం దాని చుట్టూ పెంచిన అడవి.

**कोटिक**-वि०करोडों; కోట్లకొలది, అమితమగు.

**कोटिश** - क्रि०वि० కోటి విధముల, ఎన్నో విధములుగా.

**कोठरी** - स्त्री० గది, కొట్టు.

**कोठा** - पुं० భండారము, పెద్దగది, డాబా పైని గది, జీర్ణకోశము

**कोठार** - पुं० ధాన్యపు కొట్టు, పాతర, గాదె.

**कोठारी** - स्त्री० చిన్నచిన్న సామానుల కొట్టు; గిడ్డంగి అధికారి.

**कोठी** - पुं० పెద్ద భవంతి; వడ్డీ వ్యాపారము

మొ॥ జరుగు పెద్దకొట్టు; ధాన్యపు కొట్టు.

**कोठीवाल** - पुं० పెద్దవ్యాపారి, వడ్డీవ్యాపారి, టోకు వ్యాపారి.

**कोडना** - स०क्रि० పొలములోని మట్టి కుళ్ళించుట, పెళ్ళగించుట, త్రవ్వుట.

**कोडा** - पुं० కొరడా; ప్రేరేపించు మాట, మనసునొప్పించు మాట; హెచ్చరిక.

**कोडाई** - पुं०పొలములోని మట్టికుళ్ళగించు పని; కూలి పొలములో గడ్డవిరుపు పని.

**कोडी** - स्त्री० 20 వస్తువుల సమూహము वि० ఇరువది.

**कोढ** - पुं० కుష్ఠు రోగము.

**कोढी** - पुं० కుష్ఠురోగి.

**कोण** - पुं० కోణము, మూల, అంచు, దుడ్డు కర్ర, దిక్కులు.

**कोतल** - पुं० రాజుగారి స్వారీ గుఱ్ఱము; అలంకరించిన ఆట గుఱ్ఱము, పని పాట లేనివాడు

**कोतवाल** - पुं० పోలీసు విభాగపు అధికారి, పోలీసు ఇనస్పెక్టరు.

**कोतवाली** - स्त्री० పోలీసు స్టేషను, పోలీసు అధికారులుండు చోటు.

**कोताह** - वि० కురచ, పొట్టి, చిన్న.

**कोताह गरदन** - मु० కురచ మెడ వాడు, ధూర్తుడు.

**कोताही** - स्त्री० कमी ; లోటు, దోషము, లోపము; పొట్టితనము.

**कोथला** - पुं० పొట్ట, పెద్ద సంచి.

**कोथली** - स्त्री० రూపాయలు, వజ్రాలు పోసి నడుముకు కట్టుకొను ఒకవిధమగు సంచి.

**कोंदड** - पुं० ధనుస్సు, కనుబొమ్మ.

**कोदों ; कोदो** - पुं० కొఱ్ఱలు; కొఱ్ఱ ధాన్యము.

**कोदों देकर पढना या सीखना** - मु० నచ్చి రానట్లు చదువుట. **(छाती पर) कोदों दलना** - मु० ఈర్ష్యాలు, ఎదుటనే ఈర్ష్య కలుగచేయుట.

**कोना** - पुं० మూల, మారుమూల.

**कोनिया** - स्त्री० గోడమూలనున్న అట్టక లేకగూడు.

**कोपना** - अ०क्रि० नाराज होना ; కోప గించుట.

**कोपल**-पुं० कोंपल; చిగురు, చిగురు టాకు.

**कोपीन** - पुं० कौपीन ; గోచి.

**कोफ्त** - स्त्री० దుఃఖము, కష్టము, కలత, చింత

**कोफ्ता** - पुं० నేయించిన మాంసము, కైమా, वि० కలత చెందిన

**कोबी** - स्त्री० पात गोभी ; క్యాబేజి.

**कोमल** - वि० మృదువైన, మెత్తని, అందమైన
**कोयल** - स्त्री० కోకిల.
**कोयला** - पुं० రాక్షస బొగ్గు, గని బొగ్గు.
**कोया** - पुं० కంటికొలికి, పసుతొన, పట్టుపు రుగు గూడు.
**कोर** - स्त्री० పంక్తి ; అంచు; మూల; కొన; కొన; ద్వేషము; ఆయుధపు పదును; వాడి తనము.
**कोर-कसर**-स्त्री०**कमी;** లోటు, లోపము.
**कोरनिश** - स्त्री० ప్రమాణము, సాష్టాంగ ప్రమాణము.
**कोरमा** - पुं० నేతిలో వేయించిన మాంసము.
**कोरा** - वि० స్వచ్ఛమైన, రంగులేని, ఖాళి యగు, ఉపయోగింపని, కళంకములేని; చదువు సంధ్యలు లేని, బోలుగానున్న.
**कोरी** - पुं० హిందూ సాలె వాడు.
**कोल** - पुं० ఒక అడవి జాతి, ఎరుకల జాతి వాడు, పంది, ఒడి, రేగుపండు, మిరియ ములు.
**कोलना** - स०क्रि० బోలుగా చేయుట.
**कोलिया** - पुं० ఇరుకు సందు.
**कोली** - स्त्री० ఒడి, గంగరేగు, ఇరుకుగొంది, హిందూ సాలెవాడు.
**कोल्हू** - पुं० గానుగ.
**कोल्हू का बैल** - पुं० చేసిన పనే చేస్తూ ఉండువాడు; ఎద్దువలే చాకిరి చేయువాడు.
**कोविद** - वि० విద్వాంసుడు, ప్రవీణుడు.
**कोश** - पुं० నిఘంటువు; ఖజానా, ధనా గారము, గ్రుడ్డు, తొడిమ, అండకోశము; పట్టుపురుగు గూడు, మొగ్గ, కత్తి ఒర
**कोशलर** - पुं० పట్టుపురుగు ; నిఘంటు కారుడు, కత్తి ఒరచేయువాడు.
**कोशिश** - स्त्री० ప్రయత్నము.
**कोष्ठ** - पुं० ఇంటిలోపలి భాగము, మూత్రా శయము, సామాన్ల కొట్టు; ప్రాకారము, పొట్ట, పిత్తాశయము; గాదె, మలాశ యము, లోకడుపు, కుండలీ కరణము () గుర్తు, బ్రాకెట్టు.
**कोष्ठक** - पुं० ప్రాకారము; కుండలీకరణము () గుర్తు, బ్రాకెట్టు.
**कोष्ठबद्धता** - स्त्री० **कब्जियत** - మల బద్ధకము
**कोष्ठी** - स्त्री० జాతక చక్రము, జన్మపత్రిక.
**कोस** - पुं० రెండు మైళ్ళ దూరము, మూడు కిలోమీటర్ల దూరము.
**कोसना** - स०क्रि० తిట్టుట, దూషించుట.
**कोसा** - पुं० మట్టి మూకుడు, ఒకవిధమైన పట్టు.
**कोसिया** - स्त्री० మట్టి సిడత.
**कोह** - पुं० పర్వతము, క్రోధము.

**कोहकन** - वि० కొండ త్రవ్వువాడు; తన ప్రేమ, అరబ్‌దేశాచారము ననుసరించి ఫరహాద్ అను వ్యక్తి బేసతూన్ అను పర్వతమును త్రవ్వి కాలువను తయారు చేసెను, కనుకనే కోహకన్ అను శబ్దము, ఫరహాద్‌కు మారు పేరు అయినది.

**कोहकाफ** - पुं० ఆసియా-ఐరోపా ఖండముల మధ్యనున్న అప్సరసలు ఉండు పర్వత శ్రేణి.

**कोहनी** - स्त्री० कुहनी ; మోచెయ్యి.

**कोह-नूर** - पुं० कोहे-नूर ; కోహినూరు వజ్రము.

**कोहबर** - पुं० వివాహ సందర్భమున కుల దేవతలు స్థాపించు ఇల్లు లేక ప్రదేశము.

**कोहरा** - पुं० कुहासा ; పొగమంచు.

**कोहसार**-पुं०పర్వత ప్రాంతము; పర్వతము.

**कोहान** - पुं० ఒంటె వీపుమిది గూను.

**कोहिस्तान** - पुं० పర్వత ప్రదేశము; కొండ ప్రాంత ము.

**कोही** - वि० క్రోధి; క్రోధము గల; పర్వత సంబంధమైన.

**कौंध** - स्त्री० మెరుపు; మెరుపు తీగ.

**कौंधना** - अ०क्रि० మెరయుట.

**कौंधा** - स्त्री० మెరుపు; మెరుపు తీగ.

**कौआ** - पुं० కాకి; కొండనాలుక; నీచుడు.

**कौधनी** - स्त्री० ఒడ్డాణము; మొలత్రాడు.

**कौआना** - अ०क्रि० కలవరించుట; ఉలిక్కిపడుట.

**कौआपरी** -स्त्री०బహు కురూపియైన స్త్రీ.

**कौटिल्य** - पुं० చాణక్యుడు; కపటము; కుటిలుడు.

**कौटुंबिक** - वि० पारिवारिक ; కుటుంబ సంబంధమైన.

**कौडा** - पुं० పెద్ద గవ్వ.

**कौडिया** - वि० कौडिल्ला पक्षी ; లకుముకి పిట్ట; గవ్వ వంటి; గవ్వ వంటి ఆకారము.

**कौडी** - स्त्री० కంటి కొలికి; కప్పము; ధనము.

**कौडीका** - मु० తుచ్ఛమైన; విలువలేని.

**कौडीभर** -मु० మిక్కిలి స్వల్పము; గవ్వపాటి.

**कौतुक**-पुं० వినోదము; ఆశ్చర్యము; తమాషా

**कौतुकिया** -पुं० ; **कौतुकी** - वि० తమాషా చేయువాడు, పరిహాసము చేయువాడు.

**कौतूहल** - पुं० ఆశ్చర్యము; జిజ్ఞాస; ఉల్లాసము.

**कौन** - सर्व० ఏది; ఎవరు; ఏవి; ఎవడు. वि०ఏవిధమైన; ఎటువంటి.

**कौपीन** - पुं० గోచి; కౌపీనము.

**कौम** - स्त्री०జాతి; వంశము; కులము.

[illegible] - वि० జాతీయ వాది.

**कौमार**- पुं० కిశోరదశ; కౌమార్యము.

**कौमियत** - स्त्री॰ జాతీయత; జాతీయ అభిమానము.

**कौमी** - वि॰ జాతీయము; జాతీయమైన.

**कौमी जबान** - स्त्री॰ జాతీయ భాష.

**कौमुदी** - स्त्री॰ స్వచ్ఛమైన వెన్నెల- జ్యోత్స్న; ఆశ్వయుజ కార్తీక మాసముల పూర్ణిమ రోజు వెన్నెల.

**कौर** - पुं॰ ముద్ద, కబళము.

**कौरी** - स्त्री॰ ఒడి.

**कौल** - वि॰ కులీనుడు, ఉత్తమ కులమున జన్మించినవారు.

**कौल**-पुं॰ ఉక్తి మాట, వాక్యము, ఒడంబడిక.

**कौल करार** - पुं॰ పరస్పర ఒడంబడిక; ఒప్పందము.

**कौला** - पुं॰ ఒక విధము కమలాపండు.

**कौवा** - पुं॰ కాకి; నీచుడు; కొండనాలుక.

**कौवाली** - स्त्री॰ మహమ్మదీయులకు సంబంధించిన ఒక విధమైన గీతము.

**कौशल** - पुं॰ బాల్యము; క్షేమము; కోశల ప్రాంత నివాసి.

**कौशेय** - पुं॰ పట్టువస్త్రము.

**कौस** -स्त्री॰ విల్లు; ధనుస్సు; ధనురాశి; కమాను.

**कौस** - ए॰ कजह ; स्त्री॰ ఇంద్రధనస్సు.

**कौस्तुभ** - पुं॰ విష్ణువుచే వక్షస్థలమందు ధరింపబడురత్నము.

**क्या** - सर्व॰ ప్రశ్నవాచక సర్వనామము; ఏమి

**क्यारी**-स्त्री॰ పూలమడి; ఉప్పుమడి; వరిమడి.

**क्यों** - (अव्य॰)क्रि॰वि॰ किसालिए ; ఎందుకు; ఎందుకొరకు.

**क्योंकि** - अव्य॰ ఎందుకనగా.

**क्यों कर** - क्रि॰वि॰ कैसे; ఎట్లు.

**क्यों नहीं** - अव्य॰ నిస్సందేహముగా ; తప్పకుండా.

**क्यों न हो** - अव्य॰ ఎందుకుకాదు.

**क्रंदन** - पुं॰ విలాపము; ఏడుపు; యుద్ధ ఘోషము.

**क्रतुपशु** - पुं॰ యజ్ఞపు గుఱ్ఱము.

**क्रतुपुरुष** - पुं॰ విష్ణువు.

**क्रमशः**-अव्य॰ क्रि॰वि॰ క్రమానుసారము; క్రమక్రమముగా.

**क्रमांक** - पुं॰ క్రమసంఖ్య.

**क्रमागत** - वि॰ వంశపారంపర్యముగా; ధారావాహికమైన.

**क्रय** - पुं॰ खरीद ; కొనుట; కొనుగోలు; క్రమము.

**क्रय- विक्रय** ; पुं॰ కొనుట- అమ్ముట; క్రయవిక్రయములు.

**क्रयी** - पुं॰ కొనువాడు.

**क्रांत** - वि॰ ఆక్రమింపబడిన; ఆక్రమించిన; అణచబడిన; మీరిన.

**क्रांति** - स्त्री० విప్లవము; పెద్దమార్పు.

**क्रिमि** - स्त्री० కీటకము; పురుగు; లక్క; పెద్ద సాలెపురుగు.

**क्रिया** - स्त्री० పని; చేష్ట; అనుష్ఠానము; ఆరంభము; ధాత్వర్థము.

**क्रिया कर्म** - पुं० అంత్యేష్టిక్రియ; శ్రాద్ధకర్మ; ఉపచారము; చికిత్స.

**क्रिस्तान** - पुं० ईसई; క్రైస్తవ మతావలంబుడు.

**क्रीट** - पुं० కిరీటము.

**क्रीडा** - स्त्री० ఆట; క్రీడ; వినోదము.

**क्रीडाशील** - वि० ఆటలయందు ఆసక్తిగల.

**क्रीत** - वि० కొనబడిన.

**क्रेता** - पुं० కొనువాడు.

**क्रोड** - पुं० गोद ; ఒడి; పక్షస్థలము; శని గ్రహము; పంది.

**क्रोडपत्र** - पुं० అనుబంధము.

**क्रोधित** - वि० క్రోధించిన.

**क्रौंच** - पुं० క్రౌంచ పక్షి; ఒక పర్వతము.

**क्रौर्य** - पुं० క్రౌర్యము; క్రూరత.

**क्लांत** - वि० అలసిన; బడలిన.

**क्लांति**-स्त्री० थकावट ; అలసట, బడలిక.

**क्लिन्न** - वि० తడిగానున్న; తడిసిన.

**क्लिष्ट** - पुं० కఠినమైన; క్లిష్టమైన; దుఃఖము నొందిన; త్వరగా బోధపడని.

**क्लीब** - पुं० నపుంసకుడు; పిరికివాడు.

**क्लेश** - पुं० దుఃఖము; నొప్పి; పీడ.

**क्लेशकर** - पुं० బాధాకరమైన.

**क्लैब्य** - पुं० నపుంసకత్వము.

**क्वचित** - अव्य० అరుదుగా; ఎక్కడనో.

**क्वणित** - वि० మ్రోగుచున్న; ధ్వనించుచున్న; ధ్వనించిన.

**क्वाथ** - पुं० కషాయము; బాధ.

**क्वार** - पुं० ఆశ్వయుజమాసము.

**क्वारा** - पुं० क्वारा ; అవివాహితుడు; పెళ్ళి కానివాడు.

**क्षंतव्य** - वि० క్షమింపదగిన; సహింపదగిన.

**क्षंता** - वि० ఓర్పుగలవాడు; ఓర్పువాడు; సహించువాడు.

**क्षण** - पुं० క్షణము; క్షణికము.

**क्षणदा** - स्त्री० రాత్రి.

**क्षणिकता** -स्त्री० అనిత్యత; క్షణభంగురము.

**क्षत** - पुं० గాయము; పుండు; దుఃఖము वि० గాయపడిన; ఖండితమైన; నాశమైన.

**क्षतयोनि** - वि० పురుష సంపర్కము కల్గిన స్త్రీ.

**क्षत-विक्षत** - वि० ఖండఖండములైన; భగ్నమైన; వ్రణములుగల.

**क्षति** - स्त्री० నష్టము; హాని; గాయము; నాశము.

**क्षतिग्रस्त** - वि० నష్టపడిన; నష్టపోయిన.

**क्षतिपूर्ति** - स्त्री॰ నష్టపరిహారము.
**क्षत्र** - पुं॰ బలము; క్షత్రియుడు; శరీరము; రాజ్యము; ధనము.
**क्षत्रधर्म** - पुं॰ క్షాత్రధర్మము; క్షత్రియుని కర్తవ్యము.
**क्षत्रप** - पुं॰ ప్రదేశాధిపతి; గవర్నరు; పారశీక మండలాధి పతులు బిరుదు.
**क्षपणक** - पुं॰ బౌద్ధబిక్షు; బౌద్ధమతస్తుడు.
**क्षपा** - स्त्री॰ రాత్రి; పసుపు.
**क्षम** - वि॰ సమర్థుడు; ఓర్పుగల; యోగ్యమైన पुं॰ శక్తి; యోగ్యత.
**क्षमता** - स्त्री॰ యోగ్యత; సామర్థ్యము.
**क्षमा** - स्त्री॰ **माफी**; క్షమాశీలత; ఓర్పు; సహన శీలత; భూమి.
**क्षमा-प्रार्थना**-पुं॰ క్షమాపణ వేడు కొనుట.
**क्षमित** - वि॰ క్షమించబడిన.
**क्षमी** - वि॰ ఓర్పుగల; క్షమించువాడు.
**क्षम्य** - वि॰ క్షమింపదగిన.
**क्षय**-पुं॰ క్షయరోగము; తగ్గుదల; ప్రళయము; అంతము.
**क्षयपक्ष** - पुं॰ కృష్ణపక్షము.
**क्षर** - वि॰ నశ్వరము; నశించు.
**क्षरण** - पुं॰ క్షీణత; కారుట; స్రవించుట.
**क्षात्र** - पुं॰ క్షాత్రధర్మము; క్షత్రధర్మము; క్షత్రియత్వము; క్షత్రియ సంబంధమైన.
**क्षाम**-पुं॰ క్షామము; నాశము; वि॰ క్షీణించిన అల్పము.
**क्षार** - पुं॰ ఉప్పు; కారము; గాజు; బూడిద; వెలిగారము.
**क्षार भूमि** - पुं॰ చవుటినేల.
**क्षालन** - पुं॰ శుభ్రము చేయుట; కడుగుట.
**क्षलित** - वि॰ కడుగబడిన; శుభ్రపరచబడిన.
**क्षिति** - स्त्री॰ భూమి; పృథ్వి.
**क्षितज** - पुं॰ భూమ్యాకాశములు కలియు చున్నట్లుతోచురేఖ ; క్షితిజము; వాన పాము; మంగళగ్రహము; వృక్షము.
**क्षिप्र** - क्रि॰वि॰ శీఘ్రముగా; वि॰ వేగముగా పోవునట్టి.
**क्षीर** - पुं॰ **दूध** ; పాలు; క్షీరము.
**क्षीरजा** - स्त्री॰ లక్ష్మీదేవి.
**क्षुण्ण** - वि॰ అభ్యస్తమైన; నూరబడిన; పొడిచేయబడిన; ఓడింపబడిన.
**क्षुद्र** - वि॰ నీచమైన; తుచ్ఛమైన; క్షుద్రుడు; అల్పుడు; లోభి.
**क्षुधा** - स्त्री॰ **भूख** ; ఆకలి.
**क्षुधित** - वि॰ **भूखा** ; ఆకలిగొన్న.
**क्षुप** - पुं॰ పొద.
**क्षुब्ध** - वि॰ వ్యాకులపడిన; కలతజెందిన; కల్లోలితమైన; కోపించిన ; पुं॰ కవ్వము.
**क्षुभित** - वि॰ दे॰ **क्षुब्ध**.

**क्षुर** - पुं० మంగలికత్తి.

**क्षुरिका** - स्त्री० మంగలికత్తి.

**क्षुरी** - स्त्री० కత్తి; వాకు पुं० మంగలివాడు; గిట్టలు గల పశువు.

**क्षेत्र** - पुं० పొలము; క్షేత్రము; పరిసుడి; భార్య; శరీరము; ఇల్లు.

**क्षेत्रपाल** - पुं० కాపలివాడు; కాపలామనిషి.

**क्षेत्रफल** - पुं० విస్తీర్ణము.

**क्षेप** -पुं० విసుర్కుట; కాలము వెళ్ళబుచ్చుట; నింద; నెట్టుట; వ్యాప్తి; లేపనము; దెబ్బ.

**क्षेपक** - वि० నెట్టువాడు; విసుర్కువాడు; కలసిన; క్షేపనము; పైన కలసిన భాగము.

**क्षेपण** - पुं० ఆక్షేపణ; పడవేయుట; విసరివేయుట; ప్రేరేపించుట; విసుర్కుట; గడుపుట.

**क्षोणि ; क्षोणी** -स्त्री० భూమి; '1' (ఒకటి) సంఖ్య.

**क्षोभ** - पुं० కలత; వ్యాకులత; భయము.

**क्षोभना** - अ०क्रि० భయపడుట; వ్యాకుల పడుట.

**क्षौणि ; क्षौणी** - स्त्री० భూమి; ఒకటి సంఖ్య.

**क्षौर** - पुं० క్షవరము; తలగొరిగించు కొనుట.

**क्षौरिक** - पुं० हज्जाम ; మంగలి.

# ख

**खंख** - वि० శూన్యము; పాడుబడిన.

**खंखर** -वि० పాడుపడిన; నిర్జనమైన; బోలుగా నున్న; శూన్యముగు.

**खँखार** - पुं० కఫ్ఫ.

**खँखारना** - अ०क्रि० కాండ్రించి ఉమ్మి వేయుట; సంకేత సూచకముగా సకిలించుట లేక దగ్గుట.

**खंग** - पुं० ఖడ్గము; కత్తి; గాయము.

**खंगहा** - पुं० गैंडा ; ఖడ్గమృగము.

**खंगना** - अ०क्रि० తగ్గుట; లోటువచ్చుట.

**खंगालना** - स०क्रि० పైపైన కడుగుట; అంతయు కాజేయుట.

**खंगुवा** - पुं० ఖడ్గమృగపు కొమ్ములేక ఖడ్గము.

**खंचना** - स०क्रि० చిత్రించుట; చెక్కుట; దిగకొట్టుట.

**खंज** - वि० కుంటియైన; पुं० ఒక విధముగు రోగము; కుంటివాడు.

**खंजडी** - स्त्री० दे० खंजरी.

**खंजन** - पुं० కాటుక పిట్ట.

**खंजर** - पुं० ఒక విధముగు ఖడ్గము.

**खंजरी** - स्त्री० ఖంజిరా; వాద్య విశేషము; ఖంజిరి.

**खंड** -पुं०విభాగము; ఖండము; అధ్యాయము - భాగము; కలకండ; ఖడ్గము; చక్కెర.

**खंडन** - पुं० ఖండించుట; విరుచుట.

**खंडशीली** - स्त्री० వ్యభిచారిణి; వేశ్య.

**खंडहर** - पुं० ధ్వంసావశేషము; పడిపోయిన ఊరు లేక ఇల్లు.

**खंडित** - वि० భగ్నమైన; విరుగగొట్టబడిన; విరిగిన.

**खंडिता** - स्त्री० ప్రియుడు అన్య స్త్రీలను ప్రేమించుచున్నాడని కోపించు నాయిక.

**खंता** - पुं० గునపము; పార; త్రవ్విన గుంట లేక గొయ్యి.

**खंदक** - पुं० కందకము.

**खंधार** -पुं०चौकी ; సేనలు విడియుచోటు; శిబిరము; డేరా.

**खंधियाना** - स०क्रि० ఖాళీచేయుట.

**खंभ ; खंभा** - पुं० స్తంభము; పోటి; ఆధారము.

**खखार** - पुं० कफ ; కళ్ళె; ఉమ్మి.

**खखारना** -अ०क्रि० కళ్ళపడునట్లు కాండ్రించుట; కాండ్రించి ఉమ్మివేయుట.

**खग** - पुं० పిట్ట; పక్షి.

**खगना** - अ०क्रि० గ్రుచ్చుకొనుట; నాటుకొనుట; स०क्रि० దూర్చుట ; చొప్పించుట.

**खगोल** - पुं० ఆకాశమండలము.

**खचन** - पुं० చిక్కుకొనుట; రాళ్ళు (రత్నములు) మొ॥ పొదుగుట.

**खचना** - पुं० చిక్కుకొనుట; రత్నములు మొ. పొదగబడుట; చిత్రింపబడుట; అంకితమగుట.

**खचर** - वि० గగనగామి; पुं० పక్షి; మేఘము; బాణము; గంధర్వులు; రాక్షసుడు.

**खचरा** - वि० వర్ణసంకరమైన; నీచమైన.

**खचाखच** - क्रि०वि० टसाटस ; క్రిక్కిరిసియుండు; పూర్తిగా నిండిన.

**खचाना** - स०क्रि० చెక్కుట; చిత్రించుట; రత్నములు మొ॥ పొదుగుట; త్వరత్వరగా వ్రాయుట.

**खचित** - वि० చెక్కబడిన; పొదగబడిన.

**खच्चर** - पुं० కంచరగాడిద.

**खजानची** - पुं० కోశాధిపతి.

**खजाना** - पुं० ఖజానా; ధనాగారము.

**खजुराही** - स्त्री० ఖర్జూరపు తోట.

**खजूर** - पुं० ఖర్జూరము; చిట్టీ.

**खजोहरा** - पुं० గొంగళి పురుగు.

**खट** - पुं० గుద్దు; గొడ్డలి; स्त्री० రాపిడి ధ్వని.

**खटसे** - क्रि०वि० తక్షణము; తత్కాలము; వెంటనే.

**खटक** - अ०क्रि० చింత; భయము; సందేహము; దుఃఖము.

**खटकना** - अ०क्रि० సరిపడకపోవుట; నచ్చక

పోవుట; కలహము; పొసగుట; ఖటఖట మని ధ్వని వచ్చుట; అప్రియ మగుట.

**खटका** - पुं० తలుపు గొళ్ళెము; గొళ్ళెము; తలుపుకొట్టిన ధ్వని; భయము; చింత; సంకోచము.

**खटकट** - स्त्री० ఖటఖటమను ధ్వని; జగడము; తక్రారు ; తగాదా.

**खटखटाना**-स०क्रि० ఖటఖటమని తలుపు కొట్టిన ధ్వని; దేనినైన చేతితో తట్టుట; జ్ఞప్తిచేయుట.

**खटना** - स०क्रि० ధనోపార్జన చేయుట; ఎక్కువగా శ్రమించుట अ०क्रि० వ్యాకుల పడుట.

**खटगीर** - पुं० खटमल ; నల్లి.

**खटपर** - स्त्री० జగడము; తగాదా.

**खटमल** - पुं० నల్లి.

**खटमिट्टा; खटमीठा** - वि० పులుపు - తీపి కలసిన రుచిగల; పుల్ల పుల్లని; తియ్య తియ్యని.

**खटराग** - पुं० జగడము; జంజాటము ; తంటా; పనికిరాని వస్తువులు.

**खटाई** - स्त्री० పులుపు; పులుపుదనము.

**खटाखट** - क्रि०वि० झटपट ; వెంటనే; శీఘ్రముగా; ఖట ఖటమను శబ్దముతోడ.

**खटाना** - अ०क्रि० పరీక్షలో ఉత్తీర్ణమగుట; పురియుట; स०क्रि० నిర్వహించుట అట్టేపెట్టుట.

**खटापट ; खटापटी** - स्त्री० జగడము; విరోధము; పోట్లాట.

**खटाव** - पुं० నిర్వహణ; జీవనము.

**खटास** - स्त्री० పులుపు पुं० పునుగు పిల్లి; అడవి పిల్లి.

**खटिक** - पुं० పళ్ళు; కూరగాయలు అమ్ము వృత్తి చేయు ఒక జాతి.

**खटिका** - स्त्री० సుద్ద; బలపము; కర్ణ రంధ్రము.

**खटिया** - स्त्री० చిన్నమంచము.

**खटेला** - पुं० ఉయ్యాల మంచెము (చిన్న పిల్లలకు).

**खट्टा** - वि० పుల్లని.

**खट्टा होना**-पुं० కోపగించుట; కుపితుడగుట.

**खटवा** - स्त्री० दे० खटिया.

**खट्टू**-पुं० అతి కష్టంమీదసంపాదించు వాడు.

**खड** - पुं० ఒక విధమగు గడ్డి; ఎండుగడ్డి.

**खडकना** - अ०क्रि० दे० खटकना.

**खडबडाना** - अ०क्रि० గాబరా పడుట; గల్లంతు పడుట; కలవరపడుట.

**खडबडी** - स्त्री० గడబిడ; తారుమారు; అల్లరి భయము.

**खडबिडा** - वि० మెరక పల్లములు గల; కలత

చెందిన.

**खडबीहड** - वि० ఎగుడు దిగుడుగానున్న; కఠినమైన.

**खडसान** - पुं० खरसान ; సానరాయి.

**खडा** - वि० నిలబడిన; నిలుచున్న; సిద్ధమైన; అమలులోనున్న; అపక్వము.

**खडाऊँ** - स्त्री० పావుకోళ్ళు; పాదుకలు.

**खडाका** - पुं० दे० खटका.

**खडाखेत** - पुं० నిలువు పైరు; పంటచేను.

**खडिया** - स्त्री० సీమసున్నపు ముక్క.

**खडी बोली** - स्त्री० ఆధునిక హిందీ రూపము; చలామణిలోనున్న హిందీ రూపము.

**खड्ग** - पुं०दे० तलवार.

**खड्ड ; खडढा**-पुं० గొయ్యి; తొట్టి; బొరియ.

**खत** - पुं० గాయము.

**खत** - पुं० ఉత్తరము; జాబు; గడ్డము మీది వెంట్రుకలు; క్షౌరము.

**खतकिताबत** - स्त्री० ఉత్తర ప్రత్యుత్తరములు; పత్రవ్యవహారము.

**खतना** - पुं० సున్తీ; ముసల్మానుల సున్తీచేయు ఆచారము.

**खतम** - पुं० సమాప్తి; ముగింపు.

**खतरनाक** - वि० భయంకరమైన; అపాయకరమైన.

**खतरा** - पुं० అపాయము; గండము; జంకు.

**खता**-स्त्री०कसूर; అపరాధము; పొరపాటు; మోసము; పాపము.

**खतावार** - वि० అపరాధి; పాపి.

**खति** - स्त्री० క్షతి; నష్టము; హాని.

**खतियाना** - स०क्रि० పద్దువ్రాయుట.

**खतियौनी** - स्त्री० खाता बही ; ఆవర్జా.

**खतीब**-पुं०వక్త; ధర్మోపదేశము చేయువాడు.

**खत्ता** - पुं० పాతర; గుంట లేక గొయ్యి.

**खत्म** - वि० पुं० दे० खतम.

**खत्री** - पुं० క్షత్రియులయందొక తెగ.

**खदकदाना ; खदबदाना** - पुं० ఖదఖద మని ధ్వని చేస్తూ ఉడుకుట.

**खदर** - वि० పనికిమాలినది.

**खदशा** - पुं० अंदेशा ; భయము ; జంకు.

**खदान** - पुं० గని.

**खदिर** - पुं० చంద్రవృక్షము; ఇంద్రుడు; చంద్రుడు.

**खदीजा** - स्त्री० హజరత్ ముహమ్మద్ మొదటి భార్య.

**खदीब** - पुं० యజమాని; చక్రవర్తి; భాగ్యవంతుడు; ఈజిప్టు చక్రవర్తుల బిరుదు.

**खदेडना ; खदेरना** - स०क्रि० బయటకు నెట్టుట; పారద్రోలుట; బలవంతాన గెంటుట.

**खद्दर** - पुं० ఖద్దరు; చేతితో వడికిచేతి మగ్గము మీదనేయబడిన గుడ్డ.
**खद्योत** -पुं० మిణుగురు పురుగు; సూర్యుడు.
**खनक** - पुं० భూగర్భ శాస్త్రజ్ఞుడు; కన్నపు దొంగ; ఎలుక; భూమిని త్రవ్వువాడు.
**खनकना** - पुं० ఖణఖణమని మ్రోగుట ; ఖంగు మని మ్రోగుట.
**खनखजूरा** - पुं० కాళ్ళజెర్రి.
**खनन** - पुं० ఖననము; త్రవ్విపూడ్చుట.
**खनना** - स०क्रि० త్రవ్వుట.
**खनि** - स्त्री० గని; గుహ; గొయ్య.
**खनिज** - पुं० ధాతువు; ఖనిజము; वि० గని నుండి బయటకు తీసినది.
**खन्नास** -पुं० పిశాచము; రాక్షసుడు; దుష్టుడు.
**खपची** - स्त्री० సన్నని వెదురు చువ్వ లేక బద్ద.
**खपडा** - पुं० పెంకు; కుండపెంకు; తాబేటి పుర్రె.
**खपडी** - स्त्री० **खोपडी** ; పుర్రె; చిల్లపెంకు; ఒక విధమగు మట్టిపాత్ర.
**खपडैल** - स्त्री० दे० **खपरैल**.
**खपत; खपती** - स्त्री० అమ్మకము; ఖర్చు.
**खपना**-पुं० ఖర్చు అగుట; ఉపయోగపడుట.
**खपरैल** - पुं० పెంకు; పెంకు కప్పు; పెంకు టిల్లు.
**खपाना** - स०क्रि० ఉపయోగించుట; నిర్వాహము చేయుట; ఖర్చుపెట్టుట.
**खप्पड या खप्पर**-पुं० తలపుర్రె; భిక్షా పాత్ర.
**खफगी** - स्त्री० కోపము; క్రోధము.
**खफा** - वि० క్రోధించిన; కుపితుడైన.
**खबर** -स्त्री० సమాచారము; వార్త; సందేశము; జాడ.
**खबरगीर** - पुं० గుప్తచారుడు; సాయము చేయువాడు.
**खबरदार** - वि० హెచ్చరిక గల; ముందు జాగ్రత్తగల.
**खबरदारी** - स्त्री० మెలుకువ; హెచ్చరిక.
**खबररसाँ** - पुं० వార్తాహరుడు; దూత.
**खबरलेना** - पुं० సమాచార మెరుగుట; దండించుట.
**खबीस** - पुं० భయంకరుడు; పిసనారి; ధూర్తుడు; పిశాచి.
**खब्त** - पुं० **सनक** ; వ్యామోహము; పిచ్చి ; వెర్రి.
**खब्ती** - वि० **पागल** ; పిచ్చివాడు.
**खम** - पुं० వంపు; వంకర.
**खम खाना** - వంగుట; లొంగుట.
**खम ठोकना** - पुं० తొడచరిచి సవాలు చేయుట.
**खमदम** - पुं० **हिम्मत** ; సాహసము; పురుషార్థము.

**खमीदा** - वि० వంగిన; వంకరగానున్న.

**खमीर** - पुं० పులిసిన పిండి; స్వభావము; ప్రకృతి.

**खमीरा** - पुं० పాకము పట్టి తయారుచేసిన ఔషధము.

**खम्माच** - स्त्री० ఒకరాగము; (సంగీతము)

**खम्र** - पुं० మద్యము; సారాయి.

**खयानत** - स्त्री० దాయమని ఇచ్చిన వస్తువును లేక తాకట్టు పెట్టిన వస్తువును తిరిగి ఇవ్వకుండుట; నమ్మకద్రోహము; అపహరణ.

**खयाल** - पुं० दे० ख्याल.

**खयालात** - पुं० ख्याल का बहु.

**खयाली** - वि० दे० ख्याली.

**खय्यात** - पुं० दर्जी ; దర్జీ - దర్జీ పనిచేయువాడు.

**खय्याम**-पुं० డేరాలు తయారుచేయువాడు.

**खयालेखाम** - पुं० భ్రమ.

**खर** - पुं० గాడిద; పదును; వాడియైన; తీక్ష్ణమైన; ఒక రాక్షసుడు.

**खरक** - पुं० పశువుల పాక; గోశాల; వెదురు బద్దల తలుపు ; తడిక; स्त्री० బాధ; భయము.

**खरकना** - अ०क्रि० ఖటఖటమను ధ్వని వచ్చుట; బాధకలుగుట; నచ్చుకపోవుట; జారుకొనుట.

**खरका**-पुं० तिनका; గడ్డిపరక; పల్లుపుడక-భోజనానంతరము పల్లు శుభ్రపరచుపుడక

**खरखशा**-पुं० झगडा ; పోట్లాట; జగడము.

**खरग** - पुं० ఖడ్గము.

**खरगाह** - पुं० డేరా.

**खरगोश** - पुं० కుందేలు.

**खरच** - पुं० ఖర్చు.

**खरचना** - स०क्रि० ఖర్చుపెట్టుట.

**खरचा** - पुं० ఖర్చు; పెట్టుబడి; ఖర్చు.

**खरतल** - वि० ప్రచండమైన; స్పష్టవాది; నిష్కపటి

**खरतूम** - पुं० ఏనుగు తొండము.

**खरदल** - पुं० ఆవాలు.

**खर दिमाग** - वि० गोबर गणेश ; పరమ మూర్ఖుడు.

**खरदिल** - वि० डरपोक ; పిరికివాడు.

**खरधार** - पुं० బహుపదునైన.

**खरनफ्स** - वि० బహుదీర్ఘమైన జననేంద్రియము గలవాడు; కాముకుడు; వ్యభిచారి.

**खरब** - वि० వంద వందలకోట్ల సంఖ్య ; 1,00,00,00,00,000.

**खरबूज ; खरबूजा** - पुं० పుచ్చకాయ.

**खरभर** - पुं० కోలాహలము; గలభా.

**खरभरना** - अ०क्रि० గలభా జరుగుట; అల్లరి జరుగుట.

**खरमस्ती** - स्त्री० शरारत ; కొంటె తనము; దౌష్ట్యము; నైచ్యము.

**खरभोहरा** - पुं० గవ్వ; చిన్ననత్తగుల్ల.

**खरल** - पुं० కల్వము; మందులునూరు కల్వము.

**खरसा** - पुं० ఒక విధమగు పిండివంట.

**खरसान** - पुं० సానరాయి ; పదును పెట్టు రాయి.

**खरहरना** - पुं० పొలికట్టతో ఊడ్చుట.

**खरहरा** - पुं० పొలికట్ట; గుఱ్ఱముల వెంట్రుకలను శుభ్రపరచు ఒక విధమగు దువ్వెన.

**खरहा** - पुं० కుందేలు.

**खरांशु** - पुं० సూర్యుడు.

**खरा** - वि० శుద్ధమైన; తీక్ష్ణమైన; కల్తీలేని.

**खराई** - स्त्री० ; శుద్ధత; నిజాయితీ; మంచితనము; **खरापन**-पुं० నిష్కళంకత.

**खराद** - पुं० చిత్రిక; తరిమిపట్టుసాధనము.

**खरादपर चढना या उतरना** - मु० సరి అగుట; నిగ్గుతేలుట.

**खरादना** - स०क्रि० చిత్రికపట్టుట; తరిమిన పట్టుట.

**खरादी** - पुं० చిత్రిక పట్టువాడు.

**खराब** - वि० बुरा ; చెడు; చెడ్డ; దిక్కుమాలిన; నీతిలేని.

**खराबा** - वि० పాడుపడిన; సాగుకు పనికిరాని; पुं० నాశము.

**खराबी** - स्त्री० बुराई ; దోషము; ధ్వంసము; నాశము.

**खराश** - स्त्री० खरोच ; గీసుకొనినందున పడినగాయపు గీత; గంటు.

**खरास** - स्त्री० పిండి తిరుగలి.

**खरिया**- पुं० సీమసున్నము; జోలె; వలసంచి.

**खरिहान** - पुं० కళ్ళము; రాశి.

**खरी** - स्त्री० ఆడగాడిద ; సీమసున్నము.

**खरीता** - पुं० పెద్దకవరు; సూది - దారము; ఉంచు చిన్న సంచి; జేబు.

**खरीद** - स्त्री० క్రయము; కొనుబడి; కొన్న వస్తువు.

**खरीद-फरोख्त** - स्त्री० క్రయ-విక్రయములు; కొనుగోలు - అమ్మకాలు.

**खरीदना** - स०क्रि० కొనుట.

**खरीदार ; खरीद्दार** - पुं० గ్రాహకుడు; కొనువాడు.

**खरीदारी** - स्त्री० కొనుబడి.

**खरीफ** - स्त्री० జూన్ 4 జనవరి మధ్య కాలమున వచ్చుపంట.

**खरोंच** - स्त्री० గంటు; గీత.

**खरोंचना ; खरोटना** - स०क्रि० గోకుట; గీరుట.

**खर्च ; खर्चा** - वि० ఖర్చు; వ్యయము;

పెట్టుబడి ఖర్చు.

**खचीला** - वि० అమితముగా ఖర్చుచేయు వాడు; దుబారా ఖర్చు చేయువాడు.

**खजूर** - पुं० खजूर ; ఖర్జూరము; వెండి; తేలు.

**खर्व** - पुं० కుబేరుని నిధి; భగ్న అంగము గలవాడు; పొట్టి; చిన్న వికలాంగుడు.

**खरी** - पुं० పెద్ద చిట్కా; ఒక విధమగు చర్మ రోగము.

**खरांच** - वि० దుబారా ఖర్చు చేయువాడు.

**खर्राट** - पुं० గురక.

**खल** - पुं० నీచుడు; ఖలుడు; ధూర్తుడు; కళ్ళము.

**खलक** - पुं० జీవరాశి; ప్రపంచము.

**खलकत** - स्त्री० సృష్టి.

**खलखल** - पुं० ఖలఖలమను ధ్వని; ఖలఖల నవ్వు ధ్వని.

~~**खलना** - अ.क्रि० చెడ్డగా అనిపించుట;~~ మనస్సునొచ్చుట. स०क्रि० కల్వములో మందునూరుట.

**खलफ** - पुं० బాలుడు; పుత్రుడు; ఉత్తరాధి కారి.

**खलबल** - स्त्री० గలభా; గోల.

**खलबलाना** - अ०क्रि० తెర్లుట; చలించుట; కలతచెందుట. स०क्रि० వ్యాకుల పెట్టుట; కలవరపెట్టుట.

**खलबली** - स्त्री० గందరగోళము; కలవరము; వ్యాకులత.

**खलल** - पुं० అడ్డు; అడ్డంకి.

**खलल अंदाज** - वि० అడ్డుపడువాడు; ఆటంకపరచువాడు.

**खलल दिमाग**-पुं० చిత్తచాంచల్యము; పిచ్చి; విక్షిప్తి वि० చపలచిత్తుడు; పిచ్చివాడు.

**खलवत** - स्त्री० ఏకాంతవాసము; నిర్జన స్థానము.

**खलवत खाना** - पुं० మంత్రణా గృహము; స్త్రీలు విశ్రమించు స్థానము.

**खला** - पुं० శూన్యస్థానము; ప్రకాశము; మరుగుదొడ్డి; పడవనడుపు తెడ్డు - చుక్కాని.

**खलास** - वि० సమాప్తమైన; పడిన; ముక్తినొందిన; वि० మోక్షము; విముక్తి; వీర్యపాతము.

**खलासी** - स्त्री० ముక్తి; నివృత్తి; విడుదల; ఓడలు; పడవలు మొదలగు వానిలో పని చేయువాడు; గుడారములు వేయు నౌకరు.

**खलियान** - पुं० కళ్ళము; రాశి.

**खलियाना** - स०क्रि० మేకమొ। వాటి తోలు వలుచుట; చీల్చుట; ఖాళీ చేయుట.

**खलिश** - स्त्री० బాధ; నొప్పి; ద్వేషము.

**खलिहान** - पुं॰दे॰ खलियान.

**खली** - स्त्री॰ గానుగ పిండి; తెలగపిండి (చెక్క)

**खलीक** - वि॰ సజ్జనుడు; కలుపుగోలు మనిషి; గుణవంతుడు.

**खलीज** - स्त्री॰ खाडी ; ఖాతము.

**खलीता** - पुं॰ दे॰ खरीता.

**खलीफा** - पुं॰ మహమ్మదీయులు మత గురువు; వృద్ధుడు; తెలివైనవాడు; వంట వాడు; మంగలి; హజరత్ మహమ్మద్ వారసుడు; వారసుడు.

**खलील** - पुं॰ నిజమైన మిత్రుడు.

**खलेश** - वि॰ दे॰ मौसेरा.

**खलेल** - पुं॰ నూనె మడ్డి.

**खल्क** - स्त्री॰ జీవరాశి; సృష్టి; ప్రపంచము.

**खल्लड** - पुं॰ తోలు; తోలుసంచి; మందులు నూరు కల్వము.

**खल्वाट**-पुं॰బట్టతల वि॰బట్టతల గలవాడు.

**खवास** - पुं॰ రాజ సేవకుడు; ధనవంతుల వ్యక్తిగత సేవకులు.

**खवैया** - पुं॰ తినువాడు; తిండిబోతు.

**खशम** - पुं॰ రోషము; క్రోధము.

**खशमगीन ; खशमनाक** - वि॰ కుపితమైన; క్రోధముగల.

**खस** - स्त्री॰ వట్టివేరు.

**खसकना** - अ॰क्रि॰ दे॰ खिसकना.

**खसखस** - पुं॰ గసగసాలు; నల్లమందు విత్తులు.

**खसना** - अ॰क्रि॰ రాలుట; జారుట.

**खसम** - पुं॰ యజమాని; భర్త.

**खसरा** - पुं॰ దురద; గజ్జి; పొలము నంబరు, విస్తీర్ణము మొ॥ వ్రాసి ఉండు గ్రామ కరణము పుస్తకము.

**खसलत** - स्त्री॰ आदत ; అలవాటు, స్వభావము, గుణము.

**खसाना** - स॰क्रि॰ పడవేయుట; పడ ద్రోయుట.

**खसासत** - स्त्री॰ నైచ్యము; పిసినారతనము; కార్పణ్యము.

**खसिया** - पुं॰ కొజ్జా; మేకపోతు; वि॰ బుడ్డ కొట్టిన జంతువు; నపుంసకుడు.

**खसी** - वि॰ दे॰ खसिया.

**खसीस** - वि॰ లోభి; పిసినారి; నీచుడు.

**खसूसन** - वि॰ खासकर ; ముఖ్యముగా.

**खसूसियत** - स्त्री॰ విశిష్టత; విశేషత; ముఖ్యత.

**खसोटना**-स॰क्रि॰ **नोचना;** దోచుకొనుట; లూటీ చేయుట; బలాత్కారముగా లాక్కొనుట; పెకలించుట.

**खस्ता** - वि॰ పెళుసైన; అలసిన; గాయబడిన.

**राँड**–स्त्री॰ విధవ; వైధవ్యము పొందిన స్త్రీ; వేశ్య.

**राँधना**–स॰क्रि॰ వంట చేయుట.

**राइ**–पु॰ చిన్నరాజు; సర్దారు.

**राई**–स्त्री॰ సన్నావాలు.

**राई नोन उतारना**–पु॰ఆవాలు, ఉప్పుతో పిల్లవానికి దిష్టితీయుట.

**राका**–स्त्री॰ పూర్ణిమ రోజు రాత్రి; పూర్ణిమ తిథి.

**राकापति; राकेश**–पु॰ చంద్రుడు.

**राख**–स्त्री॰ బూడిద, భస్మము.

**राखी**–स्त्री॰ రక్షాబంధన దారము లేక తోరము; రక్ష.

**रागी**–पु॰ అనురాగి, ప్రేమికుడు, वि॰ ఎర్రని;విషయవాసనలలో చిక్కుకున్న.

**राज**–पु॰ రహస్యము

**राज**–पु॰ రాజ్యము; శాసనము; రాజు; తాపీ పనివాడు.

**राजकर**–पु॰ ప్రభుత్వపు పన్ను.

**राजगद्दी**–स्त्री॰ రాజసింహాసనము.

**राजगीर**–पु॰ తాపీపనివాడు.

**राजना**–अ॰क्रि॰ ఉండుట; విరాజిల్లుట.

**राजमराल**–पु॰ రాయంచ; రాజహంస.

**राजयक्ष्मा**–पु॰ క్షయరోగము.

**राजश्री**–स्त्री॰ రాజుగారి ఐశ్వర్యము.

**राजस**–वि॰ రజోగుణమునకు సంబంధించిన.

**राजसी**–वि॰ రాజయోగ్యమైన; రాజుల వలె హోదా గల.

**राजस्व**–पु॰ दे॰ राजकर.

**राजि; राजिका**–स्त्री॰ శ్రేణి; పంక్తి; వరుస

**राजी**–स्त्री॰ శ్రేణి; పంక్తి.

**राजी**–वि॰ అంగీకరించిన; స్వస్థతగల సంతోషము గల.

**राजी खुशी**–यौ॰ కుశలము; అనుకూలత

**राजीनामा**–पु॰ సంధిపత్రము.

**राजीव**–पु॰ నీలోత్పలము; నీలకమలము

**राज्ञी**–स्त्री॰ రాణి; పట్టపురాణి.

**राज्ययंत्र**–पु॰ రాజ్యపరిపాలనా పద్ధతి

**राज्यव्यवस्था**–स्त्री॰ రాజ్యచట్టము; రాజ్యవ్యవస్థ.

**राट्**–पु॰ రాజు.

**राठ**–पु॰ రాజ్యము.

**राड**–वि॰ హేయమైన; చేతకాని; పిరికి.

**रात**–स्त्री॰ रजनी; రాత్రి.

**रातिब**–पु॰ పశువులమేత; దాణా.

**राधना**–स॰क्रि॰ ఆరాధించుట;పూజించుట.

**राना**–पु॰ రాణా; अ॰क्रि॰ అనురక్తమైన.

**राब**–स्त्री॰ गुड; బెల్లము.

राबडी–स्त्री॰ दे॰ रबडी.

राबिता–पु॰ కలుపుగోరుతనము; సంబంధము, బాంధవ్యము.

रामरस–पु॰ नमक ;ఉప్పు.

राय–स्त्री॰ అభిప్రాయము; సలహా
पुं॰ రాజు; సామంతుడు; భట్రాజు
वि॰ శ్రేష్ఠమైన.

रायज–वि॰ రివాజులోనున్న, అనువాయి తీగా నున్న.

रायता–पुं॰ ఒక విధమగు పెరుగు పచ్చడి లేక మజ్జిగ పులుసు.

रार–पुं॰ జగడము; తంటా; తక్రారు.

राल–स्त्री॰ ధూపము; చొంగ.

राल गिरना या चूना–मु॰ నోరూరుట.

रावटी–स्त्री॰ చిన్న గుడారము లేక డేరా.

रावत–पुं॰ చిన్నరాజు; సర్దారు; ఒక జాతి.

रावल–पुं॰ అంతఃపురము; రాజు; సర్దారు

राशि–स्त्री॰ కుప్ప; పోగు; జ్యోతిష్యము లోని రాశి.

राष्ट्र–पुं॰ రాజ్యాంగ చట్టము గల దేశము; జాతి.

राष्ट्रतंत्र–पुं॰ రాజ్య శాసన విధానము.

रास–स्त्री॰ గుఱ్ఱపు కళ్లెము; ఒక విధమగు నృత్యము.

रासक–पुं॰ ఒక విధమగు ప్రహసనము

रासभ–पुं॰ గాడిద; కంచర గాడిద.

रास्त–वि॰ తిన్ననైన; సరైన; ఉచితమైన.

रास्ता–वि॰ మార్గము; దారి; ఉపాయము

रास्ता देखना–मु॰ వేచి యుండుట.

रास्ता पकडना–मु॰ వెళ్లిపోవుట.

रास्ता बताना–मु॰ టక్కరి తనము చేయుట.

राह–स्त्री॰ త్రోవ; దారి; ఆచారము.

राह देखना या ताकना–मु॰ వేచియుండుట.

राह पडना–मु॰ లూటీ పడుట; దోపిడీ జరుగుట.

राह लगाना–मु॰ తనదారినతను వెళ్లుట; తన పనిని చక్క బెట్టుకొనుట.

राहखर्च–पुं॰ దారిభత్యము.

राहगीर–पुं॰ యాత్రికుడు; బాటసారి.

राहजन–पु॰ लुटेरा;దోపిడీ దొంగ.

राहत–स्त्री॰ విశ్రాంతి, సుఖము.

राहदारी–स्त्री॰ రోడ్డు మీద నడిచినందుకు పన్ను, సుంకము.

राह व रस्म–स्त्री॰ मेलजोल; ఐకమత్యము; కలుపుగోరు తనము.

राहित्य–पुं॰ అభావము; లేకపోవడము; రాహిత్యము.

राहिन–वि॰ తాకట్టు పెట్టువాడు.

रहिला–पुं॰ काफिला; యాత్రికుల సమూహము.

राही–पुं॰ యాత్రికుడు; బాటసారి.

**राहुल**–पुं॰ గౌతమ బుద్ధుని కుమారుని పేరు.

**रिंद**–पुं॰మత సంబంధమైన నిబంధనలను అంగీకరించని వాడు; విచ్చలవిడిగా వ్యవహరించువాడు; స్వేచ్ఛాజీవి.

**रिंदा**–वि॰ నిరంకుశుడు; ఉద్దండుడు.

**रिआयत**–स्त्री॰ మినహాయింపు; రాయితీ.

**रिआयती**–वि॰ రాయితీగా ప్రాప్తించిన.

**रिआया**–स्त्री॰ जनता; ప్రజ.

**रिकाब**–स्त्री॰ दे॰ रकाब.

**रिक्कत**–स्त्री॰ కోమలత్వము;మార్దవము; శోకము; దయ; స్థితి.

**रिक्त**–वि॰ ఖాళీగా నున్న; పేద.

**रिज्क**–पुं॰ వృత్తి; జీవనము.

**रिझवरि**–वि॰ (स्त्री॰)మోహించునది.

**रिझाना**–स॰क्रि॰ మోహించుట; తన మీద ప్రేమ జనింప జేయుట.

**रिझावल; रिझवार**–वि॰అనురక్తమగు; మోహితమైన.

**रिझाव**–पुं॰ మోహము; ప్రసన్నత.

**रिन**–पुं॰ दे॰ ऋण.

**रिपु**–पुं॰ दुश्मन; శత్రువు.

**रिमझिम**–स्त्री॰వర్షపు తుంపర పడుతూనే ఉండుట.

**रिया**–स्त्री॰ మోసము; కపటము.

**रियाकार**–वि॰ మోసము చేయువాడు; దగాకోరు.

**रियायत**–स्त्री॰ दे॰ रिआयत.

**रियासत**–स्त्री॰ రాజ్యము; సంస్థానము; వైభవము.

**रिरना**–अ॰क्रि॰ దేవిరించుట.

**रिवाज**–पुं॰ అనువాయితీ; రివాజు.

**रिश्ता**–पुं॰ సంబంధము; బంధుత్వము

**रिश्तेदार**–पुं॰ नातेदार;సంబంధీకుడు; చుట్టము; బంధువు.

**रिश्वत**–स्त्री॰ घूस ;లంచము.

**रिश्वतखोर**–वि॰లంచగొండి; లంచము పుచ్చుకొను.

**रिश्वतखोरी**–स्त्री॰లంచగొండితనము

**रिश्वती**–वि॰ दे॰ रिश्वतखोर.

**रिस**–स्त्री॰ రోషము; క్రోధము.

**रिसमारना**–पुं॰ కోపమును ఆపుకొనుట

**रिसना**–अ॰क्रि॰కారుట; బొట్లుబొట్లుగా కారుట.

**रिसवाना; रिसाना**–अ॰क्रि॰ కుపితమగుట; కోపించుట.

**रिसाल**–पुं॰ इरसाल ;ప్రభుత్వమునకు ఇచ్చు పన్ను; ఇరసాలు.

**रिसालदार**–पुं॰అశ్వసైన్యపు ఒక అధికారి

**रिसाला**–पुं॰ అశ్వారోహి సేన.

रिहल–स्त्री॰ వ్యాసపీఠము.
रिहा–वि॰ విడుదలైన; స్వతంత్రమైన.
रिहाई–स्त्री॰ విడుదల; విముక్తి.
रींधना–स॰क्रि॰ दे॰ राँधना.
रीछ–पु॰ भालू;ఎలుగుబంటి.
रीझ–स्त्री॰ ముగ్ధత; ప్రసన్నత.
रीझना–अ॰क्रि॰ ముగ్ధమగుట; మోహింపబడుట.
रीठा–पु॰ కుంకుడు చెట్టు లేక కాయ.
रीढ–स्त्री॰ వెన్నెముక; మేరు దండము.
रीता–वि॰ రిక్తమైన; ఖాళీగానున్న.
रीति–स्त्री॰ మాదిరి; పద్ధతి; శైలి; రివాజు.
रीस–स्त्री॰ ఈర్ష్య, పోటీ.
रीसना–अ॰क्रि॰ రోషించుట; క్రుద్ధమగుట.
रुंड़–पुं॰ శిరస్సులేని మొండెము.
रुँधना–अ॰क्रि॰దారిదొరకక ఆగిపోవుట; చిక్కుకొనిపోవుట; ముట్టడింపబడుట.
रुआब–पुं॰ दे॰ रोब.
रुई–स्त्री॰దూది.
रुकना–अ॰क्रि॰ ఆగుట.
रुकावट–स्त्री॰ ఆగుదల; ఆటంకము; విఘ్నము.
रुक्का–पु॰ చీటీ; చీటీ ఉత్తరము; అప్పు ఇచ్చువాడు; ప్రామిసరీ నోటు.
रुक्म–पुं॰ స్వర్ణము; బంగారము; ఉమ్మెత్త
रुक्ष–वि॰ నీరసమైన; కర్కశమైన; గరుకు గల; ఎత్తు పల్లములు గల.
रुख–पुं॰ వృక్షము; చెట్టు; కపోలము, ముఖము; ఆకృతి; వాలకము; क्रि॰वि॰ వైపు; సమక్షమున.
रुखसत–स्त्री॰ ప్రయాణము; ఆజ్ఞ; శలవు
रुकसताना–पुं॰ వీడ్కోలు సమయమున ఇచ్చు ధనము లేక కానుక.
रुखसती–स्त्री॰ వీడ్కోలు.
रुखसार–पुं॰ కపోలము; చెక్కిలి.
रुखाई–स्त्री॰ శుష్కత; మర్యాదహీనత; ముఖ మాటములేమి.
रुखानी–स्त्री॰ ఉలి.
रुग्ण - वि॰ రుగ్మతగల; రోగగ్రస్తమైన.
रुचना–अ॰क्रि॰ రుచించుట; బాగా ఉన్నట్లు అనిపించుట.
रुच रुच–पु॰ చాలా రుచిగా; ఏరిఏరి.
रुचि–स्त्री॰ ప్రవృత్తి; స్వాదము; రుచి; ఆకలి; అనురాగము.
रुचिर–वि॰ సుందరమైన; మధురమైన.
रुज–पुं॰ భంగు; బాధ; కష్టము; ఇంటికప్పు
रुजाली–स्त्री॰ బాధల పరంపర.

**रुजी**–वि० జబ్బుగానున్న.

**रुजू**–वि० ధ్యాస; లగ్నమైన; ప్రవృత్తమైన.

**रुजूलियत**–स्त्री० పుంసత్వము.

**रुझना**–अ०क्रि० చిక్కుకొనుట.

**रुझाना**–पुं० ప్రవృత్తి; వంపు; రుచి.

**रुत**–स्त्री० ఋతువు; ధ్వని; కలవరము.

**रुतबा**–पुं० పదవి; హోదా; ప్రతిష్ఠ

**रुदन**–पुं० ఏడుపు; రోదనము.

**रुद्ध**–वि० ఆపబడిన; చుట్టుముట్టబడిన

**रुधिर**–पुं० రక్తము; నెత్తురు.

**रुपहला**–वि० వెండి వలె.

**रुबाई**–स्त्री० 4 పాదముల ఉర్దూ పద్యము.

**रुरुआ**–पुं० పెద్దజాతి గుడ్లగూబ

**रुलाई**–स्त्री० ఏడుపు; రోదనము.

**रुलाना**–स०क्रि० ఏడిపించుట.

**रुष्ट**–वि० క్రుద్ధమైన; కోపము గల.

**रुसवा**–वि० కళంకితమైన; అప్రతిష్ఠ పాలైన

**रुसवाई**–वि० కళంకము; అపకీర్తి; నింద

**रुसित**–वि० दे० रुष्ट.

**रुस्तम**–पुं० ఫారసీ దేశపు ఒకప్పటి పెద్ద వస్తాదు; గొప్ప వీరుడు.

**छिपा रुस्तम**–पुं० సామాన్యునిగా కనిపించు గొప్పవీరుడు.

**रूँधना**–स०क्रि० ముళ్లకంపతో చుట్టుముట్టుట; అవరోధపరచుట.

**रू**–पुं० ముఖము; ద్వారము; ముందు భాగము.

**रू रिआयत**–स्त्री० మొగమాటము; పక్షపాతము.

**रूई**–स्त्री० పత్తి; దూది.

**रूईदार**–वि० దూదితో నింపబడిన.

**रूखा**–वि० నునుపుగాలేని; రుక్షమైన; స్నిగ్ధతలేని; ఎండిన; విరక్తమైన.

**रूखा सूखा**–पुं० నెయ్యి, నూనెలేని; కర్కశమైన; పరుషమైన.

**रूखा पडना या होना**–पुं० శీలసంకోచము లేని.

**रूठ; रूठन**–स्त्री० అలక.

**रूठना**–अ०क्रि० అలుగుట.

**रूढ**–वि० రూఢమైన; ప్రసిద్ధమైన; ఆరోహించిన.

**रूढि**–स्त्री० అరోహణము; ఉత్పత్తి, ఖ్యాతి; రూఢమైన సార్థక శబ్దము.

**रूप**–पुं० ఆకారము; రూపము; స్వభావము

**रूपरेखा**–स्त्री० ఆకారప్రకారము.

**रूपक**–पुं० మూర్తి; ప్రతికృతి; దృశ్య కావ్యము; ఒక కావ్యాలంకారము.

**रूपसी**–स्त्री॰సుందరమైన స్త్రీ; वि॰ సుందరి
**रूपा**–पु॰ వెండి.
**रूपी**–वि॰ రూపముగల; తుల్యమైన; సమానమైన.
**रूबकार**–पु॰ కోర్టుకు హాజరు కమ్మని న్యాయస్థానము ద్వారా పంపబడిన ఆజ్ఞాపత్రము; సమను.
**रूबरू**–क्रि॰वि॰ సమక్షమున.
**रूमाल**–पु॰ చేతిరుమాలు; జేబురుమాలు
**रूरना**–अ॰क्रि॰ అరచుట.
**रूरा**–वि॰ బాగున్న; శ్రేష్ఠమైన.
**रूसना**–अ॰क्रि॰ అలుగుట.
**रूह**–स्त्री॰ ఆత్మ; జీవాత్మ.
**रूहानी**–वि॰ ఆత్మకు సంబంధించిన; ఆధ్యాత్మికమైన.
**रेंकना**–अ॰क्रि॰ఓండ్రపెట్టుట (గాడిద)
**रेंगना**–अ॰क्रि॰ క్రిమికీటకముల పాకుట
**रेंड**–पु॰ ఆముదపు మొక్క.
**रेंडी**–स्त्री॰ ఆముదపు గింజలు.
**रेख**–स्त्री॰ గీత; రేఖ.
**रेख भीजना या भीनना**–पु॰నూనూగు మీసములు కాన్పించుట.
**रेखता**–पु॰అరబీ, ఫార్సీ కలిసిన హిందీ పాట; ఉర్దూభాష ప్రారంభపు పేరు.
**रेखती**–स्त्री॰ స్త్రీల వాడుక ఉర్దూ.
**रेखा**–स्त्री॰ గీత; రేఖ.
**रेखागणित**–पु॰ రేఖాగణితము.
**रेग**–स्त्री॰ ఇసుక.
**रेगमाल**–पु॰ మెరుగు కాగితము.
**रेगिस्तान**–पु॰ ఎడారి; ఇసుకమైదానము
**रेचक**–वि॰ విరోచనము కలిగించు; విరోచనకారి ; पु॰ విరోచనములు కలిగించు మందు; పిచకారి.
**रेचन**–पु॰ जुलाब; విరోచనముల మందు.
**रेजगारी;रेजगी**–स्त्री॰ చిల్లర నాణెములు
**रेजा**–पु॰ చిన్నముక్క; తునియ; సూక్ష్మ భాగము; రత్నము.
**रेण; रेणुका**–स्त्री॰ ఇసుక కణము; ధూళి.
**रेतना**–पु॰ వీర్యము; శుక్రము; పాదరసము स्त्री॰ ఇసుక.
**रेतना**–स॰क्रि॰ ఆకురాతితో తోముట; రుద్దుట.
**रेती**–स्त्री॰ ఆకురాయి.
**रेतीला**–वि॰ ఇసుకగల; ఇసుక సంబంధమైన.
**रेफ**–पु॰ రేఫము; రకారము.
**रेल**–स्त्री॰ రైలుపట్టా; రైలుబండి.

रेलना–स॰क्रि॰ ముందుకు త్రోయుట; నెట్టి పడవేయుట.

रेलपेल–स्त्री॰ పెద్ద గుంపు; జనసమ్మర్దము; ఆధిక్యము.

रेला–पु॰ ప్రవాహము; ప్రవాహపు త్రోపు, త్రోపిడి; త్రోపులాట.

रेवड़–पुं॰ గొర్రెల మంద.

रेवड़ी–स्त्री॰ జీడిలు - నువ్వుల జీడిలు.

रेश–पुं॰ గాయము.

रेशम–पुं॰ పట్టు వస్త్రము; కౌశేయము.

रेशा–पुं॰ నార; నారదారము.

रेह–स्त्री॰ చౌవుడు మట్టి.

रेहन–पु॰ गिरवी; తాకట్టు

रेहनदार–पुं॰ తాకట్టు పెట్టినవాడు.

रेहननामा–पुं॰ తాకట్టు నిబంధన పత్రము.

रेहल–स्त्री॰ दे॰ रिहल.

रैन–स्त्री॰ రాత్రి; రేయి.

रैयत–स्त्री॰ जनता; ప్రజ.

रैल–स्त्री॰ दे॰ रेला

रोंगटा–पुं॰ శరీరము మీది రోమము.

रोंगटे खड़े होना–मु॰ ఏదేని భయంకర కాండ చూచి లేక విని ఎక్కువగా క్షోభించుట.

रोक–स्त्री॰ ఆటంకము;విఘ్నము; నిషేధము.

रोक टोक या रोक थाम–स्त्री॰ఆటంకము; అడ్డంకు; నిషేధము.

रोकड़–स्त्री॰ నగదు; రొక్కము; మూలధనము.

रोकड़िया–पुं॰ కోశాధికారి.

रोकना–स॰क्रि॰ ఆపుట; అడ్డగించుట.

रोगन–पु॰ నూనె; జిడ్డు; వార్నీషు; పాలిషు

रोगनी–वि॰ పాలిషు చేయబడిన; వార్నీషు పూయబడిన.

रोगिया–पुं॰ दे॰ रोगी.

रोगी–वि॰ జబ్బుగానున్న; రోగి.

रोचक–वि॰ రుచికరమైన; మనోహరమైన

रोचन–वि॰ రోచకమైన; శోభాయుతమైన; పసందైన.

रोज–पुं॰ రోదనము; రుదనము.

रोज़–पु॰ దినము; దివసము; నిత్యము; ప్రతిదినము; సంవత్సరీకము.

रोजगार–पुं॰ వృత్తి; వ్యాపారము.

रोजनामचा–पुं॰ దైనిక; డైరీ.

रोजमर्रा–अव्य॰ ప్రతిదినము;నిత్యము

रोजा–पुं॰ వ్రతము; ఉపవాసము; రంజాన్ మాసములో మహమ్మదీయులు పాటించు ఉపవాసము వ్రతము.

रोजी–स्त्री॰ జీవన నిర్వహణకు ఆధారము; వృత్తి.

**रोजीना**–पुं॰ దైనిక వృత్తి; కూలి.
**रोजू**–पुं॰ రోదనము; ఏడుపు.
**रोट**–पुं॰ లావుపాటి రొట్టె; తియ్యని మందపు రొట్టె.
**रोटी**–स्त्री॰ రొట్టె; భోజనము; వంట.
**रोड़ा**–पु॰ ఇటిక లేక పెద్దరాతిముక్క; విఘ్నము; ఆటంకము.
**रोड़ा अटकाना या डालना**–मु॰ ఆటంకపరచుట; అడ్డు పెట్టుట.
**रोदन**–पुं॰ రోదనము; క్రందనము; ఏడుపు.
**रोदसी**–स्त्री॰ స్వర్గము; భూమ్యాకాశము.
**रोदा**–पु॰ వింటినారి.
**रोना**–अ॰क्रि॰ ఏడ్చుట.
**रोना पीटना**–पुं॰ ఎక్కువగా విలపించుట
**रो बैठना**–पुं॰ నిరాశ జెంది ఏడుపు మానుట.
**रोपण**–पुं॰ నాటుట; నాటు లేక నాట్లు.
**रोपना**–स॰क्रि॰ నాటుట; మొలక. నాటుట; విత్తనము నాటుట.
**रोपनी**–स्त्री॰ रोपाई ;వరి, గోధుమ మొ॥గు నాట్లు.
**रोब**–पु॰ పలుకుబడి; ఆటంకము; ప్రతాపము; ప్రభావము.
**रोब जमाना**–मु॰ భయోత్పాతము కలుగజేయుట.
**रोब मे आना**–मु॰ భీతినొందుట; అధీనము; అంగీకరించుట.
**रोबकार**–पुं॰ दे॰ रुबकार.
**रोबदार**–वि॰ తేజస్వి; ప్రభావితము చేయు.
**रोम**–पुं॰ శరీరము మీది వెంట్రుకలు; ఇటలీ దేశపు రాజధాని నగరము.
**रोम रोम में**–मु॰ యావత్తు శరీరములో
**रोम रोम से**–मु॰ హృదయ పూర్వకముగా
**रोमहर्षण**–पुं॰ అత్యంత ఆనందము లేక భయము వలన రోమాంచిత మగుట భయంకరమైన; భీషణమైన.
**रोर**–पुं॰ గల్లంతు; అల్లరి; కోలాహలము, वि॰ప్రచండమైన; దుర్గమనీయమైన.
**रोरी**–स्त्री॰ ఆనందోత్సవము.
**रोला**–पु॰ కోలాహలము; భయంకరమైన యుద్ధము; హిందీలో 24 మాత్రలు గల ఒక విధమగు పద్యము .
**रोली**–स्त्री॰ కుంకమ.
**रोवनहार**–वि॰ ఏడుచువాడు; శోకించు వాడు.
**रोशन**–वि॰ ప్రకాశముగల; ప్రకాశ మానమైన; ప్రసిద్ధమైన.
**रोशनचौकी**–स्त्री॰ సన్నాయి.
**रोशनदान**–पु॰ వెల్తురు వచ్చు కిటికీ.
**रोशन-दिमाग**–पु॰ ప్రఖరమైన మేధాశక్తి గల జ్ఞాని; నస్యము.
**रोशनाई**–स्त्री॰ సిరా.

रोशनी–स्त्री॰ ప్రకాశము; వెల్తురు; దీప కాంతి; జ్ఞానప్రకాశము.

रोहण–अ॰क्रि॰ ఎక్కుట; పైకి ఎక్కుట లేక పెరుగుట.

रोहित–वि॰ ఎర్రని; पु॰ కుంకుమ; రక్తము.

रोहू–स्त्री॰ ఒక విధమగు పెద్ద చేప.

रौंद–स्त्री॰ కాళ్లతో రాచి మర్దించుట.

रौंदना–स॰क्रि॰ కాలరాచుట; కాళ్లతో మర్దించుట లేక త్రొక్కుట.

रौ–स्त्री॰ గతి; వేగము; నడక; ఊపు; తీరు

रौगन–पु॰ दे॰ रोगन.

रौजन–पु॰ ఛిద్రము; రంధ్రము; చిన్న కిటికీ.

रौजा–पु॰ తోట; ఉద్యానము; గొప్ప వాని లేక మహాత్ముని సమాధి.

रौताई–स्त्री॰ స్వామిత్వము; ప్రభుత్వము; నాయకత్వము.

रौद्र–वि॰ ప్రచండమైన; భయంకరమైన, క్రోధ పూర్ణమైన.

रौनक–स्त्री॰ రూపము; దీప్తి, శోభ; ప్రఫుల్లత.

रौनक अफजा–वि॰ శోభించు; విరాజిల్లు

रौप्य–पु॰ వెండి; वि॰ వెండితో తయారైన

रौरव–पु॰ ఒక భయంకరమైన నరకము; वि॰ భయంకరమైన.

रौला–पु॰ గోల; కోలాహలము.

रौलि–स्त्री॰ చెంపదెబ్బ; అరుపు.

रौशन–वि॰ दे॰ रोशन.

## ल

लंक–स्त्री॰ కటి; నడుము.

लंका–स्त्री॰ లంకాద్వీపము.

लग–पु॰ కుంటితనము.

लंगड़ा–वि॰ కుంటివాడు; पु॰ ఒక విధమగు శ్రేష్ఠమైన మామిడి.

लगडाना–अ॰क्रि॰ కుంటుట; కుంటుచూ నడచుట.

लंगर–पु॰ లంగరు; గుది బండ లేని కొయ్య; అన్నదాన సత్రము.

लगर करना–ग॰ కొంటెతనము చేయుట; ఆకతాయి పని చేయుట.

लंगरगाह–पु॰ दे॰ बदरगाह.

लंगूर–पु॰ కోతి; కొండముచ్చు; తోక.

लगूल–पु॰ తోక.

लंगोट; लगोटा–पु॰ లంగోట.

लगोटिया यार–पु॰ చిన్ననాటి స్నేహితుడు; బాల్య సఖుడు.

लघन– లంఘణము, పస్తు, దుముకు, ఉల్లంఘనము.

लठ–वि॰ మూర్ఖమైన; మొరటు.

लतरानी–स्त्री॰ బడాయిలు; అక్కరకు రాని డాంబికాలు.

लंपट–वि॰ వ్యభిచారి; లంపటుడు; దురాచారి.

**लपटता**–स्त्री॰ వ్యభిచారము; దురాచారము.

**लबा**–वि॰ పొడుగైన; దీర్ఘమైన.

**लबा करना**–मु॰ పారద్రోలుట; తొలగించుట; నేలకేసి కొట్టుటలేక పరుండపెట్టుట.

**लंबाई; लबान**–स्त्री॰ పొడవు.

**लंबायमान**–वि॰ చాల పొడవైన;పడుకొని ఉన్న.

**लंबी तानना**–मु॰ పడుకొని నిద్ర పోవుట

**लंबोतरा**–वि॰ పొడవైన; పొడవైన రూపము గల.

**लटाक**–पु॰నాలికతోచప్పరించు మందు; చట్నీ; పచ్చడి.

**लकड़**–पु॰ కొయ్య మొద్దు.

**लकड़हारा**–पु॰ కట్టెలు కొట్టువాడు.

**लकडी**–स्त्री॰ కర్ర; కొయ్య.

**लकब**–पु॰ బిరుదము; డిగ్రీ.

**लकलक**–पु॰ సారస పక్షి वि॰ చాలా సన్నని; దుర్బలమైన.

**लकवा**–पु॰ పక్షవాతము.

**लकीर**–स्त्री॰ గీత; రేఖ; పంక్తి; వరుస.

**लकीर का फकीर**–मु॰ కళ్లు మూసుకొని సనాతన మార్గమున నడుచువాడు.

**लकीर पीटना**–मु॰ సనాతన మార్గమును గుడ్డిగా అనుసరించువాడు.

**लकुट**–स्त्री॰ బాణాకర్ర; బెత్తము.

**लकुटिया;लकुटी**–स्त्री॰ दे॰ लकुट.

**लक्कड़**–पु॰ కొయ్యమొద్దు.

**लक्षणा**–स्त्री॰ వాచ్యార్థమునకు భిన్నమైన భావర్థము సూచించు ఒక శబ్ద శక్తి.

**लक्षित**–वि॰ నిర్దిష్టమైన; पु॰లక్షణా శక్తి ద్వారా తెలియబడు వాచ్యార్థము నకు భిన్నమైన మరియొక అర్థము.

**लक्ष्य**–पु॰ లక్ష్యములేక గురిని కేంద్రీకరించు పదార్థము; ఉద్దేశ్యము.

**लक्ष्यार्थ**–पु॰ లక్షణాశక్తి ద్వారా బహిర్గతమగు అర్థము.

**लखना**–स॰क्रि॰ చూచుట; కాన్పించిన లక్షణము లాధరముగా గ్రహించుట; ఊహించి గ్రహించుట.

**लखपति**–पु॰ లక్షాధికారి.

**लखलखा**–पु॰ మూర్ఛను పారద్రోలు ఒక సుగంధ ద్రవ్యము.

**लखलुट**–वि॰ గొప్ప అపవ్యయి; ఎక్కువగా దూబరా ఖర్చు చేయు.

**लखेदना**–स॰क्रि॰ పారద్రోలుట.

**लखेरा**–पु॰ లక్క గాజులు తయారు చేయువాడు.

**लखौटा**–स्त्री॰ చందనము; కేసరము మొ॥గు సుగంధ ద్రవ్యములతో తయారైన అంగలేపము; కుంకుమ భరిణె.

**लग**–क्रि॰वि॰ వరకు; పర్యంతము; దగ్గర; स्त्री॰ ప్రేమ; अव्य॰ కొరకు; వెంట.

**लगन**–स्त्री॰ ప్రేమ; ధ్యానము; సంబంధము; पुं॰ శుభముహూర్తము.

**लगना**–अ॰क्रि॰ అనుకొనుట; తాకుట; అనిపించుట; ఆరంభమగుట.

**लगभग**–क्रि॰वि॰ ప్రాయ; దాదాపు.

**लगातार**–क्रि॰वि॰ ఎడతెరిపి లేకుండా; నిరంతరముగా.

**लगान**–पुं॰ సుంకము; శిస్తు.

**लगाना**–स॰क्रि॰ కలుపుట; అనిపించుట; తాకించుట; క్రమానుసారముగా సర్దుట; ఉపయోగించుట; దోషారోపణ చేయుట.

**लगाम**–स्त्री॰ కళ్లెము.

**लगायत**–क्रि॰वि॰ వెంట తీసుకొని; సహితము; अव्य॰ చివరివరకు; పర్యంతము.

**लगालगी**–स्त्री॰ ప్రేమ; ప్రీతి; స్నేహము, సంబంధము; ఐక్యము; పోటీ.

**लगाव**–पुं॰ సంబంధము.

**लगावट**–स्त्री॰ సంబంధము; ప్రేమ.

**लगौहाँ**–वि॰ रिझवार ;సంబంధము పెట్టుకొను కోరిక గల.

**लग्गा**;–पुं॰ **लग्गी**–स्त्री॰ పొడుగాటి వాసము లేక బొంగు; పని ప్రారంభించుట.

**लग्घड़**–पुं॰ డేగపక్షి; ఒక విధమగు చిరుత పులి; మృగము.

**लग्वियात**–स्त्री॰ పనికి మాలిన వాగుడు; అసత్య వచనములు; అసభ్యకరమైన మాటలు.

**लघु**–वि॰ చిన్న; కొద్ది; తక్కువ; త్వరగా.

**लघुचेता**–पुं॰ తుచ్ఛమైన భావములు గలవాడు; హీనమైనవాడు.

**लघुमति**–वि॰ తెలివి తక్కువైన; మూర్ఖత గల.

**लघुशंका**–स्त्री॰ మూత్రవిసర్జన.

**लचक**–स्त्री॰ వంపు; ఊగిసలాట.

**लचकना**–अ॰क्रि॰ వంగుట; ఊగాడుట

**लचकीला**–वि॰ వంగు స్వభావము గల; ఊగులాడు స్వభావము గల.

**लचन**–स्त्री॰दे॰ लचक

**लचर**–वि॰ దుర్బలమైన; पुं॰ పాపము.

**लचीला**–वि॰ వంగు స్వభావముగల; ఊగులాడు.

**लच्छ**–पुं॰ నెపము; వంక; లక్ష్యము.

**लच्छन**–पुं॰ లక్షణము.

लच्छा–पुं॰ నూలుకండె; ఒక విధమగు నగ.

लच्छी–स्त्री॰ లక్ష్మి.

लच्छेदार–वि॰ కర్ణమధురమైన సంభాషణ.

लजीज–वि॰ मजेदार ;రుచిగల.

लजूम–पुं॰ అనివార్యత; ఆవశ్యకత.

लजाना–अ॰क्रि॰ సిగ్గుపడుట.

लजालू ;लजारू–पुं॰ అత్తిపత్తి మొక్క.

लजीज–वि॰ రుచిగల; స్వాదిష్టమైన.

लजीला–वि॰ లజ్జగల; సిగ్గుపడు.

लज्जत–स्त्री॰ రుచి; స్వాదము; ఆనందము.

लज्जा–स्त्री॰ शर्म సిగ్గు; లజ్జ.

लट–स्त्री॰ కేశపాశము.

लटकना–अ॰क्रि॰ సందిగ్ధములో ఊగిసలాడుట, ఒయ్యారము పోవుట; వ్రేలాడుట.

लटकती चाल–पुं॰ ఒయ్యారపు నడక

लटकाना–स॰क्रि॰ వ్రేలాడవేయుట; వ్రేలాడ తీయుట.

लटकीला–वि॰ వ్రేలాడుచున్న; ఊగుచున్న.

लटना–अ॰क्रि॰ అలసిపోయి క్రింద పడుట; తొట్రుపాటు పడుట; వికలమగుట; లోక్షమగుట.

लटपट; लटपटा–वि॰ పడుతూ లేస్తూ తొట్రుపాటు పడుచు.

लटपटाना–अ॰क्रि॰ పడుతూ లేస్తూ ఉండుట; తొట్రుపాటు పడుట; ఊరించుట; మోహములో పడుట; అనురక్తమగుట.

लटी–स्त्री॰ చెడ్డమాట; అబద్ధపుమాట; గప్పము; భక్తురాలు; వేశ్య.

लटूरी–स्त्री॰ వ్రేలాడు శిరోకేశ జాలము.

लट्टू–पुं॰ బొంగరము; वि॰ ముగ్ధమైన.

लट्टू होना–पुं॰ మోహించుట; ప్రేమించుట.

लट्ठ–पुं॰ పెద్ద బాణాకర్ర.

लट्ठमार–वि॰ దెబ్బలాట ఆడువాడు; కటుభాషి.

लट्ठा–पुं॰ దూలము.

लठैत–वि॰ సాము నేర్చినవాడు.

लड़ंत–स्त्री॰ పోరాటము.

लड़–स्त्री॰ ఒకే రకపు వస్తువుల వరుస; పంక్తి; హారము.

लड़कई–स्त्री॰ బాల్యము.

लड़कपन–पुं॰ బాల్యము; బాల్యావస్థ.

लड़का–पुं॰ బాలుడు.

लड़की–स्त्री॰ బాలిక.

**लड़कौरी**–स्त्री॰ ఒడిలో శిశువున్న స్త్రీ; మాతృమూర్తి.
**लड़खड़ाना**–अ॰क्रि॰ నిలవలేక తొట్రుపాటు పడుట.
**लड़ना**–अ॰क्रि॰ పోరాడుట; దెబ్బలాడుట
**लड़बावला**–वि॰ బాలునివలె; తెలియని; అమాయకమైన .
**लड़ाका; लडाकू**–वि॰ యుద్ధము చేయువాడు; యుద్ధవీరుడు పోట్లాడు.
**लड़ाना**–स॰क्रि॰ పోట్లాడించుట; ఢీకొట్టించుట.
**लडी**–स्त्री॰ दे॰ लड़
**लड़ैता**–वि॰ గారాబమైన; ప్రేమాస్పదమైన; గారాబము వలన గీరెక్కిన; वि॰ పోరాడు; యుద్ధము చేయు.
**लढिया**–स्त्री॰ ఎద్దు బండి.
**लत**–स्त्री॰చెడు అలవాటు; దుర్వసనము
**लतखोर**–वि॰ తన్నులు తినువాడు; నీచమైన; హేయమైన; గుమ్మము ముందువేయు తొక్కుడు.
**लतर;लता**–स्त्री॰లత, తీగ; అందమైన స్త్రీ
**लताड़ना**–स॰क्रि॰ కాలరాయుట; దుమ్ము దులుపుతూ మాట్లాడుట
**लताफत**–स्त्री॰ రుచి; స్వాదము; ఆనందము; శ్రేష్ఠత; సూక్ష్మత.
**लतीफ**–वि॰ రుచిగల; కోమలమైన; శ్రేష్ఠమైన.
**लतीफा**–पु॰ హాస్యోక్తి.
**लत्ता**–पु॰ చినిగిన పాతగుడ్డ.
**कपड़ा लत्ता**–यौ॰ ధరించు దుస్తులు.
**लत्ती**–स्त्री॰ పశువుల తన్ను.
**लथ पथ**–वि॰ తడిసిన.
**लथेड़ना**–स॰क्रि॰ బురదజల్లుట; నిందించుట; అవమానించుట; నేలకేసి కొట్టి బురదలో దొర్లించుట; వ్యాకులపరచుట; చివాట్లుపెట్టుట.
**लदना**–अ॰क्रि॰ భారయుక్తమగుట; బరువు వేయబడుట; కప్పబడుట; గడుచుట; గతించుట.
**लदुवा;लद्दू**–वि॰ బరువు మోయువాడు
**लद्धड़**–वि॰ సోమరి.
**लपक**–स्त्री॰लपट ; జ్వాల; మంట; కాంతి; వేగము.
**लपकना**–अ॰क्रि॰ కలియబడుట; తటాలున పట్టుకొనుట; పైకురుకుట
**लपककर**–पु॰ తక్షణము; తటాలున; కలియబడి తీసుకొనుటకు వేగముగా పైకురుకుట.
**लपझप**–वि॰ చురుకైన.
**लपट**–स्त्री॰ జ్వాల; మంట; గమకము; సుగంధము.
**लपटना**–अ॰क्रि॰ लिपटना.

**लपलपाना**– अ॰क्रि॰ పొడవైన కోమల వస్తువు; ఇటూ అటూ ఊగులాడుట.
स॰क्रि॰ చాకు; కత్తి మొ॥వి కదిలిస్తూ మెరిపించుట.
**लपसी**–स्त्री॰ నేతిహల్వా; చిక్కటి ద్రవ పదార్థము.
**लपाना**–स॰क्रि॰ బెత్తము మొ॥ఊగు లాడించుట; చీదరించుట.
**लपेट**–स्त्री॰ మెలిక (త్రాడు) చిక్కు; మెలి
**लपेटना**–स॰क्रि॰ మెలిత్రిప్పుట, చిక్కు పడ వేయుట; జంజాటములో ఇరి కించుట; చుట్టుట; సర్దుట; ద్రవ పదార్థము పూయుట.
**लफंगा**–वि॰ దురాచారి; రౌడి; తిరుగు బోతు.
**लफ्ज**–पुं॰ శబ్దము; మాట.
**लफ्जी**–वि॰ శాబ్దికమైన.
**लफ्फाज**–वि॰ దురుసుగా మాట్లాడు వాడు; గప్పాలు కొట్టువాడు.
**लब**–पुं॰ పెదవి.
**लबड़ धोंधों**–स्त्री॰ గలభా; లేనిపోనిగోల; నిజాయితీ లేని నడత; అన్యాయము
**लबड़ना**–अ॰क्रि॰ అబద్ధమాడుట; గప్పాలు కొట్టుట
**लबरेज**–वि॰ కుత్తుకవరకు నిండిన; పెది మల వరకు నిండిన.
**लबादा**–पुं॰ అన్నిటి పైనా ధరించు లేక కప్పుకొను ఉడుపు లేక వస్త్రము.
**लबार**–वि॰ అబద్ధాల కోరు; మోసకారి; బడాయిచెప్పు; పీకవరకు నిండిన.
**लबालब**–वि॰ అంచుల వరకు నిండిన.
**लबेगोर**–वि॰ మరణాసన్నమైన; చావుకు సిద్ధముగా నున్న.
**लबेशीरीं**–पुं॰ మధురమైన పెదవి.
**लब्ध**–वि॰ ప్రాప్తించిన; భాగఫలము.
**लब्धकाम**–वि॰ కోరిక తీరిన.
**लब्धप्रतिष्ट**–वि॰ ప్రతిష్ఠ పొందిన; పేరుగల.
**लब्धि**–स्त्री॰ ప్రాప్తి, లాభము.
**लमतड़ग**–वि॰ చాల పొడవైన లేక ఎత్తైన
**लमहा**–पुं॰ నిమిషము, క్షణము; రెప్పపాటు
**लय**–पुं॰ నిమగ్నత; మగ్నత; ఏకాగ్రత; ప్రళయము; పాటపాడుశైలి; లయ.
**लरजना**–अ॰क्रि॰ కంపించుట; గజగజ వణకుట; భయమునొందుట.
**लरजा**–पुं॰ వణుకు; ప్రకంపన; చలి జ్వరము; భూకంపము.
**लरिकाई**–स्त्री॰ బాల్యము; కుర్రతనము.
**लरी**–स्त्री॰ दे॰ लडी.
**ललक**–स्त्री॰ ప్రబలమైన వాంఛ.
**ललकना**–अ॰क्रि॰ తీవ్రముగా అభిల షించుట.
**ललकार**–स्त्री॰ సవాలు; కయ్యమునకు పిలుపు.
**ललकारना**–स॰क्रि॰ సవాలు చేయుట; కయ్యమునకు పిలుచుట.

**ललचना**–अ॰क्रि॰ పేరాశపడుట; మోహితుడగుట;కోరికవలన కలత జెందుట.

**ललचाना**–स॰क्रि॰ ఊరించుట; మోహింప జేయుట; పేరాశ జనింప జేయుట

**ललचौहाँ**–वि॰ పేరాశగల; మోహితమైన

**ललन**–पुं॰ గారాబాల బిడ్డ; ప్రేమాస్పద మైన ప్రియుడు లేక భర్త; క్రీడ.

**ललना**–स्त्री॰ స్త్రీ; కామిని.

**लला**–पुं॰ दे॰ ललन.

**ललाई**–स्त्री॰ ఎర్రదనము.

**ललाट**–पु॰ ఫాలభాగము; నుదురు;నొసటి రాత.

**ललाटरेखा**–स्त्री॰ నొసటి వ్రాత.

**ललाम**–वि॰ రమణీయమైన;మనోహర మైన; శ్రేష్ఠమైన; ఎర్రని అలంకారము

**ललामी**–स्त्री॰ఎర్రదనము; సౌందర్యము

**ललित**–वि॰ కోమలమైన; ఇష్టమైన; మనో హరమైన; చంచలమైన.

**ललिता**–स्त्री॰ లాలిత్యము.

**ललौहाँ**–वि॰ ఎర్రని.

**लल्ला**–पु॰ నాలుక; दे॰ लला.

**लल्लो चप्पो**–स्त्री॰ ముఖస్తుతి; చాటు కారిత; మనస్సునకు నచ్చు తియ్యని మాటలు.

**लल्लो पत्तो**–स्त्री॰ दे॰ लल्लोचप्पो.

**लवंग**–पु॰ लौंग ;లవంగము.

**लवंगी**–स्त्री॰ కోమలి; वि॰ నాజూకైన.

**लव**–पु॰ అల్పము; బహుకొద్ది.

**लवण**–पु॰ ఉప్పు.

**लवन**–पु॰ కోత; పొలములోని పైరు కోత.

**लवनि; लवनी**–स्त्री॰ పొలములో పండిన పైరుకోత.

**लवर**–स्त्री॰ అగ్నిజ్వాల.

**लवला**–स्त्री॰ జ్యోతి; శోభ.

**लवलीन**–वि॰నిమగ్నమైన; తన్మయమైన

**लव लेश**–पुं॰ అత్యంత; అల్పమైన; సాంగత్యము.

**लवा**–पु॰ పేలాలు; ఒక విధమగు పిట్ట.

**लवाई**–वि॰ లేగడిపాడి ఆవు; स्त्री॰ పంట పైరు కోత.

**लवाजमा**–पुं॰ వెంట ఉండు సామాను; ఆవశ్యకమైన సామగ్రి .

**लवारा**–पु॰ ఆవుదూడ.

**लशकर**–पु॰ సైన్యము; పటాలము; సైన్య శిబిరము; ఓడలో పని చేయువారి సమూహము.

**लशकरी**–वि॰ సైన్య సంబంధమైన; स्त्री॰ కళాసుల భాష

**लस**–पु॰ జిగురు; ఆకర్షణ.

**लसना**–स॰क्रि॰ అంటించుట; अ॰क्रि॰ శోభించుట; విరాజిల్లుట.

**लसी**–स्त्री॰జిగురు లాభించు యోగము, లాభము కలుగజేయు మార్గము; సంబంధము.

**लसीसा**–वि॰ జిగురు గల; శోభాయ మానముగ; సుందరమైన.

**लस्त**–वि॰ అలసిన; అశక్తమైన.

**लस्सी**–स्त्री॰ పెరుగు చిలికిన మజ్జిగ; పంచదార కలిపిన ఒక విధమగు పానీయము.

**लहँगा**–पुं॰ పరికిణీ; లంగా.

**लहक**–स्त्री॰అగ్నిజ్వాల; శోభ; దీప్తి, కాంతి

**लहकना**–अ॰क्रि॰ అగ్నిజ్వాల చంచల మగుట; తటాలునలేచుట; అభిల షించుట.

**लहजा**–पुं॰ ఉచ్చారణ స్వరము; లయ

**लहजा**–पुं॰ క్షణము; నిమిషము.

**लहनदार**–पुं॰ ఋణము ఇచ్చువాడు.

**लहना**–स॰क्रि॰ పొందుట; पुं॰ అప్పు ఇచ్చిన పైకము.

**लहर**–स्त्री॰ అల; తరంగము (నీటి); ఆవేశము; మనోవేగము; ఆనందో త్సాహము.

**लहरदार**–वि॰ తరంగము వలె వంకర టింకరగాపోవు.

**लहरा**–पुं॰ పెద్ద తరంగము; ఆనందము; ఉత్సాహము.

**लहराना**–अ॰क्रि॰ తరంగాయిత మగుట;అభిలషించుట; అగ్నిజ్వాల చంచల మగుట; శోభించుట; విరా జిల్లుట.

**लहरी**–स्त्री॰ చిన్న అల; वि॰ ఇష్టాను సారము సంచరించువాడు.

**लहलहाना**–अ॰क्रि॰ ఆకుపచ్చని పైరుతో విరాజిల్లుట;ప్రపుల్లతమగుట; ఆనందోత్సాహములతో నిండుట వృక్షములు, మొక్కలుమరల చిగుర్చుట

**लहसुन**–पुं॰ వెల్లుల్లిపాయ.

**लहालोट**–वि॰ ఆనందోల్లాసముతో తబ్బిబ్బుగానున్న.

**लहास**–स्त्री॰ दे॰ लाश.

**लहू**–पुं॰ రక్తము; నెత్తురు.

**लहू का घूंट–पीना**– मु॰ కోపమును అణుచుకొనుట.

**लहूलुहान होना**–पुं॰ నెత్తురు ముద్ద గుట; అతిగా నెత్తురు ప్రవహించుట.

**लाँक**–स्त्री॰ कमर; నడుము.

**लाँग**–स्त्री॰ గోచి (ధోతి యొక్క).

**लागूल**–पुं॰ पूँछ; తోక.

**लागूली**–वि॰ కోతి.

**लाँधाना**–स॰क्रि॰ లఘించుట; దాటుట

**लाँच**–स्त्री॰ रिश्वत; లంచము.

**लांछन**–पुं॰ దోషము; మచ్చ; కళంకము. చిహ్నము.

**लांछित**–वि॰కళంకితమైన; మచ్చపడిన

**लाई**–स्त्री॰ చుగలీ; చాడి; కొండెము.

**लाख**–पुं॰ లక్ష; 1,00,000; स्त्री॰ లక్క.

**लाखसे लीख होना**–मु॰ మొత్తములో ఏమీ లేక పోవుట.

**लाखना**–अ॰क्रि॰ లక్క వేసి బెజ్జము పూడ్చుట.

**लागडाँट**–स्त्री॰ పోటీ; ప్రతియోగిత.

**लागत**–स्त्री॰ వస్తువు తయారు చేయుటకు అయిన ఖర్చు; పెట్టుబడి సొత్తు.

**लागर**–वि॰ దుర్బలమైన; బక్కచిక్కిన.

**लागरी**–स्त्री॰ బలహీనత; దుర్బలత.

**लागू**–वि॰ ఉపయోగించు; అన్వయించు; ప్రయుక్తమగు.

**लागू करना**–स॰क्रि॰ జారీచేయుట.

**लागू होना**–अ॰क्रि॰ జారీయగుట.

**लाघव**–पुं॰ లఘుత్వము; అల్పత్వము; చురుకు దనము; శీఘ్రత; చాక చక్యము; ఆరోగ్యము.

**लाचार**–वि॰ వివశమైన; గతిలేక.

**लाचारी**–स्त्री॰ వివశత్వము; నిస్సహాయత

**लाज**–स्त्री॰ शर्म; సిగ్గు.

**लाज रखना**–मु॰ ప్రతిష్ఠనుకాపాడుట.

**लाजक**–पुं॰ ధాన్యపు పేలాలు.

**लाजवंत**–वि॰ సిగ్గుగల; సిగ్గుపడు.

**लाजवंती**–स्त्री॰ छुईमुई; అత్తిపత్తిమొక్క.

**लाजवाब**–वि॰ అద్వితీయమైన; సాటి. లేని; సమాధానములేని.

**लाजा**–स्त्री॰ लावा; పేలాలు.

**लाजिम**–वि॰ తగిన; ఔచిత్యము గల; ఉచితమైన; తప్పనిసరిగా చెయ్యవల సిన.

**लाजिमी**–वि॰ అనివార్యమైన; తప్పని సరి అయిన.

**लाट**–स्त्री॰ స్తూపము; पुं॰ గవర్నరు.

**लाठी**–स्त्री॰ చేతి కర్ర.

**लाठी चलना**–मु॰ కర్రలతో దెబ్బలాట జరుగుట.

**लाड़**–पुं॰ ఆప్యాయత; గారాబము

**लाड़ला**–वि॰ గారాబముగా పెంచ బడు; ప్రేమాస్పదమైన; గారాబము చేయబడు.

**लात**–स्त्री॰ పాదప్రహారము; తన్ను.

**लात खाना**–मु॰ తన్నుతినుట; అవమా నింపబడుట.

**लात मारना**–मु॰ తుచ్ఛమని తలచి వదిలిపెట్టుట; త్యజించుట.

**लाद**–स्त्री॰ బరువు; భారము; బరువు వేయుట; పొట్ట; ప్రేగు.

**लादना**–स॰क्रि॰ బరువు వేయుట; మోయుటకు భారమైన వస్తువులు వేయుట; బరువు ఉంచుట.

**लादी**–स्त्री॰ పశువు మీద భారీ వస్తువులు మోపుట.

**लानत**–स्त्री॰ చీదరింపు; దూషణ.
**लाना**– अ॰क्रि॰ తెచ్చుట; स॰क्रि॰ నిప్పుపెట్టుట; తగల పెట్టుట
**लापता**–वि॰ జాడలేని; అదృశ్యమైన.
**लापरवा, लापरवाह**–वि॰ లక్ష్యపెట్టని; లెక్కజేయని; జాగ్రత్తలేని.
**लापरवाही**–स्त्री॰ నిర్లక్ష్యము; తృణీకారము.
**लाफ**–स्त्री॰ గప్పాలు కొట్టుట
**लाम**–पुं॰ సైన్యము, పెద్ద జనసమూహము
**लामा**–पुं॰ టిబెట్టు లేకమంగోలియా దేశపు బౌద్ధ ధర్మాచార్యుడు.
**लायक**–वि॰ తగిన; యోగ్యమైన; ఉపయుక్తమైన.
**लायकियत;लायकी**–स्त्री॰ యోగ్యత; అర్హత.
**लार**–स्त्री॰ చొంగ; పంక్తి; జిగురు.
**लार रपकना**–पुं॰ నోరూరుట.
**लार लगाना**–मु॰ ఉచ్చులో చిక్కించుట.
**लाल**–पुं॰ మాణిక్యము; ఒక విలువైన రత్నము; ముద్దు బిడ్డ.
**लाल पीला होना**–मु॰ కోపము వచ్చుట; ముఖము ఎర్రబారుట.
**लालचदन**–पुं॰ ఎర్రచందనము; రక్తచందనము.
**लालच**–पुं॰ లోభము; పేరాశ.
**लालची**–वि॰ పేరాశ గల; లోభియైన.
**लालटेन**–स्त्री॰ లాంతరు.
**लालन**–पुं॰ లాలన; ప్రేమతో కూడిన పెంపకము; గారాబము.
**लालबुझक्कड**–पुं॰ మాటలకు ఊహా జనిత అర్థము చెప్పువాడు; సర్వజ్ఞుని వలె వ్యవహరించువాడు.
**लालमिर्च**–स्त्री॰ ఎండు మిరపకాయ
**लालसा**–स्त्री॰ తీవ్రమైన వాంఛ; ఉత్సుకత.
**लाला**–पुं॰ గౌరవము సూచించు సంబోధనము; మహాశయుడు.
**लालायित**–वि॰ నోరూరిన; ఉవ్విళ్ళూరిన
**लालित**–वि॰ లాలింపబడిన;ప్రేమాస్పదమైన.
**लालित्य**–पुं॰ కోమలత్వము;లాలిత్యము; సౌందర్యము; సరసత.
**लालिमा**–स्त्री॰ लाली; ఎరుపు.
**लाली**–स्त्री॰ ఎరుపు; గౌరవము; ప్రతిష్ఠ
**लाले**–पुं॰ అభిలాష; లాలస.
**लाले पड़ना**–पुं॰ అమితంగా లోటు కలుగుట ఏదేని వస్తువు కొరకు తహతహలాడుట.
**लावण्य;-लावनि** पुं॰ఉప్పదనము; అమితమైన సౌందర్యము.
**लावनी**–स्त्री॰ ఒక విధమైన హిందీ పద్యము; ఈ పద్యమును సాధారణముగా డప్పువాయిస్తూ పాడుదురు.
**लावलश्कर**–पुं॰ సంబంధించిన జనం; సామగ్రితో సహా సైన్యము.

लावल्द–वि॰ సంతానము లేని.

लावा–पुं॰ ఒక విధమగు చిన్న పిట్ట; పేలాలు; అగ్ని పర్వతము నుంచి వెలువడు ద్రవ పదార్థము.

लावारिस–वि॰ వారసులు లేని; ఉత్తరాధికారులు లేని.

लाश–स्त्री॰ శవము.

लासा–पुं॰ జిగురు; జిగురు పదార్థము.

लासानी–वि॰ అద్వితీయమైన; సాటిలేని

लास्य–पुं॰ కోమల అంగముల ద్వారా శృంగార భావములను వ్యక్తము చేయు నృత్యము.

लाह–स्त्री॰ లక్క; చర్మము; पुं॰ లాభము; स्त्री॰ దీప్తి; కాంతి.

लाहु–पुं॰ లాభము.

लाहौल वला कूव्वत (इल्ला व इलिल्लाह)–पुं॰ భగవంతుడు తప్ప ఏ శక్తి లేదు.

लिंग–पुं॰ చిహ్నము; లక్షణము; శిశ్నము, లింగము; ఉదా : పుల్లింగం; స్త్రీలింగం

लिंगायत–पुं॰ ఒక విధమగు శివ సంప్రదాయము.

लिक्खाड़–पुं॰ అమితముగా వ్రాయువాడు; గొప్ప లేఖకుడు (వ్యంగ్యము).

लिखाई–स्त्री॰ వ్రాత; వ్రాతకూలి.

लिखा पढी–स्त्री॰ ఉత్తర ప్రత్యుత్తరములు; వ్రాతకోతలు.

लिखावट–स्त्री॰ వ్రాత; దస్తూరి.

लिखित–वि॰ వ్రాయబడిన; स्त्री॰ దస్తావేజు వ్రాత.

लिटाना–स॰क्रि॰ పడుకోబెట్టుట.

लिट्ट–पुं॰ నిప్పుల మీద కాల్చిన మందమైన గోధుమ రొట్టె.

लिड़ार–पुं॰ శృగాలము; నక్క; वि॰ పిరికియైన.

लिपटना–अ॰क्रि॰ అంటుకొనుట; కౌగిలించుట; మగ్నమగుట.

लिपटाना–स॰क्रि॰ అంటించుట; కౌగిలించుకొనుట; ఆలింగనము చేయుట.

लिपाई–स्त्री॰ అలుకు; అలుకు కూలి.

लिपाना–स॰क्रि॰ दे॰ लीपना.

लिपि–स्त्री॰ అక్షరములు వ్రాయు పద్ధతి.

लिप्त–वि॰ అంటుకొని యున్న; లీనమైన; అలక బడిన.

लिप्सा–स्त्री॰ లోభము; ఆకాంక్ష.

लिफाफा–पुं॰ ఉత్తరపు కవరు; బాహ్యాడంబరము; కళాయి; త్వరగా నశించు వస్తువు.

**लिफाफिया**–वि॰ బాహ్యాడంబరమైన.

**लिबास**–पुं॰ ఉడుపులు; వేషము.

**लिबासी**–वि॰ కృత్రిమమైన; ఆచ్ఛాదితమైన.

**लियाकत**–स्त्री॰ యోగ్యత; అర్హత.

**लिल्लाह**–क्रि॰वि॰ భగవంతుని పేరున; భగవంతుని కొరకు.

**लिलाट; लिलार**–पुं॰ दे॰ ललाट.

**लिवैया**–वि॰ తీసుకొనువాడు; తీసుకొని వెళ్లువాడు.

**लिहाज**–पुं॰ ధ్యానము; ధ్యాస; మొగమాటము; సంకోచము; సత్కారము, గౌరవము.

**लिहाजा; लेहाजा**–क्रि॰वि॰ ఇందులకు; ఈ కారణమున; కనుక.

**लिहाड़ा**–वि॰ నీచమైన; పతితమైన; చండాలమైన; పనికి మాలిన.

**लिहाड़ी**–स्त्री॰ ఎగతాళి; నింద.

**लिहाड़ी लेना**–मु॰ ఎగతాళి చేయుట; వెక్కిరించుట.

**लिहाफ**–पुं॰ रजाई-దూదితో నింపిన కప్పువస్త్రము.

**लीक**–स्त्री॰ గీత; చార; ఆనవాయితి; ఆచారము.

**लीक खींचना**–मु॰ హద్దులు ఏర్పడుట; ప్రతిష్ఠ స్థిరపడుట; కట్టుదిట్టములు ఏర్పడుట.

**लीक खींचकर**–मु॰ నిశ్చితముగా; దృఢముగా.

**लीक पीटना**–मु॰ అనాదినుంచి వస్తున్న ఆచారమును పాటించుట.

**लीख**–स्त्री॰ పేనుగుడ్డు.

**लीचड़**–वि॰ సోమరియైన; వెంటబడి పీడించు; లావాదేవీలు సరిగా లేని (వాడు); పనికి మాలిన.

**लीची**–स्त्री॰ ఒక విధమగు తియ్యని పండు

**लीद**–स्त्री॰ లద్దె (గుఱ్ఱము, గాడిద మొ॥)

**लीन**–वि॰ లీనమైన; మగ్నమైన.

**लीपना**–स॰क्रि॰ అలుకుట; లేపనము పూయుట.

**लीप पोतकर बराबर करना**–मु॰ ధ్వంసము చేయుట; మట్టి; పేడతో అలుకుట; పాడుచేయుట.

**लीप-पोती करना**–मु॰ తుడువులతో వ్రాయుట; కొట్టివేత లతో వ్రాయుట.

**लील**–पुं॰ నీలము; वि॰ నీలపు.

**लीलना**–स॰क्रि॰ మ్రింగుట.

**लीला**–स्त्री॰ మనోరంజనము కొరకు చేయు వ్యాపారము; క్రీడ; కేళి.

**लुंगी**–स्त्री॰ तहमत; లుంగీ.

**लुंचन** - पुं० గోళ్ళతో గిల్లుట; గిల్లుట; గోళ్ళతో గిల్లి పెకలించుట.

**लुंज**-वि०చేతులు, కాళ్ళు లేని; వికలాంగమైన; ఆకు, అలములేని చెట్టు; మోడు.

**लुंठित** - वि० దొర్లిన.

**लुंड** - पुं० తలలేనిమొండెము; కబంధుడు; కుండము.

**लुंडमुंड** - वि० తల, చేతులు, కాళ్ళు లేని మొండెము; ఆకూ, అలమూ లేని మోడు.

**लुआठा** - पुं० మండుచున్న కొరవి.

**लुआब** - पुं० ఉమ్మి, చొంగ, శ్లేషము; జిగురుగానుండు గుజ్జు.

**लुक** - पुं० నిప్పుమంట; వార్నిషు.

**लुकठी** - स्त्री० दे० लुआठा.

**लुकना** - अ०क्रि० దాగుకొనుట; చాటున ఉండుట.

**लुकमा** - पुं० గ్రాసము; ముద్ద; కబళము.

**लुगत** - स्त्री० భాష; స్పష్టమైన అర్థము లేని శబ్దము; శబ్ద నిఘంటువు.

**लुगदी** - स्त्री० తడిసిన ముద్ద; మట్టిముద్ద; రుబ్బిన పిండిముద్ద.

**लुगरी**-स्त्री० చినిగినపాతధోవతి; కొండెము; చాడి

**लुगाई** - स्त्री० స్త్రీ; ఆడది.

**लुगात** - स्त्री० నిఘంటువులు.

**लुचुई** - स्त्री० పల్చని మైదాపిండి పూరి.

**लुच्चा** - वि० దుష్టుడు; దురాచారి; చెడునడత గల; అబద్ధాల కోరు.

**लुटना** - अ०क्रि० దోపిడీ చేయబడుట; నాశమగుట.

**लुटाना** - स०क्रि० దోపిడీ చేయించుట; అపవ్యయము చేయుట; ఆలోచనా రహితముగా దానము చేయుట.

**लुटिया** - स्त्री० చిన్న చెంబు.

**लुटेरा** - पुं० దోపిడీ దొంగ.

**लुढना** - अ०क्रि० నేలమీద పడిదొర్లుట; పొర్లుట.

**लुढकना** - अ०क्रि० దొర్లుట.

**लुढकाना** - स०कि० దొర్లించుట; పార బోయుట.

**लुतरा** - वि० చాడీకోరు; కొంటెవాడు; అల్లరి చేయువాడు.

**लुत्फ** - पुं० ఆనందము; రుచి; స్వాదము; దయ; శ్రేష్ఠత.

**लुत्फी** - वि० దత్త పుత్రుడు; దత్తు తీసుకొనబడిన.

**लुनना** - स०कि० పక్వమునకు వచ్చిన పైరును కోయుట; నష్టపరుచుట.

**लुनेरा** - पुं० పంటపైరు కోయువాడు.

**लुपना** - अ०क्रि० దాగుట.

**लुप्त** - वि० దాగిన; అదృశ్యమైన.

**लुब्ध** - वि० అనురక్తమైన; మోహితమైన; మైమరచిన.

**लुभाना** - अ०क्रि० మోహితమగుట; అనురక్తమగుట;**स०क्रि०** మోహించుట; అనురక్తపరచుట; ఊరించుట; మైమరచుట.

**लुरकना** - अ०क्रि० लटकना ; వ్రేలాడుట.

**लुरकी** - स्त्री० చెవి లోలాకు.

**लुहार** - पुं० लोहार ; కమ్మరివాడు.

**लुहारी** - स्त्री० కమ్మరిపని; కమ్మరి జాతి స్త్రీ.

**लू** - स्त्री० लुआर ; వడగాలి ; **लूमारना या लगना** - मु० వడగాలి తగులుట; వడగాలుపు తగిలి జ్వరము వచ్చుట.

**लूक** - स्त्री० అగ్నిజ్వాల; కొరివి; రాలి పడు నక్షత్రము.

**लूका**-पुं० అగ్నిజ్వాల; నిప్పుమంట; కొరివి.

**लूट** - स्त्री० దోపిడీ; లూటీ.

**लूटना** -स०क्रि० దోచుట; దోపిడీచేయుట; మోసగించుట; మైమరచుట.

**लूटा** - वि० लुटेरा ; దోపిడీ చేయువాడు.

**लूम** - पुं० తోక; పుచ్ఛము; మగ్గము.

**लूमना** - अ०कि० వ్రేలాడుట.

**लूला** - वि० చేతులు తెగిని; అసమర్థమైన. పనికిమాలిన.

**लूलू** - वि० మూర్ఖతగల; తెలివిలేని.

**लेंडी** - स्त्री० పెంటిక; మేకలేకఒంటె పెంటి.

**लेंहड ; लेंहडा** - पुं० గుంపు; మంద.

**लेई** - स्त्री० లేహ్యము.

**लेकिन** - अव्य० కాని.

**लेख** - पुं० వ్రాత; వ్యాసము.

**लेखक** - पुं० వ్రాయువాడు; గ్రంథకర్త.

**लेखन** - पुं० వ్రాత; లెక్కచూచుట.

**लेखनी** - स्त्री० కలము.

**लेखा** - पुं० లెక్క; లెక్కింపు; సరియైన అంచన; ఆదాయ వ్యయముల పట్టి.

**लेखिका** - स्त्री० వ్రాయుస్త్రీ; రచయిత్రి.

**लेटना** - अ०क्रि० పడుకొనుట; పవ్వళించుట.

**लेन** - पुं० తీసికొనుట; ప్రాప్తి.

**लेनदार** - पुं० అప్పు; అప్పిచ్చువాడు.

**लेनदेन** - पुं० లావాదేవీలు ; **लेनदेन** - मु० సంబంధము.

**लेनहार** - वि० పుచ్చుకొనువాడు.

**लेना** - स०कि० తీసికొనుట; స్వీకరించుట.

**(आडे हाथों) लेना** - मु० మందలించుట; చివాట్లు పెట్టుట; **लेडालना**-मु० పాడు

चेयुटकु; ओडिंचुटकु; पूर्तिचेयुटकु.

చేయుట; ఓడించుట; పూర్తిచేయుట.

**लेनेदेने करना** - मु० घर्षण चేయుట; ఘర్షణ పడుట; అమితముగా ప్రయత్నించుట.

**लेना एक न देना दो** - मु० ఏమీ అర్థము లేదు; ఏమీ సంబంధము లేదు.

**लेना डूबना या मरना** - मु० తనతోపాటు ఇతరులను కూడ నాశము చేయుట.

**कान में लेना** - मु० వినుట.

**लेप** - पुं० లేపము; పూత.

**लेपन** - पुं० లేపము.

**लेपना** - स०क्रि० ఏదేని లేపము పూయుట.

**लेपालक** - पुं० దత్తపుత్రుడు.

**लेरूवा** - पुं० దూడ.

**लेलिहान**-वि०దేవిరికొట్టువాడు; దేవిరించు వాడు; वि० సర్పము; పాము.

**लेवा** - वि० తీసుకొనువాడు; पुं० సున్నపు అడుసు; మట్టి అడుసు.

**लेवा देई** - यौ० లావాదేవీలు.

**लेश** - वि० అల్పమైన; కొంచము; కొద్ది ; पुं० లఘుత్వము; సూక్ష్మత, సంసర్గము ; చిహ్నము; ఒక విధమగు అలంకారము.

**लेहन** - पुं० రుచిచూచుట; నాకుట.

**लेहाजा** - क्रि०वि० दे० **लिहाजा.**

**लैस** - वि० తయారై; సన్నద్ధమైన; पुं० లేసు; ఒక విధమగు బాణము.

**लोंदा** - पुं० ముద్ద; పిండము.

**लोइ** - पुं० लोग ; ప్రజ; स्त्री० దీప్తి; కాంతి.

**लोई** - स्त्री० గోధుమ రొట్టె చేయుటకు కలిపిన చిన్న పిండి ఉండ स्त्री० ఒక విధముగు కంబళి.

**लोक** - पुं० లోకము; జగత్తు; స్థానము; యశము.

**लोकलीक** - स्त्री० లోకమర్యాద.

**लोकसंग्रह** - पुं० లోకరంజనము ; యావత్తు లోకమును సంతోషపెట్టుట.

**लोकसत्ता** - स्त्री० ప్రజాస్వామ్య వ్యవస్థ.

**लोकाना** - स०क्रि० పైకి ఎగరవేయుట.

**लोकापवाद** - पुं० లోకనింద.

**लोकायत** - पुं० ఈలోకాన్ని తప్ప వేరే లోకము ఉందని ఒప్పనివాడు; చార్వాక దర్శనము లేక సిద్ధాంతము.

**लोकोक्ति** - स्त्री० లోకోక్తి; సామెత.

**लोकोत्तर** - वि० అలౌకికమైన; విలక్షణమైన; అద్భుతమైన.

**लोखर** - पुं० మంగలివాని పనిముట్లు; వడ్రంగి పనిముట్లు; కంచరి వాని పనిముట్లు.

**लोग** - पुं० జనము; ప్రజ.

**लोगाई** - स्त्री० दे० **लुगाई.**

**लोच** - स्त्री० హావము ; కోమలత్వము;

సొబగు; వాంఛ.

**लोचन** - पुं० నేత్రము; కన్ను.

**लोटना** - अ०क्रि० దొర్లుట; పొర్లుట; విశ్రమించుట; **लोट जाना** - मु० అపస్మారములోనుండుట; చనిపోవుట.

**लोटपोट** - स्त्री० విశ్రాంతి; ఆనందము.

**(खुशी के मारे) लोट पोट होना** - मु० ఆనందముతో తబ్బిబ్బు అగుట.

**लोटा** - पुं० చెంబు; చిన్న పాత్ర.

**लोटिया** - स्त्री० చిన్న చెంబు; **लोटिया डूबना** - मु० అసఫలమగుట; అప్రతిష్ఠ పాలగుట; నష్టపోవుట.

**लोढना** - स०क्रि० తుంచుట; గింజలను పత్తినుండి వేరుచేయుట; ఏరుట.

**लोढा** - पुं० సన్నికలలోని రాయి; **लोढा डालना** - मु० సమము చేయుట; చదును చేయుట; **लोढा ढाल** - मु० వినాశము.

**लोढिया** - स्त्री० చిన్న నూరుబండ.

**लोथ ; लोथि** - स्त्री० लाश ; శవము.

**लोथडा** - पुं० మాంసపిండము.

**लोन** - पुं० లవణము; ఉప్పు.

**जले पर लोन लगाना या छिडकना** - मु० కష్టము మీద కష్టము కలుగజేయుట.

**लोना** - वि० नमकीन ; ఉప్పని; సుందరమైన.

**लोनाई** - स्त्री० లావణ్యము.

**लोनार** - पुं० ఉప్పు తయారు చేయు లేక దొరుకు చోటు.

**लोनिया** - पुं० नोनियाँ ; ఉప్పు తయారు జాతి; ఉప్పు వ్యాపారము చేయు జాతి; वि० మనోహరమైన.

**लोनी** - स्त्री० ఒకవిధమగు శాకము.

**लोप** - पुं० లోపము; నాశము; క్షయము.

**लोपना** - स०क्रि० లోపించుట; లుప్తము చేయుట.

**लोबान** - पुं० సాంబ్రాణి మాదిరి ఒక సుగంధ ద్రవ్యము.

**लोबिया** - पुं० అలచంద; బొబ్బర్లు.

**लोभ** - पुं० లోభము.

**लोम** - पुं० వంటిమీది వెంట్రుకలు; గుంటనక్క.

**लोमडी** - स्त्री० గుంటనక్క.

**लोमहर्षण** - वि० అత్యంత భయంకరమైన; చూపర్లకు గగుర్పాటు కలిగించునంత భయంకరమైన.

**लोयन** - पुं० లోచనము; కన్ను.

**लोरी** - स्त्री० జోలపాట.

**लोल** - वि० చంచలమైన; ఉత్సుకతగల; క్షణికమైన.

**लोलक** - पुं० లోలాకు; లోలకి.

**लोलना** - अ०क्रि० చలించుట.

**लोला** - स्त्री० జిహ్వ; నాలుక; లక్ష్మీదేవి.

**लोलिनी** - वि० (स्त्री०) చంచల స్వభావము గల స్త్రీ.

**लोलुप** - वि० లోభి; పేరాశగల; తిండిపోతు.

**लोह** - पुं० दे० लोहा.

**लोहसार** - पुं० ఉక్కు; ఉక్కుగొలుసు.

**लोहा** - पुं० ఇనుము; అస్త్రము.

**लोहा गहना** - मु० శస్త్రము చేబూనుట; యుద్ధము చేయుట.

**लोहा मनना** - मु० ఎదుటివాని గొప్పతనమును స్వీకరించుట; ఓడిపోవుట.

**लोहा लेना** - मु० యుద్ధము చేయుట.

**लोहे के चने** - मु० దుష్కర కార్యము.

**लोहे के चने चबाना** - मु० అసాధ్యమైన కార్యమును బహుకష్టపడి సాధించుట.

**लोहार** - पुं० लुहार ; కమ్మరి.

**लोहारी** - स्त्री० लुहारी ; కమ్మరిపని.

**लोहित** - वि० ఎర్రని.

**लोहिया** - पुं० ఇనప వస్తువుల వ్యాపారి; వైశ్యుల లేక మార్వాడీలలో ఒక తెగ.

**लोहू** - पुं० दे० लहू.

**लौंग** - पुं० లవంగము; లవంగ ఆకారములో నున్న ముక్కు పుడక.

**लौंडा** - पुं० छोकरा ; పిల్లవాడు; పిల్లకాయ; పోరగాడు.

**लौंडी** - स्त्री० छोकरी ; పోరి; దాసి.

**लौ** - स्त्री० అగ్నిజ్వాల; దీపము వత్తి; अव्य० వరకు.

**लौकना** - अ०क्रि० కాన్పించుట; గోచరమగుట.

**लौकी** - स्त्री० ఆనపకాయ; సొరకాయ.

**लौटना** - अ०क्रि० తిరిగివచ్చుట; వెనకకు తిరుగుట.

**लौट फेर** - पुं० తారుమారు.

**लौटाना** - स०क्रि० తారుమారు చేయుట; తిరిగి ఇచ్చుట; మార్చుట.

**लौन** - पुं० లవణము; ఉప్పు.

**लौना** - वि० लौनी లవణయుక్తమైన; సొగసైన.

**लौनी** - स्त्री० పొలములోని పైరుకోత; వెన్న; నవనీతము.

**लौवा** - पुं० ఆనపకాయ.

**लौस** - पुं० मिलावट ; కల్తీ; కలయిక; సంపర్కము.

**लौहित्य** - पुं० బ్రహ్మపుత్ర నది; ఎర్ర సముద్రము; वि० ఎర్రని.

## व

**वंक** - वि० వక్రమైన; వంకరగల.

**वंकट** - वि॰ వంకరైన; కుటిలమైన; పోకిల్లా; దుర్గమమైన.

**वंग** - पुं॰ బెంగాలు ప్రదేశము; తగరము; తగర భస్మము.

**वंगज** - पुं॰ సింధూరము; కుంకుమ.

**वंचक** - वि॰ దుష్టుడు; దగాకోరు.

**वंचन** - पुं॰ మోసము; వంచన.

**वंचना**-स॰क्रि॰ దగాచేయుట; వంచించుట; स्त्री॰ మోసము; వంచన.

**वंचित** - वि॰ మోసగింపబడిన; నేరుపరచబడిన; రహితమైన.

**वंदन** - पुं॰ వందనము; ప్రణామము.

**वंदनमाला** - स्त्री॰ తోరణము.

**वंदना** - स्त्री॰ స్తుతి; ప్రణామము; నమస్కారము.

**वंदनीय** - वि॰ ఆదరించదగిన; వందన యోగ్యమైన.

**वंदित**-वि॰పూజింపదగిన; ఆదరణీయమైన.

**वंदीजन**-पुं॰ వందిమాగధులు; వైతాళికులు.

**वंद्य** - वि॰ ప్రణమించదగిన; నమస్కరించ దగిన.

**वंध्या** - स्त्री॰ గొడ్రాలు; సంతానములేని స్త్రీ.

**वंश** - पुं॰ కులము; వంశము; వెదురు.

**वंशस्थ** - पुं॰ ద్వాదశవర్ణములు గల ఒక వర్ణవృత్తము.

**वंशी** - स्त्री॰ మురళి; పిల్లనగ్రోవి; अव्य॰ మరియు; पुं॰ వాయువు.

**वकअत** - स्त्री॰ శక్తి; సామర్థ్యము; ఎత్తుదనము.

**वकफियत** - स्त्री॰ दे॰ **वाकफियत.**

**वकवृत्ति** - स्त्री॰ **बकवृत्ति** ; దగాచేసి పని నెరవేర్చుకునే ప్రయత్నము.

**वकाया** - पुं॰ ఘటనలు; వృత్తాంతములు.

**वकालत** - स्त्री॰ వకీలు పని; ప్లీడరు పని.

**वकुल** - पुं॰ బొగడ చెట్టు.

**वकूआ** - पुं॰ సంభవము; సంభవించుట.

**वकूफ** - पुं॰ జ్ఞానము; తెలివి.

**वक्त** - पुं॰ సమయము; కాలము; అదను; తీరిక

**वक्तव्य** - वि॰ చెప్పదగిన; पुं॰ చెప్పబడినది; కథనము.

**वक्ता** - वि॰ వాక్పటు; వాగ్మి; వాక్చాతురి గల.

**वक्त्र** - पुं॰ ముఖము; నోరు.

**वक्तृता** - स्त्री॰ వాక్పాటి; కథనము; ఉపన్యాసము.

**वक्फ** - पुं॰ మతము కొరకు దానము చేయబడిన ఆస్తి; ధర్మార్థము దానము చేసిన సంపత్తు.

**वक्र** - वि॰ వంకరగల; వక్రమైన.

ప్రధానమైన.

**वर्क** - पुं० दे० वरक.

**वर्ग** - पुं० శ్రేణి; వర్గము; చదరము.

**वर्गफल** - पुं० చదరపు కొలత; వైశాల్యము.

**वर्चस** - पुं० తేజస్సు; కాంతి; చాపము.

**वर्चस्वी** - पुं० తేజస్వి.

**वर्जन** - पुं० త్యాగము; నిషేధము; వదలుట.

**वर्जना** - स०क्रि० అభ్యంతర పెట్టుట; నిషేధించుట; త్యజించుట.

**वर्जित** - वि० త్యజింపబడిన; నిషేధించుట.

**वर्ज्यित** - वि० నిషిద్ధమైన; త్యక్తమైన.

**वर्ज्य** - वि० వర్జ్యము; త్యాజ్యము.

**वर्ण** - पुं० అక్షరము; వర్ణము; రంగు; జాతి.

**वर्णन** - वि० చిత్రణము; వర్ణన; ప్రశంస.

**वर्ण्य** - वि० వర్ణన విషయము; వర్ణించదగిన.

**वर्तन** - पुं० నడవడి; నడత; వృత్తి; త్రిప్పుట; సన్నికలు రాయితో నూరుట.

**वर्तमान** - वि० జరుగుచున్న; హాజరుగా నున్న.

**वर्ति** - स्त्री० ఒత్తి; కాటుక; గోరి.

**वर्ती** - वि० వ్యవహరించు; అమలులోనున్న; జారీ అయిన.

**वर्तुल** - वि० వృత్తాకారముగల; గుండ్రముగా నున్న.

**वर्दी** - स्त्री० दे० वरदी.

**वर्द्धन** - पुं० వృద్ధి; పెరుగుదల; ఉన్నతి; తరుముట.

**वर्द्धमान** - वि० వృద్ధిజెందుచున్న; పెరుగుచున్న.

**वर्द्धित** - वि० పెరిగిన; వృద్ధిజెందిన.

**वर्ना** - अव्य० दे० वरना.

**वर्म** - पुं० కవచము.

**वर्ष** - पुं० సంవత్సరము.

**वर्षगाँठ** - स्त्री० జన్మదిన పండుగ.

**वर्षा** - स्त्री० వాన; వానాకాలము; వర్షము.

**वर्ह** - पुं० दे० बर्ह.

**वलय** - पुं० మండలము; చుట్టు; గుండ్రాకారము; గాజు; కంకణము.

**वलयित** - वि० చుట్టు ముట్టిన; గుండ్రని; చుట్టబడిన.

**वलवला** - पुं० ఉత్సాహము; ఆవేశము.

**वलाक** - पुं० కొంగ.

**वलाहक** - पुं० మేఘము; పర్వతము; ఒక రాక్షసుని పేరు.

**वलि** - स्त्री० రేఖ; పంక్తి; दे० बलि.

पुं०యజమాని; శాసకుడు; అధికారి.

**वली** - स्त्री० ముడత; పంక్తి; రేఖ.

**वली अहद** - पुं० యువరాజు.

**वल्कल** - पुं० చెట్టు బెరడు; నారవస్త్రము.

**वल्द** - पुं० వారస పుత్రుడు.

**वल्दियत** - स्त्री० తండ్రి పేరు పరిచయము.
**वल्मीक** - पुं० పుట్ట; వాల్మీకి ఋషి.
**वल्लभा** - स्त्री० ప్రేయసి; ప్రియురాలు.
**वल्लरि ; वल्लरी** - स्त्री० లత; మంజరి; తీగ.
**वल्ली** - स्त्री० లత.
**वल्लाह** - अव्य० భగవంతుని సాక్షిగా.
**वल्लिका ; वल्ली** - स्त्री० दे० वल्लरि.
**वशंवद** - वि० వశములోనున్న; వశీభూత మైన.
**वश** - पुं० వశము; అధికారము.
**वश्य** - वि० వశ్యమైన; వశములోనున్న.
**वश्यता** - स्त्री० అధీనత.
**वसअत** - स्त्री० విస్తారము; విస్తీర్ణము; శక్తి; సామర్థ్యము.
**वसंतदूत** - पुं० మామిడి చెట్టు; కోకిల; చైత్రమాసము.
**वसंतदूती** - स्त्री० కోకిల; మాధవీలత.
**वसंतपंचमी** - स्त्री० మాఘ శుక్ల పంచమి; (శ్రీ) పంచమి.
**वसन** - पुं० कपडा ; వస్త్రము.
**वसवास** - पुं० భ్రమ; సందేహము; ప్రలోభనము.
**वसा** - स्त्री० క్రొవ్వు.
**वसीका** - पुं० తన బంధువులకుగాని; ధర్మకార్యమునకుగాని వడ్డీని వినియోగించవలసినదిగా ప్రభుత్వ కోశాగారమున ఎవరేని జమ చేయు ధనము.
**वसीयत** - स्त्री० తన తదనంతరము తన ఆస్తిని తన వారసులకు చెందవలసినదిగ వ్రాసిన విల్లు లేక చట్ట వ్యవస్థ.
**वसीयतनामा** - पुं० విల్లు పత్రము; మరణ శాసనము.
**वसुंधरा** - स्त्री० वसुधा ; పృథ్వి.
**वसुमती** - स्त्री० పృథ్వి; భూమి.
**वसूक** - पुं० దృఢత; విశ్వాసము; అధ్యయన సాయము.
**वसूल** - वि० ప్రాప్తించిన; లభించిన; తీర్చబడిన.
**वसूली** - स्त्री० ప్రాప్తి; ఇతరులనుంచి వసూలు చేయుట; వసూలు కావలసిన సొమ్ము; వసూలి.
**वस्तुत:** - अव्य० యథార్థతః ; నిజానికి, వాస్తవము.
**वस्तुस्थिति** - स्त्री० పరిస్థితి; మూలము.
**वस्ल** - पुं० సంయోగము; కలయిక; మృత్యువు.
**वहदत** - स्त्री० ఏకత్వము.
**वहन** - पुं० మోత; వహించుట.
**वहब** - पुं० ఔదార్యము.
**वहबी** - वि० ఇవ్వబడిన; ఈశ్వర ప్రదత్తమైన.

**वहम** - पुं० భ్రమ; మిధ్యాధారణ.
**वहमी** - वि० సందేహించు; సంశయాత్మ; సంశయించువాడు.
**वहशत** - स्त्री० जंगलीपन ; భయానకత; అనాగరికత; పిచ్చి.
**वहशी**-वि० जंगली; అడవికి సంబంధించిన; అనాగరికమైన.
**वहाँ** - अव्य० అక్కడ.
**वहाबी** - पुं० మహమ్మదీయులలో ఒక సంప్రదాయము; ఈసంప్రదాయమును అనుసరించువాడు.
**वह्नि** - स्त्री० అగ్ని; నిప్పు.
**वहीं** - अव्य० అక్కడే; అచ్చటనే.
**वही** - सर्व० పూర్వోక్త వ్యక్తి లేక విషయము లేక వస్తువు; నిర్దిష్టమైన వ్యక్తి; విషయము; వస్తువు మాత్రమే.
**वहीद** - वि० విలక్షణమైన; సాటిలేని.
**वांछनीय** - वि० కోరదగిన.
**वांछा** - स्त्री० కోరిక; అభిలాష.
**वांछित** - वि० కోరబడిన; కోరిన.
**वा** - अव्य० अथवा ; या ; లేక.
**वाइज** - पुं० ఉపదేశమిచ్చువాడు; మంచి ఉపదేశములిచ్చువాడు.
**वाकई** - वि० నిజమైన; యధార్థమైన ; अव्य० నిజానికి; వాస్తముగ.
**वाकफीयत** - स्त्री० ఎరుక; పరిచయము; పరిజ్ఞానము.
**वाकया** - पुं० ఘటన; సంఘటన; సమాచారము; వృత్తాంతము.
**वाकिफ** - वि० తెలిసిన; ఎరిగిన; అన్నీ తెలిసిన.
**वाकिफकार** - वि० అన్నింట పరిచయము ఉన్నటువంటి అనుభవముగల; అనుభవజ్ఞుడు.
**वाक्पटु** - वि० మాటకారి; చతురుడు.
**वाक्य** - पुं० సార్థక శబ్దసమూహము.
**वागीश** - पुं० బృహస్పతి; బ్రహ్మ; కవి; वि० మాటకారి; వక్త.
**वागीश्वरी** - स्त्री० సరస్వతి.
**वाग्जाल** - पुं० శబ్దాడంబరము; వాగాడంబరము.
**वाग्मी** - पुं० ప్రభావోత్పాదకముగా మాట్లాడువాడు; గొప్ప పండితుడు; వక్త.
**वाङ्मय** - वि० వాక్సమూహము ; సాహిత్యము.
**वाचक** - वि० చెప్పువాడు; సూచించువాడు; पुं० నామము; సంజ్ఞ.
**वाचन** - पुं० పఠనము; చదువుట.
**वाचनालय** - पुं० పఠనాలయము.
**वाचस्पति** - पुं० బృహస్పతి.

**वाचा** - स्त्री० వాణి; వాక్యము; శబ్దము;

**वाचाबंध** - वि० ప్రతిజ్ఞాబద్ధమైన.

**वाचाल** - वि० వాగుడుగాడు; వాచాలుడు; అతిగా మాటాడువాడు.

**वाचालता** - स्त्री० వాగుడు; మాటకారితనము.

**वाचिक** - वि० వచన సంబంధమైన; पुं० వచనాభినయము.

**वाची** - वि० వ్యక్తపరచు; సూచించు.

**वाच्य** - वि० చెప్పదగిన; శబ్ద సంకేతముల ద్వారా బోధపరచు; पुं० అభిధేయార్థము.

**वाच्यार्थ** - पुं० శబ్దార్థము; శబ్దము యొక్క మూలార్థము.

**वाच्यावाच्य** - पुं० చెప్పదగిన లేక చెప్పదగని మాట.

**वाज** - पुं० ఉపదేశము; ధర్మోపదేశము.

**वाजिब** - वि० मुनासिब ; ఉచితమైన సరియైన.

**वाजिबी** - वि० ఉచితమైన; సరియైన; पुं० ప్రతిమాసము లభించు వేతనము లేక బత్తెము.

**वाजी** - पुं० గుఱ్ఱము; విరిగినపాలలోనినీరు.

**वाट** - पुं० బాట ; దారి.

**वाटिका** - स्त्री० తోట; వాటిక.

**वाणिज्य** - पुं० వాణిజ్యము; వ్యాపారము.

**वाणी** - स्त्री० నోటినుండి వెలువడు సార్థక శబ్దము; వచనము; సరస్వతి.

**वाणी फुरना** - मु० నోటనుండి మాట వెలువడుట.

**वात** - पुं० వాయువు; గాలి; వాతము.

**वातचक्र** - पुं० बवंडर ; సుడిగాలి.

**वातायन** - पुं० చిన్న కిటికీ.

**वातावरण** - पुं० వాయుమండలము; వాతావరణము.

**वातुल** - वि० ఉన్మత్తుడు; పిచ్చివాడు.

**वात्या** - स्त्री० बवंडर ; సుడిగాలి.

**वाद** - पुं० వాదము; తర్కము.

**वादक** - पुं० వాద్యము వాయించువాడు ; వాదించువాడు; వక్త.

**वादा** - पुं० వాగ్దానము; ప్రతిజ్ఞ.

**वादा खिलाफी करना** - मु० ఇచ్చిన మాటకు భిన్నముగా వ్యవహరించుట.

**वादा रखाना** - मु० వాగ్దానము చేయించుట.

**वादी** - पुं० मुद्दई ; ముద్దాయి; మొరపెట్టుకొనువాడు; వక్త; వాది. **प्रतिवादी** - पुं० मुद्दालेह ; ప్రతివాది.

**वानीर** - पुं० పేము బెత్తము లేక చువ్వ.

**वापन** - पुं० విత్తునాటుట.

**वापस** - वि० తిరిగివచ్చిన.

**वापस आना** - अ०क्रि० తిరిగి వచ్చుట.

**वापसी** - वि० తిరిగివచ్చియున్న; త్రిప్పి వేసియున్న. स्त्री० ప్రత్యావర్తనము; తిరిగిరాక.

**वापिका; वापी** - स्त्री० बावली ; బావి; దిగుడుబావి.

**वाम** - वि० ఎడమ; ప్రతికూలమైన; విరుద్ధమైన; వంకర.

**वामदेव** - पुं० శివుడు.

**वामन** - वि० बौना ; పొట్టివాడు; మరుగుజ్జు.

**वामांगिनी; वामांगी** - स्त्री० పత్ని; భార్య.

**वामा** - स्त्री० స్త్రీ; దుర్గాదేవి.

**वायस** - पुं० కాకి; వాయసము.

**वारंवार** - अव्य० दे० बारबार.

**वार** - पुं० ద్వారము; దర్వాజ; ఆటంకము; పర్యాయము; దెబ్బ; ఆఘాతము.

**वारण** - पुं० నిషేధము; ఆటంకము.

**वारतिया** - स्त्री० వేశ్య.

**वारदात** - स्त्री० దుర్ఘటన; కొట్లాట; భీషణమైన సంఘటన.

**वारन** - स्त्री० దిగదుడుపు; पुं० తోరణము.

**वारना** - स०क्रि० దిగదుడుచుట; విసర్జించుట.

**वारनारी** - स्त्री० వారవధువు; వేశ్య.

**वारपार** - पुं० ఇద్దరి-అద్దరి (నది ఏరు మొ॥) హద్దు. अव्य० ఈ ఒడ్డునుండి ఆ ఒడ్డు వరకు.

**वारमुखी** - स्त्री० వేశ్య.

**वारा** - पुं० किफायत ; పొదుపు.

**वारा-न्यारा** - पुं० फैसला ; తీర్పు; నిర్ణయము.

**वारि** - पुं० జలము; నీరు.

**वारिज** - पुं० కమలము; శంఖము; నత్తగుల్ల.

**वारिद** - पुं० మేఘము.

**वारिधि** - पुं० సముద్రము.

**वारिवाह** - पुं० दे० वारिद.

**वारिस** - पुं० వారసుడు; ఉత్తరాధికారి.

**वारीश** - पुं० दे० वारिधि.

**वारुणी** - स्त्री० మద్యము.

**वार्ता** - स्त्री० సమాచారము; వృత్తాంతము; వదంతి.

**वार्तिक** - पुं० వ్యాఖ్యానము.

**वार्षिक**-वि०సాలీనా; ప్రతి సంవత్సరమునకు సంబంధించిన.

**वाला** - प्रत्य० ఒకసంబంధసూచక శబ్దము; ఉదా: गाडीवाला ; मकानवाला ; वि० శ్రేష్ఠమైన; మహోన్నమైన.

**वालिद** - पुं० తండ్రి.

**वालिदा** - स्त्री० తల్లి.

**वालिदैन** - पुं० बहु० తల్లి-దండ్రులు.

**वाली** - पुं० యజమాని; ప్రభువు; చక్రవర్తి;

राజు; సంరక్షకుడు.

**वावैला** - पुं० విలాపము; ఏడ్పు; గందరగోళము.

**वासंत** -वि० వసంతఋతువుకు సంబంధించిన.

**वासंतक** -वि० వసంత ఋతు సంబంధమైన; వసంత ఋతువులో నాటిన.

**वासंतिक**-पुं० విదూషకుడు; నృత్యకారుడు.

**वास** - पुं० వాసము; నివాసము; ఇల్లు; గంధము; సుగంధము.

**वासना** - स्त्री० భావన; సంస్కారము; కోరిక; కామన; వ్యసనము.

**वासर** - पुं० దినము; దివసము.

**वासव** - पुं० ఇంద్రుడు.

**वासित** - वि० సుగంధ పరచబడిన; గుడ్డతో మూయబడిన.

**वासिल** - वि० వసూలైన; వసూలుకానున్న.

**वास्ता** - पुं० సంబంధము; స్నేహము.

**वास्ते** - अव्य० నిమిత్తము; కొరకు.

**वाह** - अव्य० ప్రశంసా సూచక శబ్దము.

**वाहक** - पुं० మోయువాడు; వాహకుడు.

**वाहन** - पुं० బండి; వాహనము.

**वाहवाही** - स्त्री० జనామోదము; ప్రశంస; స్తుతి.

**वाहित** - वि० మోయబడిన.

**वाहिद**-वि० ఒకటి; ఒంటరి; पुं० భగవంతుడు.

**वाहिनीपति** - पुं० సైన్యాధిపతి.

**वाहिब** - वि० ఔదార్యముగల; దాతయగు.

**वाहियात** - वि० చెడ్డ; వ్యర్థమైన.

**वाही** - वि० సోమరియైన; పనికిమాలిన; తిరుగుబోతు.

**वाही-तबाही** - वि० నికృష్టమైన; తలాతోకలేని; स्त्री० పనికిమాలిన వాగుడు; తిట్లు తిమ్మలు.

**विंश** - वि० बीसवाँ ; ఇరవయ్యవ.

**वि** - उप० శబ్దప్రారంభము వచ్చి విశేషార్థమును కలిగించు ఒక ఉపసర్గము.

**विकच** - वि० వికసించిన; కేశహీనమైన.

**विकट** - वि० विकराल ; భీషణమైన; వికరాలమైన; వక్రమైన; కఠినమైన.

**विकल** - वि० విహ్వలమైన; వ్యాకులమైన; కళాహీనమైన.

**विकल्प** - पुं० భ్రాంతి; భ్రమ.

**विकसना** - अ०क्रि० వికసించుట.

**विकसित** - वि० ప్రస్ఫుటితమైన; వికసించిన; ప్రఫుల్లమైన.

**विकार** - पुं० మార్పు; దోషము; చెడు; దుర్గుణము; వాసన.

**विकारी** - वि० మార్పుచెందిన; మారిన.

**विकाश** - पुं० ప్రకాశము; వ్యాప్తి; ప్రసారము.

**विकास** - पुं० వృద్ధి; వికాసము.
**विकासना** - स०क्रि० వికసింపజేయుట; వ్యక్తపరచుట.
**विकीर्ण** - वि వ్యాపించియున్న; ప్రసిద్ధమైన.
**विकृत** - वि० అస్వాభావికముగా మార్పు జెంది చెడిన; వికృతమైన.
**विकृष्ट** - वि० ఆకర్షింపబడిన; ఆకృష్టమైన.
**विक्रम** - पुं० పరాక్రమము; ప్రతాపము; శక్తి.
**विक्रमी** - पुं० విక్రముడు; పరాక్రమశాలి.
**विक्रय** - पुं० అమ్మకము.
**विक्रांत** - पुं० వీరుడు; శూరుడు.
**विक्रांति** - स्त्री० వీరత్వము; శూరత్వము; శక్తి; సామర్థ్యము.
**विक्रीत** - वि० అమ్ముడుబోయిన.
**विक्रेत** - वि० అమ్మువాడు.
**विक्रेय**-वि० అమ్మకమునకు సిద్ధముగానున్న; అమ్మకపు.
**विक्षत** - वि० గాయపడిన.
**विक्षिप्त** - वि० వికలమైన; పిచ్చెక్కిన; విరజిమ్మబడిన.
**विक्षिप्तता** - स्त्री० పిచ్చి.
**विक्षुब्ध** - वि० క్షోభించిన; ఉద్విగ్నమైన.
**विक्षोभ** - पुं० క్షోభము; మానసిక చాంచల్యము; ఉద్విగ్నత.
**विगत** - वि० గడచిపోయిన; గతించిన.
**विगति** - स्त्री० దుర్గతి; దుర్దశ.
**विगर्हणा** - स्त्री० బెదిరింపు; చీదరింపు; గద్దింపు.
**विगर्हित**-वि० గద్దింపబడిన; చీదరింపబడిన.
**विगलन** - पुं० కరుగుట; చెడిపోవుట.
**विगलित** - वि० కరిగిపోయిన; చెడిపోయిన.
**विग्रह** - पुं० కలహము; యుద్ధము; వేరుపరచుట; విడదీయుట.
**विघटन** - पुं० విరుచుట; పగలగొట్టుట; వినష్టపరచుట; దుర్ఘటన.
**विघटिका** - स्त्री० ఘడియ కాలములో 23వ వంతు.
**विघात** - पुं० దెబ్బ; ఆఘాతము; హత్య; నాశము.
**विचय** - पुं० సమకూర్పు; సోదా; పరీక్షణ.
**विचरण** - पुं० తిరుగుడు; పర్యటనము.
**विचरना** - अ०क्रि० తిరుగుట.
**विचलित** - वि० అస్థిరమైన; ప్రతిజ్ఞ లేక సంకల్పమునకు భిన్నముగానున్న.
**विचार** - पुं० అభిప్రాయము; భావము; వ్యాజ్యము తీర్పు.
**विचारक** - पुं० ఆలోచించువాడు; విచారకుడు; తీర్పు చెప్పువాడు; న్యాయకర్త.
**विचारना** - अ०क्रि० ఆలోచించుట; జాడ తీయ ప్రయత్నించుట.

సైన్య శిబిరపు బజారు.
**सदहा** - वि॰ వందలకొలది; ఎన్నో.
**सदस्य** - पुं॰ యజ్ఞము చేయువాడు; సభ; సమాజపు సభ్యుడు.
**सदा** - अव्य॰ ఎల్లప్పుడు ; నిరంతరము; स्त्री॰ ధ్వని; ప్రతి ధ్వని; శబ్దము; పిలుపు.
**सदाकत** - स्त्री॰ సత్యసంధత; యధార్థత; సాక్ష్యము.
**सदाचारिता** - स्त्री॰ శుద్ధాచరణము; ఋజు ప్రవర్తన.
**सदाफल**-वि॰ ఎప్పుడూ ఫలించు;కాయలు కాయు; पुं॰ మేడి చెట్టు లేక పండు.
**सदाबहार** - पुं॰ ఎల్లప్పుడూ పుష్పించు; ఫలించు; పచ్చగానుండు వృక్షము.
**सदारत** - स्त्री॰ అధ్యక్షత.
**सदावर्त** - पुं॰ క్షుధార్తులకు నిత్యము అన్న దానము చేయు ప్రదేశము - సత్రవు.
**सदाशय** - वि॰ ఉదార భావములు గల సుశీలుడు.
**सदासुहागिन** - स्त्री॰ వేశ్య.
**सदी** - स्त्री॰ శతాబ్ది; శతాబ్దము.
**सदृश** - क्रि॰वि॰ సమానమైన; తుల్యమైన.
**सदैव** - अव्य॰ ఎల్లప్పుడు.
**सद्म** - पुं॰ ఇల్లు; గృహము.
**सद्य** - अव्य॰ నేడే; ఇప్పుడే.
**सद्यः** - अव्य॰ दे॰ सद्य.
**सधर** - पुं॰ పై పెదవి.
**सधवा** - स्त्री॰ సౌభాగ్యవతి స్త్రీ; పుణ్యస్త్రీ.
**सन** - पुं॰ క్రీస్తు శకమునకు సంబంధించిన సంవత్సరము లేక గణన.
**सन** - पुं॰ నార (గోగు, జనుము మొ.)
**सनई** - स्त्री॰ నాసిరకపు నార.
**सनक** - स्त्री॰ వెర్రి; ఏదేని పనియెడల వెర్రి నిరతి.
**सनकना** - अ॰क्रि॰ వెర్రెక్కుట.
**सनकी** - वि॰ వెర్రిగల; వెర్రివాడు; पुं॰ కంటి సైగ; సంకేతము.
**सनद** - स्त्री॰ ప్రమాణపత్రము; ప్రామాణిక మైన మాట; విశ్వాసపాత్రుడు.
**सन्न** - वि॰ స్తబ్ధమైన; నివ్వెరబోయిన.
**सन्नद्ध** - वि॰ సిద్ధమైన; తయారైన; సన్నద్ధ మైన.
**सन्नाटा** - पुं॰ నిశ్శబ్దత; నీరవత; స్తబ్దత; ఉదాసీనత.
**सन्नेटे में आना** - मु॰ మౌనముగా ఉండి పోవుట; నివ్వెరపోవుట.
**सन्निकट** - वि॰ సమీపము; దగ్గర.
**सन्निध** - स्त्री॰ సామీప్యము; సమక్షము.
**सन्निविष्ट** - वि॰ ప్రవేశించిన; ప్రతిష్ఠితమైన; సమీపమున.

**सन्निवेश** - पुं० ప్రవేశము; సంతరితము; నివాసము; కూడా కూడా కూర్చొనుట.

**सन्निहित** - वि० ప్రవిష్ఠమైన; సమీపమున నున్న; ఒకేచోట ఉంచబడిన.

**सपक्ष**-वि० తన పక్షములో నున్న; సమర్థించు; రెక్కలు గల ; पुं० తరపువాడు; సహాయ కుడు; స్నేహితుడు.

**सपत्नी** - स्त्री० **सौतिन** ; సవతి.

**सपत्नीक** - वि० భార్య సమేతముగా.

**सपदि** - अव्य० ఆ సమయముననే; తక్షణము.

**सपना** - पुं० స్వప్నము; కల.

**सपरदाई** - पुं० వెంట తబల మొ॥ వాద్యములు వాయించువాడు; తార్పుడుగాడు.

**सपरना** - अ०क्रि० సమాప్తమగుట; కార్యమును నిర్వర్తించుట.

**सपाट** -वि० సమానమైన; సమముగ; చిక్కన.

**सपाटा** - पुं० వేగము; తీవ్రగతి; పరుగు; ఉరుకు.

**सैर सपाटा** - यौ० తిరుగుట; షికార్లు చేయుట.

**सपुर्द** - स्त्री० దాచమని ఇచ్చుట లేక ఇచ్చు వస్తువు; అప్పగింత ; वि० అప్పగించిన.

**सपुर्द करना** - स०क्रि० అప్పగించుట.

**सपूत** - पुं० సుపుత్రుడు.

**सपोला** - पुं० **सँपोला** ; పాము పిల్ల.

**सप्तपदी** - स्त्री० వివాహ సమయమున వధూవరులు 7 సార్లు అగ్ని హోత్రం చుట్టూ ప్రదక్షిణము చేయుట.

**सप्तर्षि** - पुं० 1.గౌతముడు 2. భరద్వాజుడు 3.విశ్వామిత్రుడు; 4.జమదగ్ని 5.వశిష్ఠుడు; 6.కశ్యపుడు 7.అత్రి-ఈ ఏడుగురు సప్తరుషులు.

**सप्ताह** -पुं० **हफ्ता** ; ఏడు దినముల కాలము; సప్తాహము.

**सफ** - स्त्री० పంక్తి; వరుస; పెద్ద చాప.

**सफर** - पुं० యాత్ర ; ప్రయాణము.

**सफरी** - वि० ప్రయాణంలో పనికివచ్చు; पुं० దారి ఖర్చు ; జామకాయ.

**सफलीभूत** - वि० సాఫల్యము పొందిన ; సిద్ధించిన.

**सफहा** - पुं० పృష్ఠము; పేజి.

**सफा**-वि० శుభ్రమైన; స్వచ్ఛమైన; సమముగా; పృష్ఠము - పేజి.

**सफाई** - स्त्री० పరిశుభ్రత; స్వచ్ఛత; వ్యవహారమునకు సంబంధించిన తీర్పు.

**सफाचट** - वि० పూర్ణముగా శుభ్రమైన.

**सफी** - वि० స్వచ్ఛమైన; పవిత్రమైన.

**सफीना** - पुं० పడవ; ఏదేని గుర్తుంచుకొను నిమిత్తము చీటీ మీద వ్రాయుట; కోర్టు

సమను.

**सफीर** - पुं० రాజదూత; రాయబారి.

**सफेद** - वि० **कोरा** ; తెల్లని.

**सफेदी** - स्त्री० శ్వేతత; ధవళత; తెలుపు దనము.

**सफेदा** - पुं० తగరభస్మము; ఒక విధమగు మామిడి; ఒక విధమగు పుచ్చకాయ.

**सफेदी पुतवाना** - स०क्रि० తెలుపురంగు వేయించుట; సున్నము కొట్టించుట.

**सफेदी आना** - मु० ముసిలితనము వచ్చుట; తెల్లరంగు పూతవేయుట; సున్నము కొట్టుట.

**सफ्फाक** - वि० ఖూనీకోరు; కసాయివాడు; నిర్దయుడు.

**सब** - वि० అంతా; అందరు.

**सबक** - पुं० పాఠము; ఉపదేశము.

**सबब** - पुं० కారణము.

**सबर** - पुं० दे० **सब्र**.

**सबल** - वि० శక్తివంతమైన; వెంట సైన్యము గల.

**सबा** - स्त्री० ప్రాతఃకాలమున వీచు తూర్పు గాలి.

**सबार** - क्रि०वि० శీఘ్రముగా.

**सबील** - क्रि०वि० మార్గము; దారి; ఉపాయము; చలివేంద్రము.

**सबूत** - पुं० ప్రమాణము; वि० పూర్ణమగు.

**सबेरा** - पुं० ప్రాతఃకాలము; ఉదయపువేళ.

**सब्ज** - वि० ఆకుపచ్చని ; పచ్చని; శుభప్రదమైన ; **सब्ज बाग दिखाना** - मु० అరచేతిలో స్వర్గము చూపించుట; తన పని సాధించు టకు ఆశలు పెట్టుట.

**[illegible]** - पुं० అమంగళకరముగువాని రాక; నిష్ప్రయోజకమైన.

**सब्जबख्त** - वि० అదృష్టముగల.

**सब्जा** - पुं० పచ్చదనము; భంగు; పచ్చ-ఆకు పచ్చ రత్నము.

**सब्जी** - स्त्री० **हरियाली** ; పచ్చదనము; కూరగాయలు.

**सब्र** - पुं० సంతోషము; ధైర్యము; ఓర్మి.

**सभागा** - वि० అదృష్టజాతకముగల; అందమైన.

**सभासद** - पुं० సభ్యుడు; సదస్యుడు.

**सभ्य** - पुं० సదస్యుడు; సభ్యుడు; పెద్దమనిషి; वि० సభ్యతగల.

**सभ्यता** - स्त्री० నాగరికత; సదస్యత; సుశీలత.

**समंत** - पुं० హద్దు; చివరికొన.

**समंद** - पुं० గుఱ్ఱము; సముద్రము; సరస్సు.

**सम** - वि० సమమైన ; సమానముగానున్న; నలుచదరముగానున్న.

**समकक्ष** - वि० తుల్యమైన; సాటియైన.
**समक्ष**-अव्य० सामने; ఎదుట; సమక్షమున.
**समग्र** - वि० సమస్తము; సమగ్రమైన.
**समझ** - स्त्री० బుద్ధి; తెలివి.
**समझदार** - वि० తెలివిగల.
**समझना** - अ०क्रि० విషయమును సరిగా అవగాహన చేసుకొనుట.
**समझवार** - वि० సరిగా అర్థము చేసుకొను వాడు; తెలివైన.
**समझाना** - स०क्रि० తెలియజెప్పుట.
**समझौता** - पुं० ఒడంబడిక.
**समतल** - वि० చదునుగానున్న.
**समता** - स्त्री० సమానత్వము; తుల్యత.
**समदन** - स्त्री० కానుక.
**समदर्शी** - वि० అందరిని సమానముగా చూచునాడు.
**समधिक** - वि० ఎక్కువ; అధికము.
**समधियाना** - पुं० వియ్యంకుని ఇల్లు.
**समधी** - पुं० వియ్యంకుడు; కుమారుని లేక కుమార్తె యొక్క మామగారు.
**समधीत** - वि० సక్రమముగా అధ్యయనించిన.
**समन** - पुं० కోర్టుసమను; स्त्री० మల్లెపూవు.
**समर** - पुं० యుద్ధము; పోరాటము.
**समरस** - वि० ఒకేవిధముగానున్న; ఒకే రుచిగల.
**समरांगण** - पुं० యుద్ధక్షేత్రము.
**समराना** - स०क्रि० అలంకరించుట; అలంక రింపజేయుట.
**समर्पित** - वि० సమర్పించబడిన.
**समल** - वि० మురికిగానున్న.
**समवयस्क** - वि० సమానమైన వయస్సుగల.
**समवेत** - वि० ఏకత్రపరచబడిన; ప్రోగుచేయ బడిన.
**समवेदना**-स्त्री०సానుభూతి; సహానుభూతి; గుమిగూడిన.
**समष्टि** - स्त्री० అందరు గల సమూహము; మొత్తము.
**समस्त** - वि० మొత్తము; సంయుక్తమైన.
**समाँ** - पुं० సమయము; కాలము.
**समाँ बँधना** - मु० శ్రోతలు; దర్శకులు అందరిని నివ్వెరబోవునట్లు చేయు పాట కచేరి లేక దృశ్యము; రక్తికట్టుట.
**समाअत** - स्त्री० శ్రవణము; వినుట.
**समाई** - स्त्री० సామర్థ్యము; ఇముడుట.
**समाकुल** - वि० కిక్కిరిసిన; ఎక్కువగా కలత జెందిన; గాబరా పడిన.
**समागत** - वि० ప్రవేశించిన; వచ్చిన.
**समागम** - पुं० రాక; కలయిక, మైథునము.
**समाजत** - स्त्री० లజ్జ; సిగ్గు; చాటు; చారిత; వినయము.

**समाना** - अ०क्रि० ఇముడుట; నిండుట.

**समापक** - पुं० పూర్తిచేయువాడు; సమాప్త పరచువాడు.

**समापित**-वि० సమాప్తమైన; పూర్తి అయిన.

**समारंभ** - पुं० బాగైన ప్రారంభము; ఏర్పాటు; కోలాహలము.

**समारोह** - पुं० ఆయోజనము; ప్రబంధము; కోలాహలము.

**समालोचक** - पुं० విమర్శకుడు.

**समालोचन** - पुं ; **समालोचना** - स्त्री० విమర్శ.

**समावर्तन** - पुं० ప్రత్యావర్తనము; తిరిగి వచ్చుట; విద్యాలయములో విద్యాధ్యయనము పూర్తి చేసుకుని స్నాతకుడు తన ఇంటికి తిరిగివెళ్ళుట.

**समाविष्ट** - वि० సమావేశించిన; చేర్చబడిన; కలపబడిన; ఇమిడియున్న.

**समावेश** -पुं० సమావేశము; ఒక పదార్థము మరియొక పదార్థములో లీనమగుట; మనోనియోగము; నిమగ్నత.

**समाहार** - पुं० అనేక వస్తువులను ఒకచోట ప్రోగుచేయుట; సంగ్రహము; సమూహము; గుట్ట; రాశి.

**समाहित** - वि० ఒకచోట ప్రోగుచేయబడిన; సమాప్తమైన.

**समिति**-स्त्री० సభ; సమాజము; ఏదేని విశిష్ట కార్యముకొరకు నియోగింపబడిన సభ.

**समिध** - पुं० అగ్ని; పుల్ల.

**समिधा** - स्त्री० యజ్ఞములో మంటపెట్టు పుల్ల; సమిధ.

**समीकरण** - पुं० సమాసముచేయుట; గణితములో తెలిసిన రాశి ద్వారా తెలియని రాశిని కనుగొను పద్ధతి.

**समीक्षा** - स्त्री० సైద్ధాంతిక సమాలోచన; మీమాంస; ప్రయాస.

**समीचीन** - वि० తగిన; యోగ్యమైన; సరియైన; ఉచితమైన.

**समीपवर्ती ; समीपस्थ** - वि० దగ్గరనున్న.

**समीर; समीरण** - पुं० వాయువు; గాలి.

**समुंद ; समुंदर** - पुं० दे० **समुद्र.**

**समुचित** - वि० తగిన; ఉచితమైన; ఉపయుక్తము.

**समुज्वल**-वि० మిక్కుటముగా ఉజ్వలమైన; ప్రకాశమానమైన.

**समुत्थान** - पुं० పైకిలేచుట; వికాసము; ఆరంభము.

**समुत्सुक** - वि० మిక్కుటముగా కుతూహలముగల.

**समुद्यत** - वि० బాగుగా సన్నద్ధమైన.

**समुद्र** - पुं० అంబుధి; సాగరము; సముద్రము.

**समुन्नत** - वि॰ ఎక్కువగా వికాసమునొందిన.
**समुन्नति** - स्त्री॰ మహత్త్యము; గొప్పదనము; ఎత్తు.
**समुल्लास** - पुं॰ ఉల్లాసము; ఆనందము; ఏదేని గ్రంథము యొక్క ప్రకరణము లేక పరిచ్ఛేదము.
**समुहा** - वि॰ ఎదుటి; क्रि॰वि॰ ఎదుట; సమక్షమున.
**समुहाना** - अ॰क्रि॰ ఎదుటకు వచ్చుట.
**समूम** - स्त्री॰ లూ; వడగాలి; విషవాయువు.
**समूल** - वि॰ కారణ సహితము ; వేరుతో; మూలముతో.
**समेटना** - स॰क्रि॰ చెల్లాచెదురుగానున్న వస్తువులను ప్రోగు చేయుట; వ్యాపించి ఉన్న వస్తువును ముడుచుట; భారము మోంచుట.
**समेत** - वि॰ కలసిన; సంయుక్తమైన; अव्य॰ సహితము.
**सम्मति** - स्त्री॰ అభిప్రాయము; సలహా; అనుమతి; ఆదేశము.
**सम्मन** - पुं॰ కోర్టుసమను.
**सम्मानित** - वि॰ గౌరవించబడిన; ప్రతిష్ఠ గల; ప్రతిష్ఠితమైన.
**सम्मिलित** - वि॰ కలిసియున్న; మిశ్రితమైన.
**सम्मिश्रण** - पुं॰ కలయిక; కల్తీ.
**सम्मेलन** - पुं॰ సభ; సంగమము.
**सम्यक** - वि॰ సమస్తము; యావత్తు; क्रि॰वि॰ అన్ని విధాలా; బాగుగా.
**सम्राज्ञी**-स्त्री॰ చక్రవర్తి భార్య; సామ్రాజ్యానికి అధికారిణి.
**सम्राट** - पुं॰ बादशाह ; చక్రవర్తి.
**सम्हलना** - अ॰क्रि॰ జాగ్రత్తపడుట; సంబాళించు కొనుట
**सयानप** - पुं॰ టక్కరితనము; టక్కు.
**सयाना** - पुं॰ వయస్సు వచ్చినవాడు; వయస్కుడు; తెలివిగలవాడు; తుంటరి.
**सर** - पुं॰ తటాకము; చెరువు; శిరము; తల; वि॰ అణగద్రొక్కబడిన; పరాజితమైన.
**सरअंजाम** - पुं॰ सरंजाम ; సామగ్రి.
**सरआगी** - पुं॰ అగ్నిబాణము.
**सर कना** - अ॰क्रि॰ జరుగుట; తొలగుట.
**सर कश** - वि॰ తిరుగుబాటుదారుడు; విద్రోహి.
**सर खुश**-वि॰ అన్నివిధములసుఖ సంపత్తులు కలిగి సుఖముగానున్న.
**सर गरम** -वि॰ ఆవేశముగల; ఉత్సాహముగల; సన్నద్ధమైన.
**सर गश्ता** - स्त्री॰ కష్టముల పాలైన; గాబర పడిన; వ్యాకులమైన.
**सर गुजश्त** -वि॰ అనుభవించిన విషయము;

ఆత్మకథ.

**सर जमीन** - वि० భూమి; దేశము.

**सर जोर** - वि० ప్రబలమైన; శక్తివంతమైన; పోకిరి; ఉద్దండమైన.

**सरणी** - स्त्री० మార్గము; దారి; రీతి.

**सरताज** - पुं० సర్వశ్రేష్ఠుడు; పరమ పూజ్యుడు.

**सरता-पा** - क्रि० वि० శిరస్సునుండి పాదముల వరకు; ఆద్యంతము.

**सरतारा** - वि० తన పని పూర్తి చేసుకొని నిశ్చింతగా నున్న.

**सरदार** - पुं० నాయకుడు; శ్రేష్ఠమైన వ్యక్తి.

**सरनाम** - वि० ప్రసిద్ధిచెందిన.

**सरनामा** - पुं० శీర్షకము; ఉత్తర ప్రారంభము - సంబోధన; ఉత్తరము మీద వ్రాయబడు చిరునామా.

**सरपंच** - पुं० పంచాయతీ అధ్యక్షుడు.

**सरपट** - क्रि०वि० అతివేగముగా గుఱ్ఱము పరిగెత్తుట; బహువేగముగా పరిగెత్తుట.

**सरपत** - पुं० सरकंडा ; జమ్ముగడ్డి.

**सर परस्त** - पुं० సంరక్షకుడు.

**सर पोश** - पुं० పళ్ళెరమును కప్పు వస్త్రము లేక మూత.

**सर फराज** - पुं० గౌరవనీయమైన; ప్రతిష్ఠ పొందిన; మొట్టమొదటిసారిగా సమాగమము చేయు (వేశ్య).

**सर फराना** - अ०क्रि० కలతచెందుట; వ్యాకులపడుట.

**सरबस्ता** - वि० గుప్తమైన; దాగియున్న.

**सरमस्त** - वि० మదించిన; మదోన్మత్తుడైన.

**सरवत** - स्त्री० వైభవము; సంపన్నత.

**सरवर** - पुं० दे० सरोवर.

**सरसना**-अ०क्रि० వికసించుట; శోభిల్లుట; ఉల్లాసపడుట.

**सरसब्ज** - वि० పచ్చదనముగల; కళకళలాడుతున్న.

**सरसरी** - वि० పైపైన; శీఘ్రమైన; సూక్ష్మముగా కాకుండా స్థూలముగ.

**सरसाम** - पुं० సన్నిపాతము.

**सरसार** - वि० మత్తులో నిండిన; మగ్నమైన; లీనమైన.

**सरसिज** - पुं० కమలము.

**सरसी** - स्त्री० చిన్న సరోవరము; చెరువు.

**सरसीरूह** - पुं० दे० सरसिज.

**सरसों** - स्त्री० ఆవాలు.

**सरहंग** - पुं० సేనాపతి; పైల్వాను; సిపాయి.

**सरह** - पुं० మిడత.

**सरहज** - स्त्री० భార్యసోదరుని భార్య.

**सरहद** - स्त्री० సీమ; సరిహద్దు.

**सराप** - पुं० दे० शाप.

**सराफ** - पुं० వెండి; బంగారముల వ్యాపారి.
**सराफा**-पुं० వెండి బంగారముల వ్యాపారము. వెండి బంగారు వ్యాపారుల విపణి వీధి.
**सराफी** - स्त्री० వెండి బంగారముల వ్యాపార వృత్తి.
**सराबोर** - वि० పూర్తిగా తడిసిన; నిమజ్జితమైన.
**सराय** - स्त्री० సత్రవు; ధర్మశాల.
**सरारी** - स्त्री० బాణపంక్తి.
**सरासन** - पुं० दे० शरासन.
**सरासर** - अव्य० ఒక కొసనుండి మరియొక కొసవరకు; పూర్ణముగా; సాక్షాత్తు.
**सरासरी** - स्त्री० సులభత; చురుకుదనము; స్థూలమైనఅంచన; क्रि०वि० తొందరలో; హడావడిలో; స్థూలముగా.
**सराह** - स्त्री० శ్లాఘ; ప్రశంస; పొగడ్త.
**सराहना** - स०क्रि० ప్రశంసించుట; పొగడుట.
**सराहनीय** - वि० ప్రశంసా యోగ్యమైన; పొగడదగిన; శ్రేష్ఠమైన.
**सरि** - स्त्री० झरना ; నది.
**सरिता** - स्त्री० ధార; నది.
**सरियाना** - स०क्रि० సరిగా ఉంచుట; క్రమానుసారము ఏర్పరుచుట.
**सरिवरि** - स्त्री० సమత; సమానత.
**सरिश्ता** - पुं० న్యాయస్థానము; కచ్చేరి; కార్యాలయము; కార్యాలయ విభాగమ
**सरिश्तेदार** - पुं० ఏదేని కార్యాలయ విభాగ అధికారి; శిరస్తదారుడు; కోర్టుల ఉ ప్రాంతీయ భాషల రికార్డులను భద్రపర అధికారి.
**सरीखा** - वि० సమానమైన; తుల్యమైన.
**सरीह** - वि० స్పష్టమైన; వ్యక్తమైన.
**सरीहन**-क्रि०वि० साफ साफ ; స్పష్టముగ
**सरूप** - वि० ఆకారముగల; రూపముగ సుందరమైన; సమానమైన; సదృశమైన
**सरूर** - पुं० కొద్దిపాటి నిషా; ఆనందము; ప్రఫుల్లత.
**सरेदस्त** - क्रि०वि० ప్రస్తుతము; ఇప్పుడ ఇప్పటికి.
**सरे बाजार** - क्रि०वि० అందరి సమక్షము బహిరంగముగ.
**सरे शाम** - स्त्री० సాయంకాలము; क्रि०वि सायంకాలము కాగానే.
**सरोंट** - पुं० दे० सिलवट.
**सरोकार** - पुं० సంబంధము.
**सरोज** - पुं० కమలము.
**सरोद** - पुं० వీణవంటి ఒక వాద్యము.
**सरोरूह** - पुं० కమలము.
**सरोसामान** - पुं० ఆవశ్యకమైన; సామగ్రి;

సామాను.

**सरौता** - पुं० వక్కలు కత్తిరించు కత్తెర; అడకత్తెర.

**सर्ग** - पुं० కావ్యములోని ఒక ప్రకరణము; అధ్యాయము; జగత్తు; సృష్టి.

**सर्जन** - पुं० వదిలిపెట్టుట; పారవేయుట; బహిర్గతము జేయుట.

**सर्द**-वि० చల్లని; సోమరియగు; మందకొడిగ; పుంసత్వములేని.

**सर्दी** - स्त्री० చలి; రొంప.

**सर्फ** - पुं० వ్యయము; ఖర్చు; వ్యాకరణము; అపవ్యయము.

**सर्फा** - पुं० వృద్ధి; మితవ్యయము.

**सर्वस** - पुं० సర్వస్వము.

**सर्राटा** - पुं० వాయుతీవ్రతవలన 'సర్రసర్ర' మను శబ్దము వచ్చుట; సర్రమని త్వరగా పారిపోవుట.

**सर्राफ** - पुं० दे० सराफ.

**सर्वकाम** - पुं० అన్ని కోరికలు గలవాడు; కోరికలన్నీ తీర్చువాడు; శివుడు.

**सर्वज्ञ** - वि० సర్వము తెలిసినవాడు; భగవంతుడు.

**सर्वत:** - अव्य० అన్నివిధవముల; అన్నివైపుల; నలువైపుల.

**सर्वत्र** - अव्य० అంతట.

**सर्वथा** - अव्य० సంపూర్ణముగా; సమస్తము; అన్ని విధముల.

**सर्वदा** - अव्य० ఎల్లప్పుడు.

**सर्वदैव** - अव्य० ఎల్లప్పుడూ

**सर्वभक्षी** - वि० అన్నీ భుజించు; पुं० అగ్ని.

**सर्वरी** - स्त्री० दे० शर्वरी.

**सर्वस्व** - पुं० సర్వస్వము.

**सर्वहारा** - पुं० సర్వము పోగొట్టుకొనిన; సర్వనాశమైన; శ్రమకవర్గము.

**सलगम ; शलगम; शलजम** - पुं० ఎర్ర ముల్లంగి.

**सलतनत** - स्त्री० సామ్రాజ్యము; ఏర్పాటు; వీలు.

**सलमा** - पुं० జలతారు.

**सलवट** - स्त्री० दे० सिलवट.

**सलवात** - स्त्री० శుభకామన; సలాము; అపశబ్దము; తిట్టు.

**सलहज** - स्त्री० सरहज ; భార్యసోదరుని భార్య.

**सलाई** - स्त्री० అగ్గిపుల్ల; ఏదేని ధాతువుతో చేయబడిన సన్నని కడ్డీ లేక పుల్ల.

**सलाक** - पुं० शलाका ; బాణము; చువ్వ.

**सलाख**-स्त्री० ఏదేని ధాతువులో చేయబడిన ఊచ; బాణము.

**सलाबत** - स्त्री० కాఠిన్యము; దారుఢ్యము;

ప్రతాపము.

**सलाम** - पुं० నమస్కారము; ప్రణామము.

**दूरसे सलाम करना** - मु० చెడుజోలికి పోకుండుట ; **सलाम लेना** - मु० ప్రతి నమస్కారము చేయుట; **सलाम देना**- मु० ప్రణమిల్లుట.

**सलाम अलैकुम** - स्त्री० నమస్కారము; ప్రణామము.

**सलामत**-वि०అన్నివిధముల విపత్తుల నుండి రక్షింపబడిన; ఆరోగ్యముగా, హాయిగా నున్న. क्रिं०वि० కుశలపూర్వకముగా; క్షేమముగా.

**सलामत रवी** - पुं० మితవ్యయము.

**सलामती** - स्त्री० రక్ష; రక్షణ; కుశల-క్షేమము.

**सलामी** - स्त्री० ప్రణామము; తుపాకుల ద్వారా సైనికుల గొప్ప అధికారికి ఇచ్చు స్వాగత ప్రణామము.

**सलाह** - स्त्री० సమ్మతి; సలహా; మంచి.

**सलिल** - पुं० జలము; నీరు.

**सलीका** - पुं० వివేకపూరితమైన రీతి; పద్ధతి; శిష్టత.

**सलीब** - स्त्री० క్రీస్తుని బలిగొన్న కంబము.

**सलीम** - वि० యోగ్యమైన; తగిన; నిర్మల హృదయుడగు; స్వస్థతగల.

**सलीस** - वि० సహజమైన; సులభమైన; నుడికారములతో కూడిన సహజమైన భాష.

**सलूक** - पुं० నడవడి; ఆచరణ; కలుపుగోరుతనము; ఉపకారము.

**सलूका** - पुं० స్త్రీలకు సంబంధించిన ఒక విధమగు ఉడుపు లేక దుస్తు.

**सलोतर** - पुं० గుఱ్ఱముల చికిత్సా శాస్త్రము.

**सलोना** - वि० సుందరమైన; అందమైన; రసవంతమైన; ఉప్పు కలిసిన.

**सलोनी** - स्त्री० సుందరి.

**सवाँग** - पुं० दे० स्वाँग.

**सवा** - वि० ఒకటింబాతిక. 1 1/4

**सवाई** - स्त्री० అసలునుండి నాల్గవ వంతు ముందుగానే మినహాయించి ఇచ్చు ఒక ఋణ పద్ధతి.

**सवाब** - पुं० పుణ్యము; పుణ్యకృత్యమునకు స్వర్గములో లభించు ప్రతి ఫలము.

**सवाया** - वि० दे० सवा.

**सवार** - पुं० అశ్వారోహి; గుఱ్ఱపు రౌతు; वि० అధిష్టించిన; ఎక్కిన.

**सवारी** - स्त्री० ఆరోహణము; వాహనము; ఊరేగింపు.

**सवाल** - पुं० ప్రశ్న.

**सवालजवाब** - पुं० చర్చ; వాదవివాదము; వితండ వాదము.

**सविता** - पुं० సూర్యుడు; జిల్లేడు.
**सवेरा** - पुं० सबेरा ; ప్రాతఃకాలము.
**ससक; ससा** - पुं० కుందేలు.
**ससिधर ; ससिहर** - पुं० మహాదేవుడు-శివుడు.
**ससुरा** - पुं० श्वसुर ; భార్య తండ్రి ; ఒక విధమగు తిట్టు.
**ससुराल** - स्त्री० భార్యా తండ్రి ఇల్లు - మామ గారిల్లు.
**सस्ता** - वि० చౌకయైన; తుచ్ఛమైన; సాధారణ మైన.
**सस्ती** - स्त्री० చౌక.
**सस्मित** - वि० చిరునగవుగల.
**सस्य** - पुं० ధాన్యము.
**सहँगा** - वि० सस्ता ; చౌకయగు.
**सह** - अव्य० సహితమైన; సమేతము; తో ; కూడ ; वि० సమర్థమైన.
**सहकार** - पुं० మామిడిచెట్టు; సహాయ కుడు.
**सहकारता ; सहकारिता**-स्त्री० సహాయత; సహకారము.
**सहचर** - पुं० సహచరుడు; స్నేహితుడు; సేవకుడు.
**सहचरी** - स्त्री० సఖి; భార్య; పత్ని.
**सहचारी** - पु० दे० सहचर.
**सहज** - पुं० సయానా సోదరుడు; స్వభావము; సహజమైన; సాధారణమైన.
**सहन** - पुं० సహనము; క్షమ; पुं० వాకిలి; ముంగలి ; నడవ.
**सहनक** - स्त्री० చిన్నవాకిలి ; చిన్న పళ్ళెరము.
**सहनशील** - वि० సహించువాడు; అనుభ వించువాడు.
**सहना** - स०क्रि० సహించుట; ఫలితము అనుభవించుట; భారము అనుభవించు వాడు.
**सहम** - पुं० భయము; భీతి; సంకోచము.
**सहमत** - वि० ఏకగ్రీవమైన; ఒకే అభిప్రాయము గల.
**सहमना** - अ०क्रि० భయపడుట; భీతి నొందుట.
**सहर** - स्त्री० ప్రాతఃకాలము ; తెల్లవారు ఝాము.
**सहरगही** - स्त्री० ఆరోజంతా నిర్జల ఉపవాస ముండువారు చేయు ప్రాతఃకాల భోజ నము ( రంజాన్ సందర్భమున మహమ్మ దీయులు).
**सहरा** - पुं० అడవి; ఖాళీమైదానము.
**सहरी** - स्त्री० ఒక విధమగు చాప.
**सहल** - वि० సరళమైన; సుబోధమైన; సహజమైన.

**सहल-अंगार** - वि० సోమరియగు.

**सहलाना** - स०क्रि० మెల్లిగా చేతితో నిమురుట; వత్తుట; చక్కిలిగింతపెట్టుట.

**सहसा** - अव्य० అకస్మాత్తుగా; తటాలున.

**सहस्र** - वि० వెయ్యి; '1000' సంఖ్య.

**सहस्रलोचन** - पुं० ఇంద్రుడు.

**सहानुभूति** - स्त्री० సానుభూతి; ఇతరుల దుఃఖము చూచి తను కూడ దుఃఖించుట.

**सहाब** - पुं० సహాయత; సహకారము; సహాయకుడు.

**सहाब** - पुं० మేఘము; మబ్బు.

**सहारा** - पुं० సహాయత; ఆధారము; ఆశ్రయము.

**सहिजन** - पुं० మునగచెట్టు లేక కాయ.

**सहिदानी** - स्त्री० గుర్తుపట్టుట; గుర్తు.

**सहिष्णु** - वि० సహించు; సహనశీలుడు.

**सहिष्णुता** - स्त्री० సహనము; సహనశీలత.

**सही** - वि० సరియైన; ప్రామాణికమైన; యధార్థమైన; చేవ్రాలు; దస్తకతు.

**सही भरना** - मु० అంగీకరించుట.

**सही सलामत** - वि० సురక్షితముగా; ఆరోగ్యముగ.

**सहूलियत** - स्त्री० సారల్యము; సువిధ; సుబోధత.

**सहेजना** - स०क्रि० సరిగా నచ్చజెప్పి అప్పగించుట; నిర్వహించుట.

**सहेट ; सहेत** - पुं० సంకేత స్థలము; ప్రేమికులు కలియు నిర్దిష్ట ప్రదేశము.

**सहेली** - स्त्री० సఖి; సంగిని లేక దాసి.

**सह्य** - वि० సహించదగిన.

**साँई** - पुं० స్వామి; యజమాని; పరమేశ్వరుడు.

**साँकर** - स्त्री० గొలుసు; శృంఖల; वि० సంకీర్ణమైన; पुं० సంకటము.

**साँग** - स्त्री० విసిరి గాయపరచుటకు ఉపకరించు బల్లెము. वि० సంపూర్ణమైన.

**सांगोपांग** - अव्य० శాఖప్రశాఖల సహితముగా.

**सांघातिक** - वि० పోగుచేయువాడు; वि० ప్రాణములను ఇరకాటములో పెట్టువాడు.

**साँच** - वि० నిజమైన; సరియైన.

**साँचला** - वि० యధార్థమైన; సత్యవాది.

**साँचा** - पुं० మూస.

**साँचे में ढला होना** - मु० అంగ ప్రత్యంగములు అందముగా నుండుట; మనోహరముగానుండుట.

**साँझ** - स्त्री० शाम ; సాయంకాలము.

**साँट** - स्त्री० బెత్తము; కొరడా; కొరడా దెబ్బల

వాతలు.

**साँठ** - पुं० చెరుకు.

**साँठ गाँठ** - यौ० స్నేహము; కుట్ర.

**साँठना** - स०क्रि० పట్టుకొనియుండుట.

**साँठी** - स्त्री० పెట్టుబడి (ధనము).

**साँड** - पुं० ఆబోతు.

**साँडनी** - स्त्री० ऊँटनी ; ఆడఒంటె.

**साँडिया** - पुं० ఒక విధమగు వేగముతో నడచు ఒంటె; ఒంటె మీద ఎక్కి ప్రయాణించు వాడు.

**सांत्वना** - स्त्री० तसल्ली ; ఓదార్పు.

**साँधना** - स०क्रि० సంధానించుట; గురిపెట్టుట.

**साँध्य** - वि० సాయంత్రమునకు సంబంధించిన

**साँप** - पुं० పాము ; **साँप सूँघा जाना** - मु० భయముతో కొయ్యబారిపోవుట.

**साँप छछूँदर की गति या दशा** - मु० గొప్ప సందిగ్ధావస్థలో చిక్కుకొనుట.

**साँपत्तिक** - वि० విత్త సంబంధమైన; ఆర్థికమైన.

**साँपिन** - स्त्री० ఆడపాము.

**साँप्रत** -अव्य० ఇప్పుడే; ఈ సమయముననే.

**सांप्रतिक** - वि० తాత్కాలికమైన.

**साँवर ; साँवला** - वि० శ్యామల వర్ణముగల.

**साँस** - स्त्री० శ్వాస ; **साँस उखडना** - मु० శ్వాస ఆగిపోవుట; చనిపోవుట ; **साँस रहते** - मु० బ్రతికివుండగా.

**गहरी ठंढी या लंबी साँस लेना** - मु० నిట్టూర్పులు వదలుట.

**साँसत** - स्त्री० శ్వాసాడక ఉక్కిరిబిక్కిరియగుట; జంజాటము.

**साँसना**-स०क्रि० శాసించుట; దండించుట.

**साँसा** - पुं० శ్వాస; సంశయము; భయము.

**सांसारिक** - वि० లౌకికమైన; ఇహలోక సంబంధమైన.

**सा** - अव्य० సమానముగా; తుల్యమైన; తూకమును సూచించు; శబ్దము. ఉదా : **इतनासा.**

**साइत** - स्त्री० ముహూర్తము; లగ్నము.

**साईं** - पुं० స్వామి; యజమాని; పరమేశ్వరుడు.

**साई** - स्त्री० బయానా; అడ్వాన్సు.

**साईस** - पुं० గుఱ్ఱముల చాకిరీ చేయు నౌకరు.

**साईसी** - स्त्री० గుఱ్ఱముల చాకిరి.

**साकचेरी** - स्त्री० గోరింటాకు.

**साका** - पुं० ఖ్యాతి; కీర్తి.

**साकार** - वि० స్వరూపముగల; స్థూలమైన.

**साकिन** - वि० నివసించు; నివాసి.

**साकी** - पुं० మద్యము ఇచ్చువాడు; ప్రియుని

కొరకు లేక ప్రియురాలి కొరకు వాడబడు శబ్దము.

**साख**-पुं॰సాక్షి; स्त्री॰సాక్ష్యము; ప్రమాణము. पुं॰ శాలీనత; గొప్పదనము; మర్యాద; ఇచ్చు-పుచ్చుకోవడాలలో నిజాయితి.

**साखू** - पुं॰ శాలవృక్షము; ఒక విధమగు కలప వృక్షము.

**साग** - पुं॰ శాకము; వండిన కూర.

**सागर** - पुं॰ మద్యపాత్ర.

**सागर** - पुं॰ సముద్రము.

**सागू** - पुं॰ తాడి జాతికి సంబంధించిన సాగు అనబడు చెట్టు.

**सागूदाना** - पुं॰ 'సాగు' అనబడు చెట్టు మొదలనుంచి వచ్చు గుజ్జుతో తయారైన సగ్గుబియ్యము.

**साज** - पुं॰ అలంకరణ; ఆడంబరము.

**साजन** - पुं॰ ప్రియుడు; భర్త; వల్లభుడు.

**साजसामान** - पुं॰ సామగ్రి; సామాను; ఆడంబర సామానులు.

**साजिश** - पुं॰ షడ్యంత్రము; కుట్ర; సంయోగము.

**साझा** - पुं॰ వాటా; భాగము.

**साझी** - पुं॰ వాటాదారుడు; భాగస్థుడు.

**साटक** - पुं॰ ఊక; తప్పుతాలుగల బూరగ; పనికిమాలిన వస్తువు.

**साटना** - स॰क्रि॰ दे॰ सटाना.

**साटिका** - स्त्री॰ साडी ; చీర.

**साठनाठ** - वि॰ దరిద్రమైన; పేద; చెల్లాచదరైన; నీరసమైన.

**साठा** - पुं॰ చెరుకు; ఒక విధమైన ధాన్యము.

**साडी** - स्त्री॰ చీర.

**साढू** - पुं॰ భార్య సోదరి భర్త; షడ్డకుడు.

**साढे** - अव्य॰ పూర్ణాంకముతో కూడిన అరను సూచించు ఒక అవ్యయము. ఉదా : **साढे तीन** ; మూడున్నర.

**साढे बाईस** - मु॰ తుచ్ఛమైన; వ్యర్థమైన.

**सात** - वि॰ ఏడు; '7' సంఖ్య.

**सात पाँच** - मु॰ తుంటరితనము; దగా.

**सातफेरी** - स्त्री॰ సప్తపది.

**साथ** - पुं॰ సాంగత్యము; స్నేహము; ఘనిష్టత; अव्य॰ సహితము; తో; వెంట.

**साथ देना** - मु॰ సహకరించుట.

**साथ ही** - मु॰ అతిరిక్తమైన.

**साथही साथ** - मु॰ ఒక క్రమములో; **एक साथ**-मु॰ ఒకే పర్యాయము; వెంట వెంట.

**साथरा** - पुं॰ పక్క (బిస్తరు) చాప.

**साथी** - पुं॰ సహచరుడు; స్నేహితుడు.

**सादगी** - स्त्री॰ నిరాడంబరత; సారల్యము.

**सादा** - वि॰ నిరాడంబరమైన చేత; కల్తీలేని;

निజాయితీ గల; మూర్ఖుడు.
**सादगी** - स्त्री० నిరాడంబరత; సారల్యము.
**सादापन** - पुं० दे० सादगी.
**सादिक** - वि० నిజమైన; సత్యనిష్ఠతగల; తగినటువంటి.
**सादिर** - वि० బహిర్గతమగు; అమలు అగు.
**सादी** - पुं० వేటగాడు; గుఱ్ఱము; स्त्री० ఒక విధమగు చిన్న పిట్ట; పిండికలవని పూరి.
**साध** - स्त्री० అభిలాష; కామన; पुं० సాధువు; యోగి.
**साधना** - स्त्री० సాధించు ప్రయత్నము; సిద్ధి; సిద్ధికొరకు దేవోపాసన; स्त्री० సాధించుటకు ప్రయత్నించుట; లక్ష్యపెట్టుట.
**साधु** - पुं० కులీనుడు; సజ్జనుడు; మహాత్ముడు; वि० ఉత్తమమైన.
**साधु साधु कहना** - मु० మంచి పని చేసిన వానిని పొగడుట.
**साधुवाद** - पुं० మంచి పనిని పొగడుట.
**साध्य** - वि० సాధించదగిన; पुं० లక్ష్యము; సామర్థ్యము.
**साध्वी** - स्त्री० పతివ్రత.
**सान** - पुं० సానరాయి.
**सान देना या धरना** - मु० పదునుపెట్టుట.
**सानना** - स०क्रि० పిండిమొ॥ వానిని నీళ్ళతో కలిపి సాగతీసి మిళితము చేయుట.
**सानी** - स्त्री० నీళ్ళతో బాగుగా కలిపి పశు ప్రలకు పెట్టు మేత; वि० సాటియైన; తుల్యమైన; **लासानी** - यौ० वि० అద్వితీయమైన.
**सानु**-पुं० పర్వత శిఖరము; కొన; పండితుడు.
**साप्ताहिक**-वि० వారము దినములకు సంబంధించిన; వారమునకు ఒక పర్యాయము జరుగునది.
**साफ** - वि० శుభ్రమైన; స్వచ్ఛమైన.
**साफ करना** - मु० చంపివేయుట; వినష్టపరచుట.
**साफगो** - पुं० స్పష్టవాది; స్పష్టముగా మాట్లాడువాడు.
**साफगोई** - स्त्री० స్పష్టోక్తి.
**साफल्य** - पुं० दे० सफलता.
**साफा** - पुं० पगडी ; తలపాగా; నిత్యము ధరించు బట్టలను సబ్బుపెట్టి బాగుగా శుభ్రపరచుట.
**साफी** - स्त्री० రుమాలు; చేతి రుమాలు.
**साबिक** - वि० వెనకటి వలె.
**साबिक दस्तू** - यौ० వెనక ఉన్నట్లుగానే; పూర్వమువలె.
**साबिका** - पुं० సంబంధము; కలయిక. वि० పూర్వమువలె.
**साबित** - वि० సరియగు; ఋజువు చేయ

బడిన; ప్రామాణికమైన.

**साबुत** - वि० సరియైన; సంపూర్ణమైన; ప్రమాణము గల.

**साबुन ; साबून** - पुं० సబ్బు.

**साबूदाना** - पुं० दे० सागूदाना.

**साभार** - क्रि०वि० కృతజ్ఞతాపూర్వకముగా; वि०భారయుక్తమైన.

**सामंजस्य** - पुं० ఔచిత్యము; ఉపయుక్తత.

**सामंत** - पुं० వీరుడు; యుద్ధవీరుడు; సామంతరాజు.

**सामना** - पुं० ఎదుటకు వచ్చుట; కలయిక; నిరోధము.

**सामने होना** - मु० పరదానుంచి బయటికి వచ్చుట (స్త్రీ).

**सामना करना** - मु० ఎదిరించుట.

**सामने** - क्रि०वि० సమక్షమున; ఎదుట.

**सामयिक** - वि० సమయానుసారము; విశిష్ట సమయమునకు సంబంధించిన.

**सामरिक** - वि० యుద్ధ సంబంధమైన.

**सामर्थी** - पुं० సమర్థుడు; పరాక్రమశాలి.

**सामर्थ्य** - स्त्री० సామర్థ్యము; శక్తి.

**सामा** - पुं० శ్రోత; వినువాడు.

**सामाजिक** - वि० సమాజమునకు సంబంధించిన.

**सामान** - पुं० సామాను; సామానులు; సామగ్రి.

**सामान्य** - वि० సాధారణమైన; पुं० సమానత.

**साम्य** - पुं० సమానత; పోలిక.

**साम्यवाद**-पुं० సమాజములో ఉన్న వారంతా సమానముగా ఉండాలని చెప్పు ఒక వాదము లేక సిద్ధాంతము.

**सायं** - वि० సంధ్యాకాలమునకు సంబంధించిన; సాయంత్రము.

**सायक** - पुं० బాణము; ఖడ్గము.

**सायबान** - पुं० వరండా.

**सायर** - वि० సంపూర్ణము; యావత్తు; శేషించిన; पुं० షికారు చేయువాడు; తిరుగుబోతు; నగరములోనికి వచ్చు వస్తువుల మీద వసూలు చేయు సుంకము.

**सायल** - पुं० ప్రశ్నించువాడు; బిచ్చగాడు; ప్రార్థించువాడు.

**साया** - पुं० ఛాయ ; నీడ.

**साये में रहना** -मु० ఆశ్రయములోనుండుట; శరణుజొచ్చుట.

**सायास** - क्रि०वि० యత్నపూర్వకముగా; కష్టించి.

**सायुज्य** - पुं० తాదాత్మ్యము; తాదాత్మ్య సంబంధము.

**सारंग** - पुं० లేడి; కోకిల; చాతకపక్షి; శంఖము; కమలము.

**सारंगपाणि** - पुं० విష్ణువు.

**सारंगिया** - पुं० సారంగి వాద్యమును వాయించువాడు.

**सारंगी** - स्त्री० ఒక విధమగు తంత్రీ వాద్యము.

**सारखा** - वि० दे० सरीखा.

**सारगर्भित** - वि० సారయుక్తమైన.

**सारथी** - पुं० రథమును నడుపువాడు; సూతుడు; సముద్రము.

**सारथ्य** - पुं० రథాదిక చోదనము.

**सारदा** - स्त्री० दे० शारदा.

**सारना** - स०क्रि० పూరించుట; పూర్తిచేయుట; ముగించుట.

**सारभूत** - वि० సారస్వరూపము; సర్వోత్తమైన.

**सारवत्ता**-स्त्री०సంగ్రాహిత; సంగ్రహణము.

**सारस** - पुं० హంస; కమలము; చంద్రుడు.

**सारसुता** - स्त्री० యమునానది.

**सारा** - वि० యావత్తు; సమస్తము.

**सारिका** - स्त्री० मैना ; గోరువంక.

**सार्वभौम** - पुं० చక్రవర్తి; ఏనుగు; वि० సమస్త జగత్తుకు సంబంధించిన.

**साल** - पुं० సంవత్సరము; మూలము; ఒక వృక్షము; ముల్లు ; కంటకము; स्त्री० బెజ్జము; బాధ; తీపు.

**सालक** - वि० పీడించు; బాధించు.

**सालगिरह** - स्त्री० జన్మదినము.

**सालग्रामी** - स्त्री० గండకనది - గంగానది ఉపనది.

**सालन** - पुं० మసాలా పెట్టిన కూర.

**सालना** - अ०क्रि० బాధపెట్టుట; తీపు పెట్టుట; బాధించుట; గుచ్చుట.

**साला** - पुं० శ్యాలకుడు; భార్య సోదరుడు - బావమరిది.

**सालाना** - वि० సంవత్సరాది; ఏటా; ప్రతి ఏడు.

**सालार** - पुं० మార్గదర్శకుడు; ముఖ్యమైన నాయకుడు.

**सालार जंग** - पुं० సైన్యాధిపతి; భార్య సోదరుడు - బావమరిది.

**सालिक** - पुं० యాత్రికుడు; బాటసారి; ధర్మము; నీతిని నిష్ఠా పూర్వముగా పాటించువాడు.

**सालिम** - वि० సమస్తము; సంపూర్ణము.

**सालियाना** - वि० दे० सालाना.

**सालिसी** - स्त्री० పంచాయతి.

**साली** - स्त्री० భార్యసోదరి - మరదలు లేక వదిన.

**साले हाल** - पुं० గడుస్తున్న సంవత్సరము; ప్రచలితమైన సంవత్సరము.

**सावकाश** - पुं० తీరిక; అదను.

**सावधान** - वि० జాగ్రత్తగల; స్పృహలోనున్న.

**सावन** - पुं० శ్రావణమాసము.

**सावनी** - स्त्री० శ్రావణపూర్ణిమ; రక్షా బంధన పండుగ; శ్రావణ పట్టీ; శ్రావణ మాసమునకు సంబంధించిన.

**सास** - स्त्री० భర్త తల్లి లేక భార్య తల్లి - అత్తగారు.

**सासा** - स्त्री० సంశయము; సందేహము.

**सासुर** - पुं० మామగారు; మామగారిల్లు.

**साह** - पुं० సాధువు; సజ్జనుడు; సాహుకారు.

**साहचर्य** - पुं० సాంగత్యము.

**साहनी** - स्त्री० సైన్యము; సహచరుడు; స్నేహితుడు; పరిషత్తు.

**साहब** - पुं० స్వామి; యజమాని; అధికారి; పరమేశ్వరుడు; ఒకగౌరవ సూచకమైన శబ్దము.

**साहबजादा**-पुं० సత్పురుషుని కుమారుడు; పెద్ద మనిషి కొడుకు.

**साहब-सलामत**-स्त्री० ఒండొరులు నమస్కరించుకొనుట; నమస్కారము.

**साहबान** - पुं० साहब का बहु० యజమానులు.

**साहिब** - पुं० दे० साहब.

**साहा** - पुं० వివాహాది శుభకార్యముల నిమిత్తము నిశ్చితమైన శుభ ముహూర్తము.

**साहबी** - स्त्री० స్వామిత్వము; యజమాన్యము; గొప్పదనము; అహంకారము.

**साहिर** - पुं० గారడీ మనిషి.

**साहिल** - पुं० నది లేక సముద్రపు ఒడ్డు; తటము.

**साही** - स्त्री० ముళ్ళపంది.

**साहु** - पुं० సజ్జనుడు; సాహుకారు.

**साहूकारा** - पुं० రూపాయల లావాదేవీలు; వడ్డీ వ్యాపారము.

**सिंगा** - पुं० కొమ్ము వాద్యము.

**सिंगार** - पुं० సింగారము; అలంకరణ.

**सिंगारहाट** - स्त्री० వేశ్యలవీధి.

**सिंगारहार** - पुं० పారిజాత పుష్పము లేక హారము.

**सिंगिया** - पुं० ఒక విధమైన విషము.

**सिंगी** - पुं० కొమ్ము వాద్యము.

**सिंघाडा** - पुं० ఒక విధమగు నీటి మొక్క- ఫలము.

**सिंघासन** - पुं० दे० सिंहासन.

**सिंघेला** - पुं० సింహపు పిల్ల.

**सिंचन** - पुं० నీరు చల్లబడుట; నీటితో తడుపబడుట.

**सिंचाई** - स्त्री० తడుపు; తడుపుపని; తడుపు పన్ను లేక కూలి.

**सिंचित** - वि० తడపబడిన; తడిసిన.

**सिंजित** - स्त्री० ధ్వని; గజ్జలమోత; గజ్జలు.
**सिंदूर** - पुं० కుంకుమ; సౌభాగ్యము.
**सिंदूर पोंछना ; मिटना** - मु० వైధవ్యము కలుగుట; విధవరాలగుట.
**सिंदूर दान** - पुं० పెళ్ళిలో వరుడు వధువు పాపిటలో కుంకుమ అద్దుట; కుంకుమ భరిణ.
**सिंधुर** - पुं० ఏనుగు.
**सिंधुविष** - पुं० హలాహలము - మహా ప్రమాదమైన విషము.
**सिंहनी** - स्त्री० ఆడసింహము - సివంగి.
**सिंहावलोकन** - पुं० పర్యావలోకనము; బాగుగా, సూక్ష్మముగా, తిలకించుట.
**सिंहिनी ; सिंही** - स्त्री० दे० सिंहनी.
**सिआर** - पुं० శృగాలము; నక్క.
**सिकटा** - पुं० కుండపెంకు.
**सिकडी** - स्त्री० తలుపుగొళ్ళెము; ఒక విధమగు కంఠహారము; వడ్డాణము.
**सिकता** - स्त्री० बालू ; ఇసుక.
**सिकलीगर** - पुं० ఆయుధములకు పదును పెట్టువాడు.
**सिकहर** - पुं० छींका ; ఉట్టి; కావడిమట్టు.
**सिकुडन** - पुं० సంకోచము; ముడత.
**सिकुडना** - अ०क्रि० ముడుచుకొనుట; ముడతపడుట.
**सिकोडना** - स०क्रि० ముడుచుట; ఒకచోటుకి పోగుచేయుట.
**सिक्का** - पुं० ముద్ర; నాణెము; పతకము; మెడలు.
**सिक्का बैठना या जमना या चलना** - मु० అధికారము చలాయించుట; ప్రభుత్వము స్థాపించుట; పలుకుబడిసాగుట.
**सिखरन** - पुं० పెరుగు కలసిన పానీయము.
**सिखाना** - स०क्रि० చదువు చెప్పుట; ఉపదేశించుట.
**सिखाना पढाना** - यौ० తుంటరితనము నేర్పుట.
**सिगरा** - वि० సమగ్రమున; సంపూర్ణముగా; యావత్తు.
**सिचान** - पुं० డేగ.
**सिजदा** - पुं० వినయము; ప్రణామము.
**सिटकिनी** - स्त्री० తలుపు గొళ్ళెము.
**सिटपिटाना** - अव्य० అత్యంత భయము వలనగాబరాపడుట; భయపడుట; ముడుచుకు పోవుట.
**सिट्टी पिट्टी गुम होना ; सिट्टी भूलना** - मु० భయమువలన స్పృహ తప్పుట; నివ్వెరపోవుట.
**सिट्टी** - स्त्री० పెద్ద పెద్ద మాటలు మాట్లాడుట; వాక్పటుత.

**सिड** - स्त्री० पागलपन ; వెర్రి; పిచ్చి.
**सित** - वि० తెల్లని; స్వచ్ఛమైన.
**सितकंठ** - पुं० మహాదేవుడు; శంకరుడు.
**सितकर** - पुं० చంద్రుడు.
**सितम** - पुं० అనర్థము; అన్యాయము; అత్యాచారము.
**सितमगर** - वि० అన్యాయముగా ప్రవర్తించువాడు; అత్యాచారి.
**सिता** - स्त्री० చక్కెర; పంచదార; మద్యము.
**सिताखंड** - पुं० పటిక బెల్లము.
**सिताब** - क्रि०वि० వెంటనే.
**सितार** - पुं० వీణవంటి వాద్యము.
**सितारा** - पुं० నక్షత్రము; అదృష్టము; ప్రారబ్ధము; చమకీ.
**सितारा चमकना** -मु० భాగ్యోదయమగుట; అదృష్టము అనుకూలమగుట.
**सितारिया** - पुं० సితారవాద్యము వాయించువాడు.
**सितासित** - पुं० నలుపు తెలుపుల వన్నె; శ్వేతశ్యామల వన్నె.
**सिद्दीक** - वि० పరమ సత్యనిష్ఠుడు; సత్యసంధుడు.
**सिद्धहस्त** - वि० నిపుణుడు; ప్రవీణుడు.
**सिद्धार्थ** - वि० పూర్ణకాముడు; కోరికలు తీరినవాడు; पुं० గౌతమ బుద్ధుడు.
**सिद्धि** - स्त्री० సాఫల్యము; ప్రయోజనము సిద్ధించుట; ఋజువగుట.
**सिधाई**-पुं० అమాయకత్వము; సరళత్వము.
**सिधाना ; सिधारना** - अ०क्रि० వెళ్ళిపోవుట; చనిపోవుట.
**सिन** - पुं० उमर ; వయస్సు.
**सिनक** - स्त्री० रेंट ; చీమిడి.
**सिनकना**-अ०क्रि० గట్టిగా శ్వాసను బయటికి వదలి చీదుట.
**सिपर** - स्त्री० ढाल ; డాలు.
**सिपहगिरी** - स्त्री० సిపాయి పని; యుద్ధ కార్యము.
**सिपहसालार** - पुं० సైన్యాధిపతి.
**सिपारस** - स्त्री० दे० सिफारिश.
**सिपास** - स्त्री० కృతజ్ఞత; పొగడ్త.
**सिपाह**-स्त्री० फौज ; సైన్యము; पुं० సిపాయి.
**सिपाहियाना** - वि० సిపాయిలవలె.
**सिपाही** - पुं० సిపాయి; సైనికుడు.
**सिपुर्द** - पुं० दे० सुपुर्द.
**सिप्पा** - पुं० లక్ష్యమునకు అనుగుణ్యముగా దెబ్బకొట్టుట; కార్యసాధనోపాయము; యుక్తి; ప్రారంభము.
**सिप्पा जमाना** - मु० కార్యసాధనకనుకూలముగా పరిస్థితిని తయారుచేయుట.
**सिप्र** - पुं० చంద్రుడు; చెమట.

**सिप्रा** - स्त्री॰ గేది; ఉజ్జయిని సమీపమున ఉన్న ఒక నది.

**सिफ्त** - स्त्री॰ విశేషత; లక్షణము; గుణము; స్వభావము.

**सिफर** - पुं॰ సున్న; శూన్యము.

**सिफला** - वि॰ నీచమైన; తుచ్ఛమైన; హేయమైన.

**सिफली** - वि॰ నాసికరపు.

**सिफात**-स्त्री॰ सिफत का बहु॰ విశేషతలు; లక్షణములు; స్వభావముల సమూహము.

**सिफारिश** - स्त्री॰ సంస్తుతి; సిఫారసు.

**सिफारिशी** - वि॰ సిఫారిసుగల; సిఫారసు చేయబడిన.

**सिफ़ारिशी टट्टू** - पुं॰ కేవలము సిఫారిసు ద్వారా పదవికి చేరుకున్నవాడు.

**सिफ्ल** - वि॰ లావైన; చిక్కని; బలమైన.

**सिबिका** - स्त्री॰ दे॰ शिबिका.

**सिमटना** - अ॰क्रि॰ ముడుచుకొనుట; సంకుచితమగుట; ముడత పడుట.

**सिमिटना** - अ॰क्रि॰ दे॰ सिमटना.

**सियह** - वि॰ दे॰ सियाह.

**सियादत** - स्त्री॰ నేతృత్వము; మార్గదర్శకత్వము; నాయకత్వము.

**सियापा** - पुं॰ స్త్రీల పరామర్శ శోకము; చనిపోయిన వాని వద్ద స్త్రీలు గుమిగూడి ఏడ్చుట.

**सियार** - पुं॰ गीदड ; నక్క.

**सियाल** - पुं॰ दे॰ सियार.

**सियाला** - पुं॰ శీతాకాలము; చలికాలము.

**सियासत** - स्त्री॰ దేశరక్షణ వ్యవస్థ; శాసన వ్యవస్థ; రాజకీయ వ్యవస్థ.

**सियासी** - वि॰ రాజకీయ వ్యవస్థకు సంబంధించిన.

**सियाह** - वि॰ నల్లని; అశుభమైన.

**सियाहा** - पुं॰ ఆదాయ వ్యయములు వ్రాయు పుస్తకము పన్ను వసూళ్ళు వ్రాయబడు ప్రభుత్వ రిజిష్టరు.

**सियाही** - स्त्री॰ दे॰ स्याही.

**सिर** - पुं॰ తల; శిరస్సు; కొన; శిఖరము; वि॰ శ్రేష్ఠమైన.

**सिर आँखों पर होना** - मु॰ సంతోషముగా స్వీకరింపబడుట.

**सिर आँखों पर बैटाना** - मु॰ దండిగా ఆదర సత్కారములు చేయుట.

**सिर पर आना** - मु॰ ఆవేశపడుట.

**सिर उठाना** - मु॰ ఎదిరించుట ; విరోధించుట.

**सिर ऊँचा करना** - मु॰ అభిమానముతో నిలబడుట.

**सिर करना** - पुं० (స్త్రీలు) తల దువ్వుకొనుట; కేశాలంకరణ చేసుకొనుట.

**सिर खाली करना** - मु० ప్రలాపించుట; ఎక్కువగా ఆలోచించి కలతజెందుట.

**सिर खाना या चाटना** - मु० పనికిమాలిన ప్రసంగములతో విసిగించుట.

**सिर खपाना** - मु० ఆలోచనలతో వేసారి పోవుట.

**सिर चढाना** - मु० కళ్ళకద్దుకొనుట; అలుసు ఇచ్చుట.

**सिर घूमना या सिर चकारना** - मु० తల దిమ్మెక్కుట; కళ్ళుతిరుగుట.

**सिर झुकाना** - मु० వినయముగా నమస్కరించుట.

**सिर देना** - मु० ప్రాణముల అర్పించుట.

**सिर धुनना** - मु० పశ్చాత్తాపమునొందుట; నెత్తిబాదుకొనుట.

**सिर नीचा करना** - मु० సిగ్గుతో తలవంచుకొనుట; అవమానముతో తలవంచుకొనుట.

**सिर पटकना** -मु० అమితముగా శ్రమించుట; నెత్తిమోదుకొనుట; పశ్చాత్తాపపడుట.

**सिर पर पडना** - मु० నెత్తినపడుట; భారము వహించవలసి వచ్చుట.

**सिर पर खून चढना या सावार होना** - मु० ప్రాణములు తీయుటకు సిద్ధపడుట.

**सिर पर होना** - मु० కొద్దికాలమే మిగిలి యుండుట.

**सिर फिरना** - मु० తలతిరుగుట; గీర ఎక్కుట; పిచ్చెక్కుట.

**सिर मारना** - मु० నచ్చజెప్పి, నచ్చజెప్పి విసిగి వేసారి పోవుట.

**सिर मुडातेही ओले पडना** - मु० కార్యారంభములోనే విఘ్నము సంభవించుట.

**सिर पर सेहरा होना ; सिर पर सेहरा बँधना** - मु० ప్రశంసలనందుకొనుట.

**सिर से पैर तक** - मु० ఆరంభమునుంచి అంతమువరకు; సంపూర్ణముగ.

**सिर पर सींग होना** - मु० ఏదేని విశిష్టత; విశిష్టగుణము కలిగియుండుట; నెత్తిన కొమ్ములొచ్చుట.

**सिर से कफन बाँधना** - मु० సంకల్ప సిద్ధి కొరకు ప్రాణత్యాగమునకు సిద్ధపడుట.

**सिर होना**-मु० వెంటపడుట; మాటిమాటికి ఏదో దానికొరకు వేధించుట; ఇబ్బంది పెట్టుట; జగడమాడుట.

**सिर होना** - मु० తెలిసికొనుట; గ్రహించుట.

**सिरका** - पुं० ఎండబెట్టి పులియబెట్టిన చెరుకు రసము.

**सिरकी** - स्त्री० ఎండ వానలనుంచి రక్షణ కొరకు, బండి, గుమ్మములకు కట్టు చీపురుపుల్లలు తడిక లేక పరదా.

**सिरजक ; सिरजनहार** - पुं० సృష్టికర్త.

**सिरताज** - पुं० శిరోమణి; కిరీటము; నాయకుడు.

**सिरनामा** - पुं० చిరునామా; శీర్షకము.

**सिरनेत** - पुं० తలపాగా.

**सिरपच्ची** - स्त्री० వాగుడు; ప్రలాపము; పనికిమాలిన ఆలోచన.

**सिरपेच** - पुं० తలపాగా; తలపాగాపై అలంకరించు తురాయి.

**सिरपोश** - पुं० శిరస్సుమీది ఆవరణము; టోపీ; కుళాయి.

**सिरमगजन** - पुं० दे० सिरपच्ची.

**सिरमौर** - पुं० శిరోమణి; కిరీటము.

**सिरस** - पुं० శిరీషము; దిరిశన చెట్టు.

**सिरहाना** - पुं० మంచమునకు తలవైపు భాగము.

**सिरा** - पुं० కొన; కొస; చివరి భాగము; అంచు.

**सिरेका** - मु० अव्वल दर्जेका ; మొదటి తరగతికి సంబంధించిన; ఒకటవ రకపు.

**सिराज** - पुं० దీపము; సూర్యుడు.

**सिराना** - अ०क्रि० చల్లపడుట; మందగించుట; హతోత్సాహపడుట; स०क्रि० చల్లార్చుట; ముగించుట; గడుపుట.

**सिरिश्ता** - पुं० విభాగము.

**सिरिश्तेदार** - पुं० दे० सरिश्तेदार.

**सिरी** - स्त्री० श्री ; లక్ష్మి; శోభ.

**सिरिश्क** - पुं० आँसू ; కన్నీరు.

**सिरोही** - पुं० రాజస్థాన్‌లోని 'సిరోహి' లో తయారగు ప్రశస్తమైన ఖడ్గము; నల్లని చిన్న పిట్ట.

**सिर्फ** - क्रि०वि० కేవలము; మాత్రము; वि० ఏక మాత్రమైన.

**सिल** - स्त्री० రాయి; గుండ్రాయి; पुं० క్షయ రోగము.

**सिलपट** - वि० శుభ్రమైన; చదరమైన; అరిగియున్న; నాశమైన.

**सिलवट** - स्त्री० ముడత.

**सिलसिला** - पुं० క్రమము; వరుస; పద్ధతి

**सिलसिलेवार** - वि० క్రమానుసారము.

**सिलह** - पुं० ఆయుధము; శస్త్రము.

**सिलहखाना** - पुं० శస్త్రాగారము.

**सिलहारा** - पुं० పొలములలో పరిగ ఏరువాడు.

**सिलहिला** - वि० జారునది; జారుడు.

**सिला** - पुं० పరిగ; स्त्री० శిల; पुं० కానుక; శుభపరిణామము.

**सिलाई** - स्त्री० కుట్టు; కుట్టుపని; కుట్టుకూలి.
**सिलाना** - स०क्रि० కుట్టించుట.
**सिलाह** - पुं० కవచము; శస్త్రము.
**सिलाही** - पुं० సైనికుడు.
**सिलीमुख** - पुं० शिलीमुख ; భ్రమరము; తుమ్మెద.
**सिलौट ; सिलौटा** - पुं० కల్వము; సన్నికలు; కల్వము రాయి.
**सिल्ला** -पुं० పరిగ.
**सिल्ली** - स्त्री० సానరాయి; పదును పెట్టు రాయి.
**सिवई** - स्त्री० పలతాలిక; సేమ్యా.
**सिवा** - अव्य० తప్ప; అంతేకాక; అతిరిక్తమైన; स्त्री० దుర్గాదేవి; మోక్ష; ఆడనక్క.
**सिवाइ** - अव्य० दे० सिवाय.
**सिवाई** - स्त्री० ఒక విధమైన మట్టి.
**सिवान** - पुं० సీమ; సరిహద్దు; పొలిమేర.
**सिवाय** - अव्य० తప్ప; వదిలి; అతిరిక్తమైన.
**सिवार ; सिवाल** - स्त्री० నీటినాచు.
**सिवाला** - पुं० दे० शिवाला.
**सिसकना** - अ०क्रि० వెక్కి-వెక్కి ఏడ్చుట; ఆరాటపడుట.
**सिसकी** - स्त्री० వెక్కి-వెక్కి ఏడుపు.
**सिहरन** - स्त्री० కంపము ; వణకు.
**सिहरना** - अ०क्रि० చలితో వణకుట.
**सिहराना** - स०क्रि० చలితో వణికించుట; భయముతో వణికించుట.
**सिहरी** - स्त्री० కంపనము; వణుకు; చలి జ్వరము; భీతి.
**सिहाना** - अ०क्रि० ఈర్ష్యపడుట; పొందవలెనని పేరాశపడుట; ఉవ్విళ్ళూరుట.
**सिहारना** - स०क्रि० వెతుకుట; అన్వేషించుట.
**सींक** - स्त्री० तिनका ; గడ్డిపోచ; సన్నని బద్ద; చువ్వ ; ముక్కుపుడక.
**सींका** - पुं० చెట్టు మండ లేక రెమ్మ.
**सींग** - पुं० విషాణము; కొమ్ము.
**सींगदाना** - पुं० दे० मूँगफली.
**सींगी** - स्त्री० శృంగవాద్యము; కొమ్ము వాద్యము.
**सींच** - स्त्री० తడుపు.
**सींचना** - स०क्रि० తడుపుట; తడుపు పెట్టుట.
**सींड** - पुं० रेंट ; చీమిడి.
**सी** - वि० (स्त्री०) సమానము; తుల్యమైన. ఉదా : लडकी पगली सी है। अपनी सी- मु० తన ఇష్టానుసారము; చీత్కారము.
**सीकर** - पुं० జలకణము; జలబిందువు.
**सीख** - स्त्री० ఉపదేశము; సలహా; ఇనప

చువ్వ.

**सीखचा** - पुं० ఇనపచువ్వ.

**सीखना** - स०क्रि० నేర్చుకొనుట.

**सीगा** - पुं० ఏదేని కార్యాలయములోని ఒక విభాగము.

**सीझना** - अ०क्रि० సెగపొంది కరుగుట; ఉడుకుట; కారుట ; కష్టము సహించుట; క్లేశము అనుభవించుట.

**सीटना**-स०क्रि० గొప్పలుచెప్పుట; బడాయి కొట్టుట.

**सीटपटाँग** - स्त्री० గర్వోక్తులు.

**सीटी** - स्त्री० ఈల.

**सीठना** - पुं० ; **सीठनी** - स्त्री० వివాహాది శుభ సందర్భములలో స్త్రీలు పాడు అపశబ్దములతో కూడిన తిట్టుపాట.

**सीठा** - वि० చప్పని; రుచిలేని.

**सीठी** - स्त्री० రసము, గుజ్జులేని పండు.

**सीढ** - स्त्री० చెమ్మ; తావు.

**सीढी** - स्त्री० निसेनी ; నిచ్చెన; మెట్టు లేక మెట్లు.

**सीतकर** - पुं० शीतकर ; చంద్రుడు.

**सीतलपाटी** - स्त्री० ఒక విధమగు శ్రేష్ఠమైన చాప.

**सीत्कार** - पुं० ఆనంద, దుఃఖ సమయము లలో వెలువడు 'सी सी' అనుమూలుగు; చీత్కారము.

**सीद** - पुं० सूदखोरी ; వడ్డీ వ్యాపారము.

**सीदना** - अ०क्रि० దుఃఖించుట.

**सीध** - स्त्री० సూటిగానున్న; పాడవు; గురి; లక్ష్యము.

**सीधा**-वि० సూటిగానున్న; సరళమైన; అమాయకమైన; ఋజు ప్రవర్తనగల; **क्रि०वि०** సమక్షమున; సులభమైన; సహజమైన.

**सीधी तरह** - मु० ఋజు ప్రవర్తన గల.

**सीधा साधा** - यौ० బోళా అయిన; సహజమైన.

**सीधा करना** - मु० దండించి సరిచేయుట.

**सीधे** - क्रि०वि० సమ్ముఖమున; తిన్నగా; సూటిగా; ఋజు ప్రవర్తనతో.

**सीना** - स०क्रि० కుట్టుట; पुं० వక్షస్థలము; రొమ్ము.

**सीनाजोर** - पुं० దుండగుడు.

**सीनाजोरी** - स्त्री० దుండగము; జబరదస్తీ.

**सीप** - पुं० ముత్యపు చిప్ప.

**सीपर** - पुं० दे० सिपर.

**सीपसुत** - पुं० ముత్యము.

**सीपा** - पुं० గట్టి చలి.

**सीपी** - स्त्री० दे० सीप.

**सीम** - स्त्री० వెండి; సంపద.

**सीमांत** - पुं० సరిహద్దు; పొలిమేర.

**सीमा** - स्त्री० సీమ; సరిహద్దు.
**सीमाब** - पुं० పాదరసము.
**सीय** - स्त्री० సీత; జానకి.
**सीर** - पुं० నాగలి; నాగలి ఎడ్లు; సూర్యుడు.
**सीरत** - स्त्री० స్వభావము; అలవాటు.
**सीरनी** - स्त्री० మిఠాయి.
**सीरा** - पुं० పంచదార పాకము; హల్వ.
**सील** - स्त्री० ఆర్ద్రత; తేమ; నెమ్ము.
**सीला** - पुं० सिल्ला ; పరిగ.
**सीवा** - स्त्री० సీమ; పరాకాష్ఠ.
**सीस** - पुं० సిరము; తల; ఫాలభాగము.
**सीसमहल** - पुं० అద్దాలమేడ.
**सीसा** - पुं० సీసము.
**सीसी** - स्त्री० दे० सीबी.
**सुँघनी** - पुं० నశ్యము; ముక్కుపొడుము.
**सुँघाना** - स०क्रि० వాసన చూపించుట.
**सुंडमुसुंड** - पुं० ఏనుగు.
**सुंडा** - स्त्री० सूंड ; ఏనుగు తొండము.
**सुंदर** - वि० మంచి రూపము గల; అందమైన.
**सुंदरता** - स्त्री० సౌందర్యము.
**सुंदरताई ; सुंदराई** - स्त्री० ; **सुंदरापा** - पुं० दे० सुंदरता.
**सुंदरी** - स्त्री० అందమైన స్త్రీ.
**सुआ** - पुं० दे० सूआ.
**सुकर** - वि० సహజమైన; సులభమైన.
**सुकरता** - स्त्री० సౌకర్యము; సౌందర్యము.
**सुकूत** - पुं० పతనమగుట; రాలిపోవుట; పద్యములో ఏదేని శబ్దము నష్టమైపోవుట.
**सुकून** - पुं० స్థిరత్వము; మానసిక శాంతి.
**सुकृत्** - वि० శుభకార్యములు చేయువాడు.
**सुकृत** - पुं० సుకృతము; పుణ్యము; సత్కర్మ.
**सुकृती** - पुं० పుణ్యాత్ముడు; ధార్మికుడు.
**सुकृत्य** - स्त्री० పుణ్యము; ధర్మకార్యము; శుభకార్యము.
**सुखंडी** - वि० పిల్లలకు సంబంధించిన ఎండు రోగము.
**सुखद** - वि० సుఖమును కలుగజేయు; ఆనందదాయకమైన.
**सुखमा** - स्त्री० సుషుమ; శోభ.
**सुखवार** - वि० సుఖముగానున్న; ఆనందముగానున్న.
**सुखसार** - पुं० మోక్షము.
**सुखाना** - स०क्रि० ఎండబెట్టుట; ఎండించుట.
**सुखाला** - वि० సుఖదాయకము; ఆనందదాయకము.
**सुखिया** - वि० సుఖము అనుభవించు.
**सुखिर** - पुं० పాము కలుగు.
**सुगत** - पुं० బుద్ధదేవుడు; బౌద్ధుడు.
**सुगति** - स्त्री० మరణోపరాంతమున కలుగు

ఉత్తమగతి; మోక్షము.

**सुगम** - वि० సుగమ్యమైన; సులభమైన.

**सुगम्य** - वि० दे० सुगम.

**सुगाना** - अ०क्रि० దుఃఖించుట; కుపిత మగుట.

**सुग्गा** - पुं० तोता ; చిలుక.

**सुघट** - वि० సుందరమైన; మంచి ఆకారము గల.

**सुघटित** -वि० బాగుగా; అందముగా నిర్మింప బడిన.

**सुघड** - वि० సుందరమైన; మంచి ఆకారము గల; నిపుణతగల.

**सुघडई** - स्त्री० అందము; సొగసు; మంచి ఆకారము; నైపుణ్యము; చాతుర్యము.

**सुघडता** - स्त्री०; **सुघडपन** - पुं० - **सुघडाई** - दे० सुघडई.

**सुघरी** - स्त्री० శుభఘడియ; శుభసమయము; वि० అందమైన.

**सुचना** - स०क्रि० సంగ్రహించుట; సంచయించుట; పోగుచేయుట.

**सुचाना** - स०क्रि० ఆలోచింపజేయుట.

**सुचारू** - वि० బహు అందమైన; సొబగైన.

**सुचि** - वि० शुचि ; పవిత్రమైన; నిశ్చింతగా నున్న; ఏకాగ్రతగల.

**सुचित** - वि० నివృత్తమైన; నిశ్చలంగానున్న; ఏకాగ్రతగల.

**सुचिर** - पुं० చిర; శాశ్వతము; పురాతనమైన

**सुजन** - पुं० సజ్జనుడు; సత్పురుషుడు; కుటుంబ సభ్యులు.

**सुजनी** - स्त्री० ఒక విధమగు పెద్ద దుప్పటి.

**सुजागर** - वि० సుదర్శనుడు; చూచుటకు మిక్కిలి అందమైన; సుశోభిల్లుచున్న.

**सुजान** - वि० తెలివైన ; చాతుర్యము గల; ప్రావీణ్యము గల; पुं० ప్రియుడు; భర్త.

**सुजानी** -वि० పాండిత్యము గల; జ్ఞానముగల.

**सुजोर** - वि० దృఢమైన.

**सुज्ञ** - वि० విద్వాంసుడు; బాగుగా తెలిసిన వాడు.

**सझाना** - स०क्रि० సూచించుట; ఇతరుల ధ్యాసలోనికి తెచ్చుట.

**सुझाव** - पुं० సూచన; సమ్మతి.

**सुठार** - वि० दे० सुडौल.

**सुठि** - वि० సుందరమైన; సొబగుగల.

**सुडौल** - वि० సుందరమైన; ఆకారము కలిగిన; అందమైన.

**सुढंग** - पुं० మంచితీరు; పద్ధతి.

**सुढर** - वि० సంతోషించిన; దయగల; జాలిగల; అందమైన ఆకారము గల.

**सुत** - पुं० పుత్రుడు; కుమారుడు.

**सुतनु** - वि० సొగసైన శరీరముగల;

स्त्री० సుందరాంగి; సుకోమలి.
**सुतरां** - अव्य० కనుక; ఇందువలన.
**सुतरी** - स्त्री० दे० सुतली.
**सुता** - स्त्री० పుత్రిక; కుమార్తె.
**सुतार** - पुं० వడ్రంగి; శిల్పకారుడు; वि० ఉత్తమమైన.
**सुतिन** - स्त्री० అందమైన స్త్రీ.
**सुती** - वि० పుత్ర సంతానము గలవాడు.
**सुथनी** - स्त्री० స్త్రీలు ధరించు ఒక విధమగు వదులైన పయిజామా.
**सुथरा** - वि० స్వచ్ఛమైన; శుభ్రమైన.
**सुथराई** - स्त्री० నిర్మలత; స్వచ్ఛత.
**सुदंती** - वि० మంచి దంతములు లేక పల్లు వరుసగల స్త్రీ.
**सुदि** - स्त्री० दे० सुदी.
**सुदी** - स्त्री० శుక్లపక్షము.
**सुदूर** - वि० మిక్కిలి దూరమున నున్న.
**सुदेस** - वि० అందమైన; సొబగైన.
**सुदेह** - वि० మనోహరమైన; కమనీయమైన.
**सुध** - स्त्री० స్మృతి; స్మరణశక్తి; జ్ఞప్తి; స్పృహ.
**सुध दिलाना** - मु० జ్ఞాపకము చేయుట.
**सुध न रहना** - मु० జ్ఞాపకము లేకపోవుట.
**सुध बिसरना ; बिसारना** - मु० ఎవరినైనా; దేనినైనా మరచిపోవుట.
**सुध-बुध** - स्त्री० స్మృతి; స్పృహ.
**सुधरना**-अव्य० బాగుపడుట; సరియగుట.
**सुधंग; सुधांशु** - पुं० చంద్రుడు.
**सुधा** - स्त्री० అమృతము.
**सुधाकर** - पुं० చంద్రుడు.
**सुधाधर** - पुं० दे० सुधाकर.
**सुधाधी** - वि० అమృత సమానము.
**सुधार** - पुं० సంశోధనము; సంస్కారము.
**सुधारक** - पुं० సంస్కర్త.
**सुधारना** - स०क्रि० సరిదిద్దుట; సంస్కరించుట.
**सुधासदन** - पुं० చంద్రుడు.
**सुधि** - स्त्री० స్మృతి; జ్ఞప్తి.
**सुधी** - पुं० విద్వాంసుడు; పండితుడు; वि० చాతుర్యము గల.
**सुनगुन** - स्त्री० గుసగుస; రహస్యము; జాడ.
**सुनत** - स्त्री० दे० सुन्नत.
**सुनना** - स०क्रि० వినుట.
**सुनी अनसुनी करना** - मु० ఏదేని మాట విని కూడ విననట్లుండుట.
**सुनय** - पुं० మంచినీతి; సునీతి.
**सुनरि** - स्त्री० సుందరి - అందమైన స్త్రీ.
**सुनवाई** - स्त्री० వినటము ; వ్యాజ్యపు తీర్పు ఇచ్చుట; వినిపించుట.
**सुनसान** - वि० నిర్జనమైన; ధ్వంసమైన; పాడు పడిన; पुं० ప్రశాంతి; నీరవత్వము.

**सुनहरा ; सुनहला** - वि० బంగారు వన్నెగల.

**सुनाना** - स०क्रि० వినిపించుట; చివాట్లు పెట్టుట.

**सुनाम** - पुं० కీర్తి; ఖ్యాతి.

**सुनार** - पुं० కంసాలి.

**सुन्न** - वि० నిస్తబ్ధమైన; నిశ్చేష్టమైన; నిర్జీవమైన; पुं० శూన్యము; సున్న.

**सुन्नत** - स्त्री० సుంతీ.

**सुन्ना** - पुं० శూన్యము; సున్నా; బిందువు.

**सुन्नी** - पुं० మహమ్మదీయులకు సంబంధించిన ఒక తెగ.

**सुपच** - पुं० చండాలుడు.

**सुपत** - वि० ప్రతిష్ఠగల; గౌరవనీయమైన.

**सुपथ** - पुं० ఋజుమార్గము; సన్మార్గము.

**सुपन ; सुपना** - पुं० दे० स्वप्न.

**सुपर्ण** - पुं० గరుడపక్షి; అశ్వము; విష్ణువు.

**सुपारी** - स्त्री० పోకచెట్టు లేక పోకకాయ - చెక్క.

**सुपास** -पुं० సుఖము; వీలు.

**सुपासी** - वि० సుఖము కలుగజేయువాడు.

**सुपुर्द** - पुं० दे० सपुर्द.

**सुपूत** - पुं० సుపుత్రుడు.

**सुपेती** - स्त्री० सफेदी ; తెలుపు; స్వచ్ఛత.

**सुपेली** - स्त्री० చిన్న చేట.

**सुप्त** -वि० నిద్రించియున్న; ముణుచుకొనిన; నిద్రించిన.

**सुप्ति** - स्त्री० నిద్ర; కునుకు.

**सुबह** - स्त्री० ప్రాతఃకాలము; ప్రభాతము.

**सुबहान** - पुं० పవిత్రమైన; విశుద్ధమైన.

**सुबहान अल्ला** - अव्य० నేను పవిత్రముగా పరమేశ్వరుని స్మరించుచున్నాను ; ఆనందాశ్చర్యమును వ్యక్తపరచు ఒక శబ్దము.

**सुबास** - स्त्री० సువాసన; సుగంధము.

**सुबासना** - स्त्री० సుగంధము; సువాసన ; स०क्रि० సుగంధ పరచుట.

**सुबिस्ता ; सुबीता** - पुं० दे० सुभीता.

**सुबुक** - वि० తేలికయగు; అందమైన.

**सुबकदस्त** - वि० చురుకైన; చురుకుగ పనిచేయు.

**सुबुकी** - स्त्री० తేలికదనము; అప్రతిష్ఠ; అవమానము.

**सुबूत** - पुं० सबूत ; ప్రమాణము.

**सुबोध** - वि० తెలివిగల; సూక్ష్మగ్రాహి; సరళమైన; సుబోధమైన.

**सुभग** - वि० సుందరమైన; మనోహరమైన; అదృష్టముగల; ప్రియతమమైన.

**सुभगा** - स्त्री० అందమైన స్త్రీ; సౌభాగ్యవతి స్త్రీ; తన భర్తకు ప్రియురాలైన భార్య.

**सुभट** - पुं० గొప్ప యుద్ధవీరుడు.

**सुभडोल**-वि० మనోహరమైన ఆకారముగల.

**सुभा** - स्त्री० శోభ; కరక్కాయ.
**सुभान** - अव्य० दे० सुबहान.
**सुभाय** - पुं० दे० स्वाभाव.
**सुभाषित** - वि० బాగుగా చెప్పబడిన; పుం० మంచి ఉక్తి.
**सुभाषी** - वि० మధురభాషి; వాక్పటుత్వము గల.
**सुभिक्ष** - पुं० సకాలము; అన్ని సదుపాయములు గల కాలము.
**सुभीता** - पुं० వీలు; అదను; మంచి అవకాశము.
**सुम** - पुं० टाप ; పశువుల గిట్ట.
**सुमन** - पुं० పుష్పము; పండితుడు; బుద్ధిమంతుడు; वि० సహృదయుడు.
**सुमनचाप** - पुं० కామదేవుడు.
**सुमरना** - स०क्रि० స్మరించుట.
**सुमरनी** - स्त्री० జపమాల.
**सुमिरना** - स०क्रि० दे० सुमरना.
**सुमिरनी** - स्त्री० दे० सुमरनी.
**सुमुख**-वि० అనుకూలమైన; మనోహరమైన; पुं० శివుడు; గణపతి; పండితుడు.
**सुमुखी** - स्त्री० అందమైన ముఖముగల స్త్రీ; అద్దము.
**सुरंग** - स्त्री० అందమైన రంగుగల; మంచి ఆకారము గల;स्त्री० సొరంగము; కన్నము.
**सुर** - पुं० దేవత; పండితుడు; ఋషి; స్వరము.
**सुर में सुर मिलाना** - मु० స్వరంలో స్వరము కలుపుట; ఇచ్ఛకములాడుట.
**सुरखाब** - पुं० చక్రవాకము.
**सुरखाब का पर लगना** - मु० విలక్షణ ; విశిష్టతకాన్పించుట.
**सुरखी** - स्त्री० दे० सुर्खी.
**सुरखुरू** - वि० दे० सुर्खरू.
**सुरगैया** - स्त्री० కామధేనువు.
**सुरचाप** - पुं० ఇంద్రధనుస్సు.
**सुरत** - पुं० సంభోగము; మైధునము; स्त्री० స్మృతి.
**सुरति** - स्त्री० సంభోగము; కామకేళి; स्त्री० స్మృతి.
**सुरती** - स्त्री० खैनी ; నములుటకు ఉపయోగించు సున్నము కలసిన పొగాకుచూర్ణము.
**सुरभि** - स्त्री० సుగంధి; సువాస; ఆవు; మద్యము ; వసంతకాలము; वि० సువాసితమైన; శ్రేష్ఠమైన; మనోహరమైన.
**सुरभी** - स्त्री० दे० सुरभि.
**सुरमा** - पुं० కాటుకమాదిరిగా కళ్ళకు పెట్టుకొను నీలిరంగు చూర్ణము.
**सुरम्य** - वि० మిక్కిలి మనోహరమైన.
**सुरवृक्ष** - पुं० కల్పతరువు.
**सुरसर** - पुं० మానసరోవరము.

**सुरसरि ; सुरसरी** - स्त्री॰ గంగా నది.
**सुरसुरभी** - स्त्री॰ కామధేనువు.
**सुरांगना** - स्त्री॰ దేవాంగన; అప్సర.
**सुरा** - स्त्री॰ మద్యము; మదిర.
**सुराख** - पुं॰ ఛిద్రము; కంత.
**सुराग** - पुं॰ అత్యంత అనురాగము; జాడ; గాఢమైన ప్రేమ.
**सुरागी** - पुं॰ గుప్తచరుడు; గూఢచారుడు.
**सुराही** - स्त्री॰ తాగునీరు భద్రము చేయుటకు ఉపకరించు కూజా.
**सुरीला** - वि॰ వినసొంపు స్వరము గల; మధుర స్వరముగల.
**सुरूर** - पुं॰ ఆనందము; కొద్దిపాటి నిషా; మజా.
**सुर्ख** - वि॰ రక్తవర్ణము గల; ఎర్రని; पुं॰ ముదురు ఎరుపు రంగు.
**सुर्खरू** - वि॰ తేజస్వి; కీర్తిమంతుడు.
**सुर्खी** - स्त्री॰ ఎర్రదనము; రక్తము; నెత్తురు.
**सुलगना** - अ॰क्रि॰ అంటుకొనుట; రాజుట (నిప్పు).
**सुलगाना** - स॰क्रि॰ మండించుట; దుఃఖము కలిగించుట.
**सुलझना** - अ॰क्रि॰ చిక్కులు విడిపోవుట; పరిష్కారమగుట.
**सुलझाना** - स॰क्रि॰ చిక్కుతీయుట; పరిష్కరించుట.
**सुलटा** - वि॰ తిన్ననైన; తిన్నని.
**सुलतान** - पुं॰ చక్రవర్తి.
**सुलफ** - वि॰ కోమలమైన; నాజూకు.
**सुलफा** - पुं॰ హుక్కాలో వేయు పొగాకు.
**सुलभ** - वि॰ సులభముగు; తేలికగా లభించు; సాధారణమైన.
**सुलह** - स्त्री॰ ఒడంబడిక; సంధి.
**सुलहनामा** - पुं॰ సంధి పత్రము; అంగీకారపత్రము.
**सुलाना** - स॰क्रि॰ పరుండపెట్టుట; నిద్రపుచ్చుట.
**सुलूक** - पुं॰ दे॰ सलूक.
**सुवर्ण** - पुं॰ सोना ; బంగారము.
**सुवा** - पुं॰ दे॰ सुआ.
**सुवार** - पुं॰ వంటవాడు; శుభదినము.
**सुवास** - पुं॰ సువాసన.
**सुवासित** - वि॰ సువాసనగల.
**सुवासिनी**-स्त्री॰ యువావస్థలో కూడ తండ్రి ఇంటనుండు యువతి; పునిస్త్రీ.
**सुविधा**-स्त्री॰सुभीता; వీలు; సదుపాయము.
**सुशील** - वि॰ సత్ప్రవర్తనగల; శీలవంతుడు; మంచి నడవడిగల.
**सुषमा** - स्त्री॰ ఉత్కృష్టమైన శోభ; సౌందర్యము.

**सुषुप्त** - वि० గాఢనిద్రలోనున్న.
**सुषुप्ति** - स्त्री० గాఢనిద్ర.
**सुषुम्ना** - स्त्री० హఠయోగము ప్రకారము శరీరములోనుండు ఒక ప్రధానమైన నాడి
**सुषेण** - पुं० విష్ణువు.
**सुष्ट** - वि० మంచి; బాగు; సరిగ; సొబగైన.
**सुष्ठु** - क्रि०वि० బాగుగా.
**सुष्ठुता** - स्त्री० సొబగు; అందము.
**सुसंगति** - स्त्री० మంచి సాంగత్యము; సత్సంగము.
**सुसकना** - अ०क्रि० दे० सिसकना.
**सुसज्जित** - वि० శోభాయమానముగ; బాగుగా అలంకరించియున్న.
**सुसताना** - अ०क्रि० విశ్రమించుట; బడలిక తీర్చుకొనుట.
**सुसर ; सुसरा** - पुं० दे० ससुरा.
**सुसैनी** - वि० (स्त्री०) మంచి సంకేతములు గలది.
**सुस्त** - वि० దుర్బలమైన; సోమరి; నెమ్మదిగా నడచు లేక చేయు.
**सुस्तना** - स्त्री० సొబగైన కుచములు గల స్త్రీ.
**सुस्ताई** - स्त्री० दे० सुस्ती.
**सुस्ताना** - अ०क्रि० दे० सुसताना.
**सुस्ती** - स्त्री० సోమరితనము; శైథిల్యము.
**सुस्थ** - वि० స్వస్థతగల; ఆరోగ్యముగానున్న.
**सुस्मित** - वि० చిరునవ్వు ముఖము గల.
**सुहंग** - वि० చౌక.
**सुहाग** - पुं० సౌభాగ్యము; సిందూరము.
**सुहागा** - पुं० వెలిగారము.
**सुहागिन**-स्त्री०పునిస్త్రీ మహిళ; సధవ స్త్రీ.
**सुहागिनी** - स्त्री० दे० सुहागिन.
**सुहाता** - वि० సహ్యమైన; సహించదగిన.
**सुहाना** - अ०क्रि० శోభిల్లుట; మంచిగా అనిపించుట.
**सुहावन ; सुहावना** - वि० సుదర్శనము; సుందరమైన; శోభాయమానమైన.
**सुही** - वि० (स्त्री०) ఎర్రని.
**सुहृत् ; सुहृद्** - पुं० సహృదయుడు; స్నేహితుడు; సహచరుడు.
**सुहेला** - वि० सुहावना ; శోభాయమానమైన; శుభప్రదమైన ; पुं० స్తుతి; శుభప్రదమైన పాట.
**सूँघना** - स०क्रि० ఆఘ్రాణించుట; వాసన చూచుట.
**सिर सूँघना** - मु० పిల్లల శుభకామన కొరకు పెద్దలు వారి తలను వాసన చూచుట; చాలా తక్కువగా భుజించుట.
**सूँड** - स्त्री० ఏనుగ తొండము.
**सूँडी** - स्त्री० మొక్కలకు అరిష్టము కలుగ జేయు ఒక విధము తెల్లటి పురుగు.

**सूअर** - पुं० వరాహము; పంది.
**सूआ** - पुं० सुग्गा ; చిలుక; పెద్ద సూది.
**सूई** - स्त्री० సూది.
**सूकरक्षेत्र** - पुं० మధుర జిల్లాలోనున్న లేక సూకర క్షేత్రము.
**सूकरी** - स्त्री० ఆడపంది.
**सूक्ति** - स्त्री० శ్రేష్ఠమైన ఉక్తి లేక కథనము.
**सूक्ष्मदृष्टि** - स्त्री० సూక్ష్మాతిసూక్ష్మ విషయములను అవగాహన చేసుకొను దృష్టి.
**सूखना** - अ०क्रि० ఆరుట; ఎండుట; భయపడుట; బలహీనపడుట.
**सूखा** - वि० ఎండిన; నీరసమైన; చెమ్మలేని; కఠోరమైన; వట్టి.
**सूखा जवाब देना** - मु० పూర్తిగా తిరస్కరించుట.
**सूचक** - वि० సూచించు; బోధించు; పట్టీ; पुं० సూత్రధారుడు.
**सूचना** - स्त्री० విజ్ఞాపన; సూచన.
**सूचनापत्र** - पुं० విజ్ఞాపనము; విజ్ఞప్తి; వివరణ పత్రము.
**सूचा** - वि० (स्त्री०) జాగ్రత్తగానున్న ; స్పృహలోనున్న.
**सूचिका** - स्त्री० సూది; ఏనుగు తొండము.
**सूचित** - वि० సూచింపబడిన.
**सूची** - पुं० గుప్తచరుడు; చాడీకోరు; దుష్టుడు; स्त्री० దుస్తులు కుట్టు సూది.
**सूचीपत्र** - पुं० వివరణ పత్రిక.
**सूजन** - स्त्री० వాపు.
**सूजा** - पुं० లావు సూది.
**सूजी** - स्त्री० గోధుమ రవ్వ; నూక.
**सूझ** - स्त्री० తట్టుట; ఉద్భావన; తోచుట.
**सूझना** - अ०क्रि० తట్టుట; తోచుట; మనస్సులోనికి వచ్చుట.
**सूत** - पुं० నూలు; దారము.
**सूतक** - पुं० పురుడు; సూతకము.
**सूता** - पुं० తంతు; నూలు; स्त्री० ప్రసూత.
**सूति** - स्त्री० జన్మము; ప్రసవము; జననము.
**सूतिका** - स्त्री० బాలింతరాలు.
**सूती** - वि० నూలుతో చేయబడిన లేక నేయబడిన; स्त्री० ముత్యపు చిప్ప.
**सूत्र** - पुं० నూలు ; దారము; జంధ్యము.
**सूत्रकार** - पुं० సూత్రములు తయారుచేయువాడు; వడ్రంగి-కంసాలి; సాలెవాడు; సాలె పురుగు.
**सूत्रपात** - पुं० ప్రారంభము.
**सूथन; सूथनी** - स्त्री० ఒక విధమగు పయి జామా.
**सूद** - पुं० లాభము; వడ్డీ; వృద్ధి.
**सूद दर सूद** - मु० చక్రవడ్డీ.
**सूदखोर** - वि० వడ్డీ వ్యాపారి.

**सूदन** -वि० వినాశపరచువాడు; వధించువాడు.
**सूधे** - क्रि०वि० दे० सीधे.
**सून** - पुं० జననము; మొక్క; పువ్వు.
**सूना** - वि० శూన్యమగు, నిర్జనమైన; पुं० నిర్జన ప్రదేశము ; स्त्री० కుమార్తె; కసాయిదు కాణము ; వత్స్య.
**सूनापन** - पुं० శూన్యత; నీరవత.
**सूनु** - पुं० పుత్రుడు; సంతానము; తమ్ముడు; మనమడు - కూతురు కొడుకు.
**सूप** - पुं० వండిన పప్పు; వంటకాడు; చేట.
**सूपक ; सूपकार** - पुं० వంటవాడు.
**सूफ** - पुं० ఉన్ని వస్త్రము.
**सूफी** - पुं० ముసల్మానులలో ఒక తెగ.
**सूबा** - पुं० ప్రాంతము.
**सूबेदार** - पुं० ఒక ప్రాంతపు అధికారి; పరిపాలకుడు; ఒక సైన్యాధికారి.
**सूबेदारी** - स्त्री० సూబేదారుని పదవి.
**सूम** - वि० పిసినిగొట్టు; పీనాసి.
**सूर** - पुं० పండితుడు; జిల్లేడు; వీరుడు; శూరుడు; సూర్యుడు.
**सूरज** - पुं० సూర్యుడు.
**सूरत** -स्त्री० రూపము; ఆకృతి; సౌందర్యము; శోభ.
**सूरत बिगडना** - मु० ముఖము కళావిహీన మగుట.
**सूरत बनाना**-मु० వేషము మార్చుట; ఘాతి విరచుట; ముక్కు చిట్లించుట.
**सूरत दिखाना** - मु० ప్రత్యక్షమగుట.
**सूरत हराम**- पुं० చూచుట అందముగానున్నా లోపల ఏమీలేని; పైన పటారము లోన లొటారము.
**सूरन** - पुं० जमीकंद ; కూర కంద.
**सूरमा** - पुं० యుద్ధవీరుడు.
**सूरा** - पुं० కురానులోని ఒక అధ్యాయము.
**सूरि** - पुं० యజ్ఞము చేయించువాడు; పండితుడు; విద్వాంసుడు.
**सूरी** - पुं० విద్వాంసుడు; పండితుడు; स्त्री० విదుషి.
**सूर्यमुखी** - पुं० పొద్దుతిరుగుడు మొక్క పువ్వు.
**सूल** - पुं० బల్లెము; ముల్లు; ములక.
**सूलना** - स०क्रि० బల్లెముతో గుచ్చుట లేక ఛేదించుట.
**सूली** - स्त्री० फाँसी ; ఉరి; ఒక విధమగు ప్రాణ దండన.
**सूवना** - अ०क्रि० స్రవించుట; కారుట.
**सूवा** - पुं० सूआ ; చిలుక.
**सृंखला** - स्त्री० दे० शृंखला.
**सृंग** - पुं० दे० शृंग.
**सृजन** - पुं० సృష్టి.

**सृजनहार** - पुं० సృష్టికర్త.
**सृति** - स्त्री० సరళి ; మార్గము.
**सेंकना** - स०क्रि० నిప్పు మీద కాచుట; మంట ద్వారా వేడిచేయుట.
**आँख सेंकना** - मु० అందమైన ఆకృతిని చూచుట.
**धूप सेंकना** -मु० వెచ్చదనము కొరకు ఎండలో కూర్చొనుట; ఎండ కాచుకొనుట.
**सेंत** - स्त्री० డబ్బువెచ్చించకుండా; ఊరికే.
**सेंतका** - मु० కొనకుండా; ఊరికే వచ్చిన; వట్టినే.
**सेंतमेंत** - क्रि०वि० వెచ్చించకుండా; కొనకుండా; వట్టినే; వ్యర్థమైన.
**सेंथी** - स्त्री० బల్లెము.
**सेंदुर** - पुं० दे० सिंदूर.
**सेंदुर चढना** - मु० స్త్రీకి వివాహమగుట.
**सेंदुर देना** - मु० పెళ్ళిలో వరుడు వధువు పాపిటలో కుంకుమ అద్దుట.
**सेंदुरी** - स्त्री० ఎర్ర ఆవు; ఎర్రావు.
**सेंध** - स्त्री० नकब ; దొంగకన్నము.
**सेंधना** - स०क्रि० దొంగ కన్నము వేయుట.
**सेंधा** - पुं० సైంధవలవణము.
**सेंधिया** - वि० కన్నము వేయువాడు; కన్నపు దొంగ
**सेंवई** - स्त्री० సేమియా.
**सेक** - पुं० జలప్రక్షేపము; నీరు చల్లుట; మంటతో కాచుట.
**सेगा** - पुं० విభాగము; సెక్షను; శాఖ.
**सेचन** - पुं० सिंचाई ; నీరు చల్లుట; అభిషేకము.
**सेज** - स्त्री० శయ్య; పాన్పు.
**सेटना** - स०क्रि० తెలుసుకొనుట; అంగీకరించుట.
**सेठ** - पुं० పెద్ద షావుకారు; టోకు వ్యాపారి.
**सेतु** - पुं० అడ్డుకట్ట; వంతెన; వ్యవస్థ; మర్యాద.
**सेतुबंध**-पुं० శ్రీరాముడు లంకను చేరుటకు కట్టించిన వారధి - వంతెన.
**सेन** - पुं० శరీరము; జీవనము.
**सेना** - स्त्री० సైన్యము. स०क्रि० సేవించుట; పొదుగుట.
**सेनाजीवी** - पुं० సైనికుడు; యుద్ధ వీరుడు.
**सेनानी** - पुं० సైన్యాధిపతి.
**सेनी** - स्त्री० तश्तरी ; చిన్నపళ్ళెము; स्त्री० పంక్తి; మెట్లు; నిచ్చెన.
**सेब** - पुं० नाशपाती ; సీమరేగిపండు.
**सेम** - स्त्री० शिंवी ; చిక్కుడు.
**सेमल** - पुं० బూరుగచెట్టు.
**सेमा** - पुं० ఒక విధమగు పెద్ద చిక్కుడు.
**सेर** - वि० తృప్తిజెందిన; पुं० ఒక విధమగు

కొలత; సింహము; शेर.

**सेराना** - अ०क्रि० చల్లబడుట; తృప్తినొందుట; గతించుట.

**सेराब** - वि० నీటితో తడిసిన; తడుపు పెట్టబడిన; పుష్పించిన; ఫలించిన.

**सेरी** - स्त्री० తృప్తి.

**सेल** - पुं० బల్లెము; బరిసె.

**सेला** - पुं० పట్టుదుప్పటి.

**सेली** - स्त्री० చిన్న బరిసె; చిన్న దుప్పటి.

**सेल्हा** - पुं० दे० सेला.

**सेवई** - स्त्री० సేమియా; సేమ్యా.

**सेव** - पुं० కారపు పూస.

**सेवकाई** - स्त्री० సేవ.

**सेवाटहल** - स्त्री० పరిచర్య; సేవ-శుశ్రూష.

**सेवाबंदगी** - स्त्री० పూజ; ఆరాధన.

**सेवार ; सेवाल** - स्त्री० నాచు.

**सेविका** - स्त्री० దాసి.

**सेवित** - वि० సేవించబడిన; పూజింపబడిన.

**सेव्य** - वि० సేవించదగిన; పూజింపదగిన.

**सेव्य सेवक** - पुं० యజమాని - సేవకుడు.

**सेसर** - पुं० చీట్ల పేకలోని ఒక ఆట; కుట్ర; ఎదిరింపు.

**सेसरिया** - वि० మాయలమారి; కుట్ర మనిషి.

**सेह** - वि० మూడు.

**सेहत** - स्त्री० ఆరోగ్యము; సుఖ-శాంతి.

**सेहत खाना** - पुं० మరుగుదొడ్డి.

**सेहत बख्श** - वि० ఆరోగ్య ప్రదమైన.

**सेहतबन्दी** - स्त्री० 3 మాసములకొకసారి వసూలు చేయు శిస్తు - పన్ను.

**सेहतनामा** - पुं० శుద్ధిపత్రము; ఆరోగ్య ప్రమాణ పత్రము.

**सेहर** - पुं० గారడీ; ఇంద్రజాలము.

**सेहरा** - पुं० వధూవరులు ధరించు బాసికము.

**(किसी के सिर) सेहरा बाँधना** - मु० ఎవరినేని కృతార్థునిచేయుట.

**सेही** - स्त्री० साही ; ముళ్ళ పంది.

**सैंतना** - स०क्रि० పోగుచేయుట; సమకూర్చుట; చక్కదిద్దుట.

**सैंधव**-पुं० సైంధవ లవణము; సింధుప్రాంతపు గుఱ్ఱము; సింధుప్రాంతపు.

**सैंह** - स्त्री० दे० सौंह.

**सैकडा** - पुं० శత ఖండము; నూరు వస్తువుల సమూహము; నూరు.

**सैकडे** - क्रि०वि० నూటికి.

**सैकडों** - वि० कई सौ ; వందలకొలది.

**सैकत** - वि० ఇసుకమయమైన; ఇసుకసంబంధమైన.

**सैकल**-पुं० ఆయుధములకు సానపెట్టుపని; ఆయుధములకు పదును పెట్టుపని.

**सैकलगर** - पुं० ఆయుధములకు పదును పెట్టువాడు.
**सैन** - स्त्री० సైగ; సంకేతము; శయనము.
**सैनू** - पुं० అల్లికగల వస్త్రము.
**सैनेश** - पुं० సేనాపతి.
**सैफ** - स्त्री० तलवार ; ఖడ్గము.
**सैफ जबाँ** - वि० నోటికి వచ్చినట్లు మాట్లాడువాడు.
**सैफा** - पुं० బాకు; ఒక విధమగు పెద్ద బాకు.
**सैयद** - पुं० నాయకుడు; హజరత్ మహమ్మదుని కూతురు కొడుకు; ముసల్మానులలో ఒక తెగ.
**सैयाँ** - पुं० స్వామి; భర్త; ప్రియుడు.
**सैयाद** - पुं० వేటగాడు; ఉర్దూకవిత్వములో ప్రేమీ ప్రేమికుల స్థానే వాడబడు శబ్దము.
**सैर** - स्त्री० షికారు; వాహ్యాళి; వినోదము.
**सैरगाह** - पुं० విహార ప్రదేశము; రమ్యమైన యాత్రాస్థలము.
**सैल** - स्त्री० వరద; జలప్లావనము.
**सैलानी** - वि० వినోదము కొరకు యాత్ర చేయువాడు; ఇష్టాను సారము వ్యవహరించువాడు.
**सैलाब** - पुं० వరద; జలప్లావనము.
**सैलाबी** - वि० నది వరదకారణంగా తడియు ప్రదేశము; వరద సంబంధమైన; తేమ; చెమ్మ.
**सेंटा** - पुं० బాణాకర్ర.
**सेंटा बरदार** - पुं० आसा बरदार ; చోబుదారుడు.
**सोंठ** - स्त्री० శొంఠి; वि० శుష్కమైన.
**सोंधा** - वि० సుగంధమైన; సువాసన గల; సుగంధమును విరజిమ్ము.
**सोंपना** - स०क्रि० दे० सौंपना.
**सो** - सर्व० वह ; అది; వాడు; ఆమె; ఆ; अव्य० इसलिए ; కనుక; చివరికి.
**सोआ** - पुं० ఒక విధమగు ఆకు కూర.
**सोई** - सर्व० वही ; अव्य० दे० सो.
**सोखना** - स०क्रि० శోషించుట; పీల్చుట.
**सोख्ता** - पुं० అద్దురు పేపరు.
**सोग** - पुं० శోకము; దుఃఖము.
**सोगिनी** - वि० (स्त्री०) శోకించునది; శోకాకుల.
**सोगी** - वि० శోకించువాడు; శోకాకులుడు.
**सोच** - पुं० ఆలోచన; దుఃఖము; చింత; పశ్చాత్తాపము.
**सोचना** - अ०क्रि० ఆలోచించుట; విచారించుట; చింతించుట.
**सोचविचार** - पुं० తెలివి; సమయస్ఫూర్తి; అనిశ్చయము; వెనకముందు గుంజులాట.

**सोज** - स्त्री० వాపు.

**सोझ ; सोझा** - वि० తిన్ననైన; తిన్నని.

**सोता** - पुं० ప్రవాహము ; వాగు ; ఏరు.

**सोदर** - पुं० సహోదరుడు.

**सोधन** - पुं० दे० शोधन.

**सोधना** - स०क्रि० సరిదిద్దుట; శుభ్రపరచుట.

**सोना**-पुं०బంగారము;अ०क्रि० నిద్రించుట.

**सोना छूते मिट्टी होना** - मु० అగుచున్న కార్యము స్పర్శ వలన పాడగుట; గొప్ప విపత్తు సంభవించుట.

**सोने का मिट्टी होना** - मु० అంతా నాశమగుట.

**सोने में घुन लगना** - मु० అసంభవమైన సంఘటన సంభవించుట.

**सोने में सुगंध** - मु० శ్రేష్ఠమైన వస్తువులో ఇంకా ఘనత సంయోగించుట.

**सोते जागते** - मु० అనుక్షణము.

**सोनार** - पुं० दे० सुनार.

**सोपान** - पुं० सीढी; మెట్టు; సోపానము.

**सोपाँ** - वि० మండుచున్న.

**सोफता** - पुं० విలక్షణమైన ప్రదేశము.

**सोफियाना**-वि०సూఫీ ధర్మావలంబికులకు సంబంధించిన; చూచుటకు సామాన్యముగానున్ననూ నిజానికి బహు మేలైన.

**सोभार**-वि० వాచిన; పొంగి, పొటమరించిన

**सोम** - पुं० మత్తు కలిగించు రసము గల ప్రాచీన ఋషుల కాలమునుండి ప్రసిద్ధి జెందిన ఒక లత; చంద్రుడు.

**सोमपायी**-वि० సోమరసము సేవించువాడు.

**सोमसुत** - पुं० బుధుడు; బుధగ్రహము.

**सोवन** - पुं० నిద్రపోవుట.

**सोहन** - वि० శోభించు; మనోహరమైన.

**सोहन पपडी** - स्त्री० ఒక విధమగు మిఠాయి.

**सोहन हलवा** - स्त्री० ఒకవిధమగు హల్వా.

**सोहना** - अव्य० శోభిల్లుట; అలంకరించబడుట; మేలుగా అనిపించుట; वि० మనోహరమైన.

**सोहनी** - स्त्री० చీపురు కట్ట ; वि० (स्त्री०) అందమైన; మనోహరమైన.

**सोहबत** - स्त्री० సాంగత్యము; సంభోగము.

**सोहराना** - स०क्रि० दे० सहलाना.

**सोहला** - पुं० స్త్రీలు పాడు పురిటిపాట.

**सोहाग** - पुं० सुहाग ; మాంగల్యము.

**सोहागिन** - स्त्री० दे० सुहागिन.

**सोहाता** - वि० శోభాయమానమైన; సుందరమైన.

**सोहाना**-अ०क्रि० శోభిల్లుట; రుచించుట; నప్పుట; ఒప్పుట.

**सोहावना** - वि० सुहावन.

**सौ** - स्त्री० दे० सौह.
**सौंधा** - वि० ఉత్తమమైన; సువాసనగల.
**सौंधाई** - स्त्री० సుగంధము; ఆధిక్యము.
**सौंध** - स्त्री० సుగంధము.
**सौंपना** - स०क्रि० అప్పగించుట.
**सौंफ** - स्त्री० సోపుగింజలు.
**सौंह** - स्त्री० శపథము; ఒట్టు.
**सौ** - वि० నూరు; '100' సంఖ్య.
**सौ बात की एक बात** - मु० సారాంశము; తాత్పర్యము.
**सौकर्य** - पुं० సుకరత; సౌకర్యము; ఫీలు.
**सौकुमार्य** - पुं० సుకుమారత; కోమలత.
**सौगंद** - स्त्री० శపథము; ఒట్టు.
**सौगंध** - पुं० అత్తరు వ్యాపారి; సుగంధము; సువాసన.
**सौगात** - स्त्री० भेंट ; కానుక.
**सौजन्य** - पुं० సుజనత; సజ్జనత.
**सौत** - स्त्री० సవతి.
**सौतेला** - वि० సవతి సంబంధమైన.
**सौदा** - पुं० క్రయ, విక్రయపు వస్తువు; వెచ్చము; स्त्री० ఉన్మాదము; పిచ్చి.
**सौदाई** - पुं० पागल ; పిచ్చివాడు.
**सौदागर** - पुं० వ్యాపారి.
**सौदागरी** - स्त्री० వ్యాపారము; వృత్తి.
**सौदामनी; सौदामिनी** - स्त्री० మెరుపు; విద్యుత్.
**सौध** - पुं० ప్రాసాదము; భవనము; తెల్లచలువ రాయి.
**सौभाग्यवती** - वि० భర్తగలిగిన స్త్రీ; సధవ.
**सौम्य** - वि० శాంతమైన; శుభమైన; మంచి నడవడిగల; స్నిగ్ధమైన.
**सौम्यता** - स्त्री० సుశీలత; శాంతము; సౌందర్యము.
**सौर** - वि० సూర్య సంబంధమైన; स्त्री० దుప్పటి.
**सौरभ** - पुं० సుగంధము ; సువాసన.
**सौरभित** - वि० సుగంధమిచ్చు; సువాసనగల.
**सौरी** - स्त्री० సూతికా గృహము; పురిటిల్లు.
**सौष्ठव**-पुं० మంచి ఆకారము; మనోహరమైన ఆకృతి.
**सौहँ** - स्त्री० శపథము; ఒట్టు; क्रि०वि० ముందు; ఎదుట.
**सौहार्द ; सौहार्द्य** - पुं० మైత్రీ భావము; మైత్రి; స్నేహము.
**सौहृद** - पुं० మిత్రుడు; స్నేహితుడు; మైత్రి; స్నేహము.
**स्कंद** - पुं० వినాశము; ధ్వంసము; కార్తికేయుడు; శివుడు.
**स्कंध** - पुं० భుజము; అధ్యాయము; యుద్ధము.

**स्कंधावार** - पुं० సైన్యశిబిరము; సైన్యము.
**स्खलन** - पुं० పతనము; విచ్ఛేదము; హత్య.
**स्खलित** - वि० పతితమైన; చ్యుతమైన.
**स्तंभ** -पुं० खंभा ; చెట్టు మొదలు; స్తంభము; జడత్వము.
**स्तंभित** - वि० స్తంభించిన; నిశ్చేష్టమైన; అవరుద్ధమైన; చలించని.
**स्तनित** - पुं० మేఘ గర్జనము; ఉరుము; తప్పట్లధ్వని; वि० గర్జించుచున్న.
**स्तब्ध** - वि० స్తంభించిన; చలనములేని; అవరుద్ధమైన.
**स्तब्धता** - स्त्री० స్తబ్ధత; జడత్వము.
**स्तर** - पुं० ప్రమాణము; అంతస్తు; పొర; శయ్య.
**स्तरण** - पुं० వ్యాపింపజేయుట; చెల్లాచెదురు చేయుట; వ్యాప్తి.
**स्तव** - पुं० పుష్పగుచ్ఛము; స్తుతి; స్తోత్రము.
**स्तवन** - पुं० స్తుతి; స్తవము; గుణకీర్తన.
**स्तीर्ण** - वि० చిందరవందరగానున్న; వికీర్ణమైన.
**स्तुत** - वि० పొగడబడిన; ప్రశంశింపబడిన.
**स्तुतिवादक** - पुं० ఇచ్చకములాడువాడు; చాటుకారుడు.
**स्तुत्य** -वि० పొగడదగిన; ప్రశంసా పాత్రమగు.
**स्तेन** - पुं० దొంగ; దొంగతనము.
**स्तेय** - पुं० చౌర్యము; దొంగతనము.
**स्तोता** - वि० స్తుతించువాడు.
**स्त्रीधन** - पुं० స్త్రీకి మాత్రమే అధికారము గల సంపద.
**स्त्रीप्रसंग** - पुं० సంభోగము; మైధునము.
**स्त्रीव्रत** - पुं० పత్నీవ్రతము; భార్యావ్రతము.
**स्त्रैण** - वि० मेहरा ; స్త్రీ సంబంధమైన; స్త్రీసంకేతానుసారము సంచరించువాడు; భార్యాలోలుడు.
**स्थकित** - वि० అలసిపోయిన.
**स्थगित** - वि० मुलतवी ; కొంతకాలము వరకు ఆపబడిన; వాయిదా పడిన.
**स्थलकमल** - पुं० కమలము ఆకారములో నేలమీద పూయు ఒక పుష్పము.
**स्थविर** - पुं० వృద్ధుడు; బౌద్ధ భిక్షువు.
**स्थाणु** - पुं० స్తంభము; మొహరము.
**स्थानांतरण** - पुं० బదలీ.
**स्थानापन्न** - वि० ఇంకొకనికి బదులుగా వచ్చి తాత్కాలికముగా పని చేయువాడు.
**स्थानिक ; स्थानीय** - पुं० అదే స్థానమునకు సంబంధించిన.
**स्थापक** - पुं० శిల్పకారుడు; స్థాపించువాడు; సంస్థాపకుడు.
**स्थापत्य** - पुं० శిల్పకార్యము; భవన నిర్మాణ కళ; తాపీ పనిమనిషి.

**स्थापना** - स्त्री० స్థాపించుట; ప్రతిష్ఠించుట; ప్రతిపాదించుట.

**स्थापित** - वि० స్థాపించబడిన; ప్రతిష్ఠింపబడిన.

**स्थायी** -वि० స్థిరముగానుండు; మన్నికగల.

**स्थाली** - स्त्री० బాన.

**स्थायी समिति** - स्त्री० కార్యనిర్వాహక సమితి.

**स्थावर** - पुं० పర్వతము; స్థిరాస్తి ; वि० స్థిరమైన; అచలమైన.

**स्थित** - वि० తనస్థానమున ఉన్న; నివాసి; ఆసీనమైన.

**स्थिति** - स्त्री० అస్తిత్వము.

**स्नातक** - पुं० బ్రహ్మచర్యవ్రతమును పూర్తిచేసి గృహస్థాశ్రమమున ప్రవేశించినవాడు; గురుకుల విద్యాబుద్ధులను సాంగోపాంగముగా పూర్తిచేసినవాడు.

**स्नायु** - स्त्री० శరీరములో వ్యాపించియుండు నరములు; స్పర్శజ్ఞానము కలిగించు నరములు.

**स्निग्ध** - वि० తైలముగల; నునుపైన.

**स्नेह** - पुं० ప్రేమ; చెలిమి; స్నేహము.

**स्नेही** - पुं० చెలికాడు; మిత్రుడు; స్నేహితుడు.

**स्पंद ; स्पंदन** - पुं० మెల్లిమెల్లిగా కదలుట; అదురుట; వణుకుట.

**स्पंदित** - वि० కదలుచున్న; అదరుచున్న.

**स्पर्द्धा** - स्त्री० పోటీ; ఆసక్తి; సంఘర్షణము.

**स्पृश्य** - वि० స్పృశింపదగిన; ముట్టుకొనదగిన.

**स्पृष्ट** - वि० స్పృశింపబడిన; తాకబడిన.

**स्पृहणीय** - वि० వాంఛించబడిన; వాంఛించదగిన; కోరబడిన; కోరదగిన.

**स्पृहा** - स्त्री० కామన; వాంఛ; అభిలాష.

**स्फटिक** - पुं० పటిక; సూర్యకాంతమణి; అద్దము.

**स्फार** - वि० ప్రచురితమైన; అధికముగ.

**स्फीत** - वि० పెరిగిన; విస్తారమైన; సమృద్ధమైన.

**स्फीति** - स्त्री० వికాసము; వృద్ధి.

**स्फुट** - वि० వికసించిన; వ్యక్తమైన; చిల్లరగ.

**स्फुरण** - पुं० మెల్లిమెల్లిగా కదలుట; అదురుట; కంపించుట; తోచుట.

**स्फुरित** - वि० స్ఫురించిన; తోచిన.

**स्फुलिंग** - पुं० అగ్నికణము; నిప్పురవ్వ.

**स्फूर्ति** - स्त्री० నెమ్మదిగా వదలుట; మెదలుట;స్ఫురణ; కొద్దిపాటి ఉద్రేకము; చురుకుతనము.

**स्फोट** - पुं० పైకి చొచ్చుకొని వచ్చుట; ఆవరణమును పటాపంచలము చేసి బహిర్గతమగుట; శరీరము మీద వచ్చు కురుపు;

పొక్కు-మొ॥ వాపు.
**स्फोटक** - पुं० కురుపు; పొక్కు; वि० భళ్ళు మని పగులునది.
**स्फोटन** - पुं० విదారణము; విచ్ఛేదనము; చినుగుట; పగులుట.
**स्मर** - पुं० మన్మథుడు; కామదేవుడు.
**स्मरण पत्र** - पुं० జ్ఞాపకార్థము వ్రాయబడు పత్రము- ఉత్తరము.
**स्मरारि** - पुं० మహాదేవుడు ; శంకరుడు.
**स्मारक** - वि० జ్ఞాపకము చేయు; స్మృతి చిహ్నము.
**स्मार्त** - पुं० స్మృతి శాస్త్ర పండితుడు.
**स्मित** - पुं० చిరునగవు; మందహాసము; वि० వికసించిన; నవ్వుచున్న.
**स्मृत** - वि० జ్ఞాపకమున్న; జ్ఞాపకము వచ్చిన.
**स्मृति** - स्त्री० స్మరణ శక్తి.
**स्यंदन** - पुं० యుద్ధరథము; వాయువు ; वि० కారుడు; కాచుట; కరుగుట.
**स्यात्** - अव्य० शायद; బహుశా.
**स्याना** - वि० చాతుర్యముగల; తెలివిగల; తుంటరి; ధూర్తుడు; వయస్కుడు; पुं० వృద్ధపురుషుడు; భూతవైద్యుడు; వైద్యుడు.
**स्यानापन** - पुं० యవ్వనదశ; చాతుర్యము; తెలివి; తుంటరితనము.
**स्यापा** - पुं० మృతుని ఇంటి వద్ద ప్రతి దినము కొంతకాలము వరకు స్త్రీలు గుమిగూడి శోకించు ఆచారము.
**स्यापा पडना** - मु० రోదించు; శోకించు ; గల్లంతు వ్యాపించుట.
**स्यामा** - स्त्री० दे० श्यामा.
**स्यार** - पुं० सियार ; నక్క.
**स्यारपन** - पुं० నక్క స్వభావము.
**स्यारी** - स्त्री० ఆడనక్క.
**स्याल** - पुं० శ్యాలకుడు; భార్య సోదరుడు; బావమరది.
**स्याह** - वि० నల్లని.
**स्याहा** - पुं० दे० सियाहा.
**स्याही** - स्त्री० సిరా; నల్లదనము; మసి.
**स्याही सोख** - यौ० అద్దుర పేపరు.
**स्याही जाना** - मु० వెంట్రుకలు తెల్లబడుట; యవ్వనము గతించుట.
**स्रक** - स्त्री० పుష్పహారము.
**स्रज** - स्त्री० హారము; మాల.
**स्रवण** - पुं० కారుడు; స్రవణము; కారుట; ప్రవాహము; గర్భపాతము; మూత్రము; స్వేదము.
**स्रवना** - अ०क्रि० కారుట; బొట్లుబొట్లుగా కారుట; स०क्रि० కార్చుట; ప్రవహింప జేయుట.

**स्रष्टा** - पुं० సృష్టికర్త.
**स्रस्त** - वि० చ్యుతమైన; పతితమైన.
**स्राव** - पुं० కారుట; ప్రవాహము; గర్భ స్రావము.
**स्रुवा** - स्त्री० చిన్నకొయ్య గరిట లేక ఉద్ధరిణి.
**स्रोत** - पुं० జల ప్రవాహము; ఏరు; ఉత్సము.
**स्रोनित** - पुं० दे० शोणित.
**स्वः** - पुं० స్వర్గము.
**स्व** - वि० తన.
**स्वकीय** - वि० दे० स्व.
**स्वगत** - पुं० స్వగత కథనము ; తనతో తను చెప్పుకొనుట; తనలో తను మాట్లాడు కొనుట.
**स्वच्छंद** - वि० తన ఇష్టానుసారము వ్యవహ రించు; స్వతంత్రమగు; అంకుశము లేని.
**स्वजन्मा** - वि० **स्वयंभू**; భగవంతుడు మొ॥ వారు.
**स्वतः** - अव्य० తనంతటతాను; తనే.
**स्वत्व** - पुं० అధికారము; హక్కు.
**स्वत्वाधिकारी** - पुं० యజమాని; సర్వాధి కారి.
**स्वन** - पुं० శబ్దము; ధ్వని.
**स्वपच** - पुं० दे० श्वपच.
**स्वप्निल** - पुं० నిద్రలోనున్న; కలగంటున్న.
**स्वयंसेवक** - पुं० ఏ ప్రతి ఫలమును అపేక్షిం చకుండా తనంతట తాను ఇతరులకు సదుపాయములు కలుగజేయువాడు.
**स्वयमेव** - क्रि०वि० స్వయముగా; తనంతట తనే.
**स्वर्गंगा** - स्त्री० ఆకాశగంగ; మందాకిని నది.
**स्वर्गवधू** - स्त्री० అప్సర.
**स्वर्गवासी** - वि० స్వర్గనివాసి; మరణించిన.
**स्वर्गीय** - वि० స్వర్గసంబంధమైన; చని పోయిన.
**स्वर्ण** - पुं० కనకము; బంగారము.
**स्वसा** - स्त्री० సోదరి.
**स्वस्ति** - अव्य० కల్యాణమగు గాక; మంచి అగుగాక ( ఆశీర్వాదము)
**स्वस्ती** - अव्य० दे० स्वस्ति.
**स्वस्थ** - वि० ఆరోగ్యముగల; స్వస్థతగల; మెలకువగానుండు.
**स्वाँग** - पुं० కృత్రిమ వేషధారణ; వినోదార్థము విచిత్రవేషధారణ; వెక్కిరింపుతో కూడిన అనుకరణము; వంచన నిమిత్తము వేయు వేషము.
**स्वाँगना** - स०क्रि० కృత్రిమ వేషము ధరిం చుట.
**स्वांत** - पुं० అంతఃకరణము; మనస్సు.
**स्वाँस** - स्त्री० ; **स्वाँसा** - पुं० శ్వాస.
**स्वाक्षरित** - वि० తన సంతకము చేసియున్న.

**स्वागत** - पुं० స్వాగతము.
**स्वागतकारिणी सभा** - स्त्री० మహాసభ నిమిత్తము వచ్చు అతిథుల మర్యాద మన్న నల కొరకు ఏర్పాటైన స్వాగత సమితి.
**स्वातिसुत ; स्वातिसुवन** - पुं० ముత్యము.
**स्वाद** - पुं० రుచి; అభిరుచి; అభిలాష.
**स्वादन** - पुं० రుచిచూచుట.
**स्वादिष्ट ; स्वादिष्ठ** - वि० రుచిగల; రుచి కరమైన.
**स्वादु** - पुं० మాధుర్యము; బెల్లము; పాలు; वि० రుచికరమైన; రుచిగల మధురమైన; సుందరమైన.
**स्वादी** - वि० రుచిచూచువాడు; రసికుడు.
**स्वान** - पुं० दे० श्वान.
**स्वाप** - पुं० నిద్ర; అజ్ఞానము.
**स्वामिन ; स्वामिनी** - स्त्री० యజమాను రాలు.
**स्वायत्त** - पुं० తన అధికారములో నున్న.
**स्वायत्त शासन** - पुं० తన అధికారములో నున్న శాసనము; పాలనము; స్థానీయ స్వరాజ్యము.
**स्वारथ** - पुं० दे० स्वार्थ.
**स्वार्थांध** - वि० తన స్వార్థముతో ఉచితాను చితములు ధ్యాసలో లేనివాడు.
**स्वावलंब ; स्वावलंबन** - पुं० తన శక్తి ఆధారము; తన శక్తిమీదనే ఆధారపడుట.
**स्वास** - पुं० **स्वासा** - स्त्री० ; दे० श्वास.
**स्वास्थ्य** - पुं० ఆరోగ్యము.
**स्वास्थ्यकर** - वि० ఆరోగ్యము కలుగచేయు; ఆరోగ్య వర్ధకమైన.
**स्वाहा** - स्त्री० హోమ సందర్భమున దేవత లకు, అగ్నికిసమర్పించునపుడు వాడబడు శబ్దము; అగ్నిదేవుని భార్య పేరు.
**स्वाहा करना** - मु० వినష్టపరచ; నాశనము చేయుట.
**स्वीकृत** - वि० అంగీకరించబడిన ; స్వీక రించబడిన.
**स्वीय**-वि०తన స్వంతమగు;पुं० ఆత్మీయుడు; బంధువు.
**स्वेच्छाचारी** - वि० నిరంకుశమగు; ఇష్టాను సారము వ్యవహరించు.
**स्वेच्छासेवक** - पुं० दे० स्वयं सेवक.
**स्वेद** - पुं० पसीना ; చెమట; స్వేదము.
**स्वेदज** - वि० చెమట వల్ల పుట్టు పేను ; నల్లి దోమ మొ॥ వి.
**स्वेदन** - पुं० స్వేదించుట; చెమట కారుట.
**स्वैर** - वि० ఇష్టము వచ్చినట్లు వ్యవహరించు; యథేచ్ఛగ.
**स्वैरचारी** - वि० స్వేచ్ఛాచారి; ఇష్టానుసారము వ్యవహరించు; వ్యభిచారి; నిరంకుశమైన.

**स्वैरता ; स्वैरिता** - स्त्री० యథేచ్ఛాచారము; విచ్చలవిడితనము.

**स्वैरिणी** - स्त्री० వ్యభిచారిణి.

## ह

**हँक** - स्त्री० दे० हाँक.

**हँकडना** - अ०क्रि० అహంకారించుట; సవాలు చేయుట; అరచుట.

**हँकरना** - अ०क्रि० दे० हँकडना.

**हँकाना** - स०क्रि० పిలుచుట; తోలించుట; दे० हाँकना.

**हँकार** - स्त्री० పిలుపు; అరచి పిలుచుట కేక; అహంకారము; సవాలు.

**हँकारना** - स०क्रि० పిలుచుట; కేకవేయుట; కేకవేసి పిలుచుట; సవాలు చేయుట; హుంకరించుట.

**हँकारा** - पुं० పిలుపు; ఆహ్వానము.

**हँकारी** - पुं० దూత; మందిని పిలుచుకొచ్చు వాడు.

**हंगामा** - पुं० కొట్లాట; గలభా; గోల.

**हंडना** - अ०क्रिं० తిరుగుట; పనికిమాలిన తిరుగుడు తిరుగుట.

**हंडा** - पुं० గుండిగ.

**हँडाना** - स०क्रि० తిప్పుట; ఉపయోగించుట; వినియోగించుట.

**हँडिया** - स्त्री० [illegible]

**हंत** - अव्य० అయ్యో శోకసూచక శబ్దము.

**हंता** - पुं० వధించువాడు.

**हंस** - पुं० హంస; ప్రాణవాయువు.

**हंसगति** - स्त्री० అందమైన నిదానపు నడక.

**हंसना** - अ०क्रि० నవ్వుట ; स०क्रि वెక్కిరించుట; అవమానించుట.

**हंसना खेलना** - यौ० ఆనందించుట.

**हँसते हँसते** - मु० ఆనందముగా.

**(बात) हँसकर उडाना** - मु० తుచ్ఛమని తలచి వినోదముతో కొట్టివేయుట.

**हँसमुख** - वि० నవ్వుముఖముగల; వినోద ప్రియుడు; హాస్యప్రియుడు.

**हँसराज** - पुं० ఒక విధముగు వనమాలిక; మార్గశీర్ష మాసములో వచ్చు ఒక విధముగు ధాన్యము.

**हँसली** - स्त्री० ఒక విధముగు కంఠహారము - కంటె; మెడక్రింద, రొమ్ము పైన ఉండు ధనుషాకారము గల ఒక ఎముక.

**हंसवाहिनी** - स्त्री० సరస్వతి.

**हँससुता** - स्त्री० సూర్యపుత్రి; యమునా నది.

**हँसाई** - स्त्री० నవ్వు; అప్రతిష్ఠ; నింద.

**हँसाना** - स०क्रि० నవ్వించుట.

**हँसिया** - स्त्री० కొడవలి.

**हंसी** - स्त्री० ఆడహంస.

**हँसी** - स्त्री० నవ్వు; హాసము; వినోదము; వేళాకోళము.

**हँसी छूटना** - मु० నవ్వువచ్చుట.

**हँसी खेल** - यौ० వినోదము; సాధారణమైన విషయము.

**हँसी में उडाना** - मु० పరిహాసముగా భావించి నెట్టివేయుట.

**हँसी उडाना** - मु० వ్యంగ్యపూర్ణమైన; పరిహాసము; వెక్కిరింపు.

**हँसुआ; हँसवा** - पुं० दे० हँसिया.

**हँसोड** - वि० दिल्लगीबाज ; పరిహాస ప్రియుడు; ఎగతాళి చేయువాడు.

**हई** - पुं० గుజ్జుపురాతు; स्त्री० ఆశ్చర్యము.

**हक** - पुं० స్వత్వము; అధికారము; నిజమైన; సమంజసమైన.

**हक में** - मु० పక్షమున; కర్తవ్యము; విధి; భగవంతుడు.

**हक अदा करना** - मु० కర్తవ్యము; నిర్వర్తించుట.

**हक तलफी** - स्त्री० అన్యాయము; ఇతరుల హక్కును అపహరించుట.

**हकदक** - वि० నివ్వెరబోయిన.

**हकदार** - पुं० హక్కుగలవాడు.

**हकनाहक** - अव्य० బలవంతముగా; పోకిరీ తనముగా; వ్యర్థముగా; అకారణముగా.

**हकबकाना** - अ०क्रि० నివ్వెరపోవుట; స్తంభించిపోవుట.

**हकरसी** - स्त्री० న్యాయము.

**हकला** - वि० నత్తిగా మాటాడువాడు; నత్తిగలవాడు.

**हकारत** - स्त्री० ఏవగింపు; అప్రతిష్ఠ.

**हकलाना** - अ०क्रि० నత్తిగా మాట్లాడుట.

**हकशफा** - पुं० ఇతరులకంటె ఇరుగుపొరుగు వారికి ఏదేని భూమిని కొనుటకు ముందుగా లభించు హక్కు.

**हकीकत** - स्त्री० తత్వము; నిజము; మూలము; తత్త్వము.

**हकीकत में** - मु० నిజానికి; వాస్తవానికి.

**हकीकत खुलना** - मु० అసలు విషయము బయటపడుట.

**हकीकी** - वि० మూలానికి సంబంధించిన; సయానా.

**हकीम** - पुं० విద్వాంసుడు; ఉపాధ్యాయుడు; యూనాని వైద్యుడు.

**(नीम) हकीम** - पुं० తెలిసీ తెలియని వైద్యుడు.

**हकीर** - वि० సన్నని; దుర్బలమైన; తుచ్ఛమైన; ఘృణాస్పదమైన.

**हक्का बक्का** - वि० నిశ్చేష్టమైన; నివ్వెరబోయిన.

**हगना** - स०क्रि० మల విసర్జన చేయుట.

**हज** - पुं० మక్కాయాత్ర; తీర్థయాత్ర.
**हज** - पुं० సౌభాగ్యము; అదృష్టము; ఆనందము; రుచి.
**हजम** - पुं० పాచనము; అరుగుదల; वि० తప్పుడు నడతవల్ల సంపాదించిన అధికారము.
**हजरत** - पुं० మహాత్ముడు; మహాపురుషుడు; పోకిరీ మనిషి (వ్యంగ్యము).
**हजामत** - स्त्री० క్షవరము.
**हजामत बनाना** - मु० క్షౌరము చేయుట; దోచుకొనుట; డబ్బు అపహరించుట; చితకబాదుట.
**हजार** - वि० సహస్రము; వెయ్యి.
**हजारहा** - वि० వేలకొలది.
**हजारा** - पुं० పెద్దబంతి పువ్వు; నీరు చిమ్మెడి చిన్న చిన్న కంతలు గల గొట్టము.
**हजारी** - पुं० వెయ్యి మంది సైనికుల నాయకుడు; వర్ణసంకరుడు (వ్యంగ్యము).
**हजूम** - पुं० జనసమూహము; గుంపు.
**हजो** - स्त्री० నింద; ఆక్షేపణ.
**हज्जाम** - पुं० క్షవరము చేయువాడు; మంగలి.
**हज्ज** - पुं० दे० हज.
**हटकन** - स्त्री० పశువులను తోలునప్పుడు ఉపయోగించబడు బెత్తము లేక కర్ర.
**हटकना** - स०क्रि० ఆపుట; అడ్డగించుట; పశువులను మరియొక మార్గమునకు మళ్ళించుట.
**हटताल** - स्त्री० दे० हड़ताल.
**हटना** - अ०क्रि० జరుగుట; తొలగుట.
**हटवा** - पुं० దుకాణదారుడు.
**हटाना** - स०क्रि० తొలగించుట; ఎక్కడా ఉండనీయకపోవుట.
**हट्ट** - पुं० బజారు; దుకాణము; సంత.
**हट्टा कट्टा** - वि० లావుగల; ప్రబలమైన.
**हट्टी** - स्त्री० దుకాణము.
**हठ** - पुं० మంకుపట్టు; మొండిపట్టు; దృఢమైన సంకల్పము.
**हठ पकड़ना** - मु० మొండిపట్టు పట్టుట.
**हठ माँड़ना** - मु० మొండిగానుండుటకు నిశ్చయించుట; మంకుపట్టు పట్టుటకు నిశ్చయించుకొనుట.
**हठधर्म** - पुं० दे० हठ.
**हठना**-अ०क्रि० దురాగ్రహించుట; మొండిగా తన మాటమీద నిలిచియుండుట.
**हठात्** - अव्य० మొండిగా; జబరదస్తీగా.
**हठी** - वि० హఠము చేయు.
**हठीला** - वि० తన పంతముమీద దృఢముగానున్న.
**हड** - स्त्री० కరక్కాయ; కరక్కాయ ఆకారము గల ఒక నగ.

**हडकंप** - पुं० పెద్దగలాభా; గందరగోళము.

**हडकना** - अ०क्रि० तरसना ; తహతహ లాడుట; దేవిరించుట; లభించని వస్తువు కొరకు దుఃఖించుట.

**हडकाना** - स०क्रि० తహతహ లాడించుట; సవాలు చేయుట; అడిగిన వస్తువును ఇవ్వకుండా వెళ్ళగొట్టుట; దేవురించునట్లు చేయుట.

**हडकाया** - वि० పిచ్చి (కుక్క)

**हडजोड** - पुं० గలిజేరు తీగలేక ఆకు.

**हडताल** - स्त्री० సమ్మె; హర్తాళము; ఏదేని విషయము యెడల అసంతోషము సూచించుటకు గాను మార్కెట్టు, ఫ్యాక్టరీ మొ॥ మూసి వేయించుట.

**हडताली** - वि० హర్తాలు చేయువాడు; హర్తాలుకు సంబంధించిన; स्त्री० జంజాటము; చిక్కు; ఇబ్బంది.

**हडप** - वि० మింగిన ; మాయము చేసిన.

**हडपना** - स०क्रि० కాజేయుట; అపహరించుట.

**हडबड** - स्त्री० తొట్రుపాటు; ఆతృత.

**हडबडाना**-अ०क्रि० తొందరపడుట; తడబడుట; గల్లంతు పడుట.

**हडपडिया** - वि० హడావిడిచేయు; తొందరపాటుగల.

**हडबडी**-स्त्री०తొందరపాటు; తొట్రుపాటు; ఆతృత.

**हडीला** - वि० బొమికల పోగు అయిన; బలహీనమైన; సన్నని.

**हड्ड** - पुं० दे० हड्डी.

**हड्डा** - पुं० కందిరీగ.

**हड्डी** - स्त्री० ఎముక; కులము; వంశము.

**हड्डियाँ गढना या तोडना** - मु० చితక బాదుట.

**हड्डियाँ निकल आना या रह जाना** - मु० అతిగా సన్నగిల్లుట; బలహీనపడుట.

**हड्डी तोड** - यौ० కఠోరమగు పరిశ్రమ.

**हत** - वि० నాశనము చేయబడిన; చంపబడిన.

**हतक** - स्त्री० అవమానము; అగౌరవము.

**हतचेत** - वि० చైతన్యములేని; స్పృహలేని.

**हतबुद्धि** - वि० బుద్ధిలేని; మూర్ఖుడగు.

**हताश** - वि० నిరాశచెందిన.

**हताहत** - वि० గాయపడిన; చంపబడిన.

**हत्ता** - अव्य० చివరికి; తుదకు.

**हत्था** - पुं० పిడి; కుర్చీ చేయి; అరటిగెల.

**हत्थे** - अव्य० చేతిలో.

**हत्यारा** - पुं० హత్యచేయువాడు.

**हत्यारी**-स्त्री०హంతకురాలు; హత్యాదోషము లేక పాపము.

**हथउधार** -पुं० చేబదులు.

**हथकंडा** - पुं० హస్తలాఘవము; హస్తకౌశలము; రహస్యపు ఎత్తు.
**हथकडी** - स्त्री० చేతి సంకెళ్ళు.
**हथलुट** - वि० చిన్న విషయానికి కొట్లాడు వాడు.
**हथनी** - स्त्री० ఆడ ఏనుగు.
**हथफेर** - पुं० ప్రేమ పూర్వకముగా చేతితో ఒంటి మీద నిమురుట; ఇతరుల సొత్తును తెలివిగా అపహరించుట; చేబదులు.
**हथलेवा** - पुं० పాణిగ్రహణము.
**हथसार** - स्त्री० గజశాల.
**हथियाना**-स०क्रि० హస్తగతము చేసికొనుట; భుక్తము చేసుకొనుట; అపహరించుట.
**हथियार** - पुं० ఆయుధము; పనిముట్టు.
**हथियारबंद** - वि० ఆయుధము ధరించిన.
**हथेली** - स्त्री० అరచేయి.
**हथेली में आना** - मुं दे० हत्थे चढना.
**हथेली पर जान होना** - मु० ప్రాణసంకటమగుట.
**हथौडा** - पुं० సమ్మెట.
**हथौडी** - स्त्री० చిన్న సమ్మెట.
**हद** - स्त्री० సీమ; హద్దు.
**हद बाँधना** - मु० హద్దు నిర్ధారించుట.
**हद व हिसाब नहीं** - मु० అపారమైన.
**हदका** - पुं० త్రోపుడు; ప్రహారము.
**हदस** - स्त्री० భయము; భీతి.
**हदीस** - स्त्री० హజరత్ మహమ్మదుని వచన సంగ్రహమనబడు ఒక ధర్మగ్రంథము.
**हद्द** - स्त्री० हद का बहु० హద్దులు.
**हनन** - पुं० వధ; వధించి చంపివేయుట; బాదుట.
**हनना** - स०क्रि० వధించుట; చంపివేయుట; చితకబాదుట.
**हनोज** - अव्य० ఇప్పుడే; ఇంకను.
**हप** - पुं० వెంటనే నోటిలో వేసుకొని నోరు మూసుకొనుట.
**हप कर जाना** - मु० వెంటనే నోటిలో వేసుకొని తినివేయుట.
**हफ्ता** - पुं० సప్తాహము; వారము.
**हबकना** - अ०क्रि० తినుటకు లేక కోరుకొనుటకు వెంటనే నోరు తెరచుట.
**हबर दबर** - अ०क्रि० త్వరత్వరగా; వేగిరముగా; తొందరపాటుగా.
**हबराना** - अ०क्रि० दे० हडबडाना.
**हबशी** - पुं० నీగ్రో జాతివాడు.
**हब्बा डब्बा** - पुं० ఒక విధమగు శ్వాస రోగము.
**हबीब** - पुं० మిత్రుడు; స్నేహితుడు.
**हबूब** - पुं० గింజలు; గోలీలు; వాయు ప్రవాహము.
**हब्बा** - पुं० బహు అల్పమైన అంశము;

ధాన్యపుగింజ.

**हब्शी** – पुं० दे० हबशी.

**हब्स** – पुं० ఖైదు.

**हम** – सर्व० మేము; మనము; पुं० అహం కారము ; अव्य० వెంట; సమానమగు; తుల్యమగు; పరస్పరముగా ; ఒక విధమగు ప్రత్యయము ఉదా : हमजोली, हमदर्द, हमवतन.

**हमजोली** - पुं० సఖుడు; తోటివాడు.

**हमता**-स्त्री०అహంభావము; అహంకారము.

**हम-दम** - वि० ప్రాణతుల్యుడు; ప్రాణ మిత్రుడు.

**हमदर्द**-वि०సానుభూతి పరుడు; సానుభూతి తెలియజేయువాడు.

**हमदस्त** - वि० సహవాసి; సహయోగి.

**हमरंग** - वि० సమానమైన రంగు గల.

**हम-राज** - वि० రహస్యమెరిగినవాడు; ఆత్మీయుడు.

**हम-राह** - वि० సహయాత్రికుడు; తోటి యాత్రికుడు.

**हमल** - पुं० గర్భము.

**हमला** - पुं० ఆక్రమణ; దాడి.

**हम-वतन** - वि० తన దేశమునకు సంబంధించిన; స్వదేశపు.

**हमाम** - पुं० हम्माम.

**हम साया**-पुं० पडोसी ; పొరుగున నివసించువాడు.

**हमसिन** - वि० సమవయస్కులైన.

**हमहमी** - स्त्री० दे० हमाहमी.

**हमा** - वि० మొత్తము; యావత్తు.

**हमाहमी** - स्त्री० తమ తమ లాభము కొరకు ఆత్రపడువాడు; స్వార్థపరత; అహం కారము.

**हमेशा** - अव्य० ఎల్లప్పుడు; సర్వదా.

**हम्माम** - पुं० స్నానాగారము; స్నానాలగది.

**हमशीरा** - स्त्री० సోదరి.

**हमसर** - वि० సమానత్వము గల; సమఉజ్జీయగు.

**हमामदस्ता** - पुं० हावन; కల్వము; ఇనప కల్వము-గూటము.

**हम-शुमा** - वि० సామాన్యజనులు.

**हमीदा** - वि० ప్రశంసించబడు; ప్రశంసించదగిన.

**हम्माल** - पुं० బరువు మోయువాడు; కూలివాడు.

**हय** - पुं० గుఱ్ఱము; అశ్వము.

**हयमेध** - पुं० అశ్వమేధయజ్ఞము.

**हयशाला** - स्त्री० అశ్వశాల.

**हया** - स्त्री० సిగ్గు; లజ్జ.

**हयादार** - वि० సిగ్గుగలవాడు; సిగ్గుపడువాడు.

**हयात** - स्त्री० जिंदगी ; జీవనము.

**हर**-वि० హరించు; అపహరించు; पुं० శివుడు; నాగలి; वि० ప్రత్యేకమైన; ఒక్కొక్కటి; ప్రతి.

**हर एक** - मु० ప్రత్యేకమైన; ఒక్కొక్కటి.

**हरदम** - मु० ఎల్లప్పుడు.

**हरकत** - स्त्री० కదలిక; పరుషప్రవర్తన; పోకిరీతనము.

**हरकारा**-पुं० పత్రవాహకుడు; వార్తాహరుడు.

**हरखना** - अ०क्रि० హర్షించుట; సంతోషించుట.

**हरगिज** - अव्य० कभी ; ఎన్నడును; ఎంత మాత్రము; ఎలాంటి పరిస్థితులలోనూ.

**हरचंद** - क्रि०वि० यद्यपि ; అయినప్పటికి.

**हरज** - पुं० दे० हर्ज.

**हरजा** - वि० పనికిమాలిన; వ్యర్థమైన; దండగ చేటు.

**हरजाई** - वि० బలాదూరు తిరుగుడు తిరుగు వాడు; చంచలమైన; स्त्री० వ్యభిచారిణి; వేశ్య.

**हरजाना** - पुं० నష్టపరిహారము; క్షతిపూర్తి.

**हरता धरता** - पुं० సర్వాధికారి.

**हरताल** - स्त्री० పసుపు పచ్చని ఒక ఖనిజ పదార్థము; సమ్మె.

**हरताल फेरना या लगाना** - मु० వినష్ట పరచుట; రద్దు చేయుట.

**हरदिल अज़ीज** - वि० సర్వప్రియుడు.

**हरद; हरदी** - स्त्री० दे० हल्दी.

**हरना** - स०क्रि० హరించుట; దోచుకొనుట; లాక్కొనుట; వినష్టపరచుట.

**मन हरना** - मु० మనస్సుని దోచుకొనుట.

**प्राण हरना** - मु० ప్రాణము హరించుట; చంపివేయుట; అమితమైన దుఃఖమును కలిగించుట.

**हरनी** - स्त्री० ఆడలేడి; లేడి.

**हरनौटा** - पुं० మృగశావకము; లేడిపిల్ల.

**हरफ** - पुं० అక్షరము ; వర్ణము.

**हरफ आना** - मु० కళంకము వచ్చుట; దోషము అంటుకొనుట.

**हरफ उठाना** - मु० అక్షరములు గుర్తుపట్టి చదువుట.

**हरफन मौला** - मु० అన్నికళలలోనూ ఆరితేరినవాడు.

**हरबराना** - अ०क्रि० दे० हरबडाना.

**हरबा** - पुं० ఆయుధము.

**हर बोंग** - वि० गँवार ; పల్లెటూరి బైతు; మూర్ఖుడు; पुं० అరాచకము; అన్యాయము; ఉపద్రవము.

**हरम** - पुं० అంతఃపురము.

**हरमजदगी** - स्त्री० కొంటెతనము; తుంటరి

తనము; దౌష్ట్యము.

**हरमसरा** - स्त्री॰ అంతఃపురము.

**हरवाना** - अ॰क्रि॰ తొందరపడుట; హడా విడిపడుట.

**हरवाहा** - पुं॰ दे॰ हलवाहा.

**हरसिंगार** - पुं॰ పారిజాతము.

**हरा** - वि॰ ఆకుపచ్చని; ప్రఫుల్లమైన; పార్వతి.

**हरा बाग** - मु॰ వట్టివట్టి ఆశకలిగించు విషయము.

**हराई** - स्त्री॰ ఓటమి.

**हराना** - स॰क्रि॰ ఓడించుట; అలసట పెట్టుట.

**हरापन** - पुं॰ ఆకు పచ్చదనము.

**हराम** - वि॰ నిషిద్ధమైన; అనుచితమైన; ధర్మ శాస్త్రము నిషేధించిన వస్తువు; నమ్మక ద్రోహము; అధర్మము.

**(कोई बात) हराम करना** - मु॰ ఏదేని పనిలో ఇబ్బంది కలుగజేయుట.

**(कोई बात) हराम होना** - मु॰ ఏదైనా పనిలేక విషయము కష్టమగుట.

**हरामका** - मु॰ చెడు మార్గమున లభించిన; ఊరకే వచ్చిన; వ్యభిచారము.

**हरामखोर**-वि॰ పాపపు సొమ్ము అనుభవించు వాడు.

**हरामजादा** - पुं॰ సంకరజాతివాడు; జార జుడు.

**हरामी**-वि॰ జారసంజాతమైన; సంకరముగా పుట్టిన; నీచమైన.

**हरारत** - स्त्री॰ తాపము; వేడిమి; కొద్దిపాటి జ్వరము.

**हरावल** - पुं॰ సైన్యపు ముందు భాగము.

**हरास** - पुं॰ జంకు; భయము; నిరాశ; स्त्री॰ ఓటమి.

**हराहर** - पुं॰ दे॰ हलाहल.

**हरिआना** - अ॰क्रि॰ పల్లవితమగుట; ఆకుపచ్చపడుట.

**हरिआली** - स्त्री॰ ఆకుపచ్చదనము; ప్రసన్నత.

**हरिजन** - पुं॰ భక్తుడు.

**हरिण** - पुं॰ లేడి.

**हरिणी** - स्त्री॰ ఆడలేడి.

**हरित** - वि॰ ఆకు పచ్చని.

**हरितमणि**-पुं॰ మరకతము; పచ్చ (రత్నము).

**हरिताभ** - वि॰ ఆకుపచ్చ వన్నెగల.

**हरिद्रा** - स्त्री॰ हल्दी ; పసుపు.

**हरिन** - पुं॰ దుప్పి; మృగము.

**हरिनी** - स्त्री॰ ఆడలేడి.

**हरियाली**-स्त्री॰चెట్లుచామలతో నిండియున్న ప్రాంతము; ఆకు పచ్చదనము.

**हरियाली सूझना**-मु॰ నలువైపుల ఆనందమే

ఆనందము కాన్పించుట.

**हरियाली तीज** - स्त्री॰ శ్రావణ మాసపు కృష్ణపక్షపు తదియ దినము.

**हरीफ** - पुं॰ సాటివాని వృత్తియే చేయువాడు; శత్రువు; విరోధి.

**हरूफ** - पुं॰ అక్షరాలు.

**हरैया** - पुं॰ ఓడువాడు.

**हरौल** - पुं॰ दे॰ हरावल.

**हरौहर** - स्त्री॰ దోపిడి.

**हर्ज** - पुं॰ పనిలో ఆటంకము; విఘ్నము; నష్టము.

**हर्ज मर्ज**-यौ॰ ఆటంకము; అంతరాయము.

**हर्ता** - पुं॰ హరించువాడు; నాశనము చేయువాడు.

**हर्तार** - पुं॰ दे॰ हर्ता.

**हर्फ** - पुं॰ दे॰ हरफ.

**हर्म्य** - पुं॰ ప్రాసాదము; భవంతి.

**हर्रा** - पुं॰ పెద్ద జాతి కరక్కాయ.

**हर्ष** - पुं॰ ప్రఫుల్లత; ప్రసన్నత.

**हर्षाना** - अ॰क्रि॰ హర్షించుట; ఆనందించుట; स॰क्रि॰ ఆనంద పరచుట.

**हल** - पुं॰ నాగలి; సమస్యా పరిష్కారము.

**हल जोतना** - मु॰ పొలముదున్నుట; పొలములో నాగలితో దున్నుట.

**हलकंप** - पुं॰ दे॰ हडकंप.

**हलक** - पुं॰ కంఠనాళము.

**हलक के नीचे जाना** - मु॰ పొట్టలోనికి వెళ్ళుట; ఏదేని విషయము మనస్సుకి నాటుట.

**हलकई** - स्त्री॰ తేలికతనము; తుచ్ఛత; అవమానము.

**हलकना** - अ॰क्रि॰ చలించుట; బుడగలు వచ్చుట; అలలు వచ్చుట.

**हलका** - वि॰ తేలికయగు; పల్చని; కొద్ది; पुं॰ గుండ్రని; మండలాకారము;

हलका करना-मु॰ అవమానించుట ;

हलके हलके - मु॰ మెల్లిమెల్లిగా.

**हलकान** - वि॰ दे॰ हलाकान.

**हलकाना** - अ॰क्रि॰ తేలిక అగుట; బరువు తక్కువగుట; स॰क्रि॰ తేలిక చేయుట; బరువు తగ్గించుట.

**हलकोरा** - पुं॰ అల; తరంగము.

**हलचल** - स्त्री॰ గలాభా; గల్లంతు; కోలాహలము.

**हलदी** - स्त्री॰ పసుపు.

**हलफ** - पुं॰ శపథము.

**हलफ उठाना** - मु॰ శపథము చేయుట; ఒట్టుపెట్టుకొనుట.

**हलफ नामा** - पुं॰ శపథ పూర్వముగా వ్రాసి ఇచ్చిన పత్రము; శపథ పూర్వముగా వ్రాసి

ఇచ్చిన వాగ్దానము.

**हलराना** - स०क्रि० పిల్లలను చేతుల్లోకి తీసుకొని లాలించుట.

**हलवा** - पुं० హల్వా.

**हलवे माँड से काम** - मु० కేవలము స్వార్థ ప్రయోజనము; తన లాభము మీదే ధ్యాస.

**हलवाई** - पुं० మిఠాయి తయారు చేయువాడు; మిఠాయి అమ్మువాడు.

**हलवाह; हचवाहा** - पुं० ఇతరుల వద్దనాగలి దున్ను పని చేయువాడు.

**हलाक** - वि० చంపబడిన.

**हलाकान** - वि० వ్యాకులపడిన; హైరానైన; అలసిపోయిన.

**हलाकी** - वि० मारू ; చంపువాడు; హంతకుడు.

**हलाकू** - वि० వధించువాడు; హంతకుడు.

**हलाभला** - पुं० తీర్పు; పరిణామము; నిర్ణయము.

**हलायुध** - पुं० శ్రీకృష్ణుని సోదరుడగు బలరాముడు.

**हलाल** - वि० ధర్మశాస్త్ర సంబంధమైన; సమంజసమైన; పుణ్య ప్రదమైన.

**हलाल करना** - मु० తినుటకు పశువును విధి పూర్వకముగా వధించుట.

**हलाल का** - मु० నిజాయితీగా పొందిన.

**हलाल खोर** - पुं० కష్టించి; నిజాయితీగా జీవించువాడు.

**हलावत** - स्त्री० మాధుర్యము; తీపి.

**हलाहल** - पुं० సముద్ర మంథన సమయమున బహిర్గతమైన మహావిషము; హాలాహల విషము.

**हली** - पुं० బలరాముడు; రైతు.

**हलीम** - वि० తిన్నని; శాంతమగు.

**हलुवा** - पुं० दे० हलवा.

**हलूक** - स्त्री० వమనము; డోకు.

**हलोरना** - स०क्रि० నీటిలో చెయ్యి ముంచి నీటిని ఇటూఅటూ కదిలించుట; చిలుకుట; ధాన్యము చెరుగుట; వీలైనంత వేగముగా రెండు చేతులతో సంగ్రహించుట.

**हलोरा** - पुं० दे० हिलोरा.

**हल्दी** - स्त्री० दे० हलदी.

**हल्ला** - पुं० అరుపు; గలభా; కోలాహలము; ఆక్రమణ; దాడి.

**हवन** - पुं० హోమము; హోమము సందర్భమున వాడబడు కొయ్య ఉద్ధరిణ.

**हवलदार** - पुं० సైన్యములో ఒక చిన్న అధికారి; బాదుషాహీ యుగమున ప్రభుత్వపు పన్ను; పంటల అజమాయిషీ చేయు అధికారి.

**हवस**-स्त्री० लालसा ; కామన; కోరిక; తృష్ణ.

**हवा** - स्त्री० వాయువు; భూతము; ప్రసిద్ధి; ప్రతిష్ఠ.

**हवा उडना** - मु० పుకారు వ్యాపించుట.

**हवा खाना** - मु० విశుద్ధమైన గాలి కొరకు బయటికి బయల్దేరుట; పచారు చేయుట; ప్రయోజనము సిద్ధించకుండుట.

**हवा पीकर रहना** - मु० నిరాహారముగా నుండుట (వ్యంగ్యము).

**हवा बाँधना** - मु० బడాయిలు కొట్టుట.

**हवा पलटना या बदलना** - मु० పరిస్థితి మారుట.

**हवा से लडना** - मु० అకారణముగా తగాదా పడుట

**किसी की हवा लगना** - मु० సాంగత్య ప్రభావము పడుట.

**हवा हो जाना**-मु० వెంటనే మాయమగుట; పారిపోవుట.

**हवा बँधना** - मु० మంచి పేరు వచ్చుట.

**हवाई** - वि० గాలి సంబంధమైన; కల్పితమైన; ఆకాశ సంబంధమైన.

**(मुँह पर) हवाइयाँ उडना** - मु० ముఖము రంగు మారుట; కళావిహీనమగుట.

**हवाई किला बनाना या बाँधना**-मु० గాలిలో మేడలు కట్టుట.

**हवाई अड्डा** - पुं० విమానాశ్రయము.

**हवाई जहाज** - पुं० విమానము.

**हवागाडी** - स्त्री० మోటారు.

**हवादार** - वि० గాలి సదుపాయము గల.

**हवाल** - पुं० స్థితి; సమాచారము; వృత్తాంతము.

**हवाला** - पुं० ప్రమాణము; దృష్టాంతము; ఉదాహరణ; అప్పగింత బాధ్యత.

**हवाले करना** - मु० అప్పగించుట.

**हवालात** - स्त्री० నిర్బంధము; ఖైదు.

**हवाली** - स्त्री० చుట్టు ప్రక్కల ప్రదేశము.

**हवास** - पुं० ఇంద్రియములు; స్పృహ; చైతన్యము.

**हवास गुम होना** - मु० స్పృహలేకపోవుట; భయాది కారణమున స్తంభించిపోవుట.

**हवि** - पुं० హోమాగ్నికి సమర్పించు పదార్థము.

**हविष्य** - वि० హోమమునకు ఉపకరించు ; पुं० दे० हवि.

**हविस** - स्त्री० दे० हवस.

**हवेल** - स्त्री० ఒక విధమగు కంఠహారము.

**हवेली** - स्त्री० ప్రాసాదము; భవంతి; భార్య.

**हव्वा** - स्त्री० సృష్టిలో మొట్టమొదటి స్త్రీ; పిల్లలను దడిపించుటకు చెప్పబడు బూచి.

ह स्त्री० నౌకర్లు-చాకర్లు గల బలగము; వైభవము; సంపత్తి; దర్జా.

**हश्‌त** - वि० ఎనిమిది.

**हश्र** - पुं० कयामत ; మహాప్రళయము.

**हश्र बरपा करना** - मु० పెద్దగా గలభా చేయుట.

**हश्र टूटना** - मु० గొప్ప విపత్తు సంభవించుట; - గందరగోళము చేయుట.

**हसद** - पुं० डाह ; ఈర్ష్య.

**हसन** - पुं० హాసము; పరిహాసము; వినోదము.

**हसब** - अव्य० అనుసారము.

**हसरत** - स्त्री० మనోకామన; దుఃఖము.

**हसित** - पुं० హాస్యము; నవ్వులాట; కామదేవుని ధనస్సు; वि० నవ్వులపాలైన; వికసించిన; నవ్విన.

**हसीन** - वि० అందమైన; సుందరమైన.

**हस्त** - पुं० చేయి; ఏనుగ తొండము; వ్రాలు; వ్రాత.

**हस्तकौशल** - पुं० హస్తలాఘవము.

**हस्तक्षेप** - पुं० జోక్యము.

**हस्तगत** - वि० చేతికివచ్చిన; వశమైన; లభించిన.

**हस्तलाघव** - पुं० హస్తలాఘవము; చేతి చురుకుతనపు మాయ.

**हस्ताक्षर** - पुं० दस्तखत ; చేవ్రాలు.

**हस्तामलक** - पुं० సాంగోపాంగముగా తెలిసిన విషయము.

**हस्ति** - पुं० दे० हस्ती.

**हस्तिनी** - स्त्री० ఆడ ఏనుగు; కామశాస్త్రాను సారము నాల్గవ శ్రేణికి చెందిన నాయిక.

**हस्ती** - पुं० ఏనుగ; स्त्री० అస్తిత్వము.

**हस्ते** - अव्य० ద్వారా; చేత.

**हस्ब** - क्रि०वि० అనుసారము.

**हस्तबदस्तूर** - अव्य० యథాప్రకారము; ఆనవాయితీ ప్రకారము.

**हहर** - स्त्री० ప్రకంపము; వణుకు; భయము.

**हहरना** - अ०क्रि० ప్రకంపించుట; వణకిపోవుట; నివ్వెరపోవుట.

**हहराना** - स०क्रि० ప్రకంపించుట; వణికించుట; భయపెట్టుట.

**हहा** - स्त्री० అట్టహాసము; హాహాకారము.

**हहा खाना** - मु० అతిగా దేవిరించుట; ప్రాధేయపడుట.

**हाँ** - अव्य० స్వీకృతిని సూచించు శబ్దము.

**हाँ करना**-मु० ఒప్పుకొనుట; స్వీకరించుట.

**हाँ में हाँ मिलाना** - मु० ఇచ్చకములాడుట; మంచి చెడు అన్నీ ఒప్పుకొని ఎదటవాని మంచి సంపాదించుట.

**हाँक** - स्त्री० కేక; పెద్దకేక; సవాలు; గర్జింపు;

సాయము కొరకు కేక.

**हाँक देना या हाँक लगाना** - मु० బిగ్గరగా పిలుచుట; కేకవేయుట.

**हाँक पुकार कर कहना** - मु० నలుగురి ఎదుట నిర్భయముగా దృఢముగా అరుస్తూ చెప్పుట.

**हाँकना**-स०क्रि० కేకవేసి పిలుచుట; తోలుట (పశువులను).

**हाँगी** - स्त्री० స్వీకృతి; స్వీకారము.

**हाँगी भरना** - मु० స్వీకరించుట.

**हाँडना** - अ०क्रि० బలాదూరు తిరుగుడు తిరుగుట.

**हाँडी** - स्त्री० చిన్నబాన.

**हाँडी पकना**-मु० లోలోపల కుట్రపన్నుట; బానలో ఉడుకుట.

**हाँडी चढना** - मु० ఏదేని వస్తువులను వండుటకు బానను పొయ్యిమీద పెట్టుట.

**हाँती** - स्त्री० పార్థక్యము; విముఖత.

**हाँफना** - अ०क्रि० రొప్పుట.

**हाँफा** - पुं० రొప్పు.

**हाँसी** - स्त्री० दे० हाँसी.

**हाँ हाँ** - पुं० నిషేధించు లేక వారించు శబ్దము; - లేదు, కాదు.

**हा** - अव्य० శోక సూచకమైన శబ్దము.

**हाऊ** - पुं० हौवा ; బూచి.

**हाकिम** - पुं० శాసకుడు; గొప్ప అధికారి.

**हाकिमी** - स्त्री० ప్రభుత్వము; శాసనము ; वि० శాసకునికి సంబంధించిన.

**हाजत**-स्त्री० ఆవశ్యకత; కోరిక; నిర్బంధము.

**हाजत में देना या रखना** - मु० నిర్బంధములోనుంచుట.

**हाजमा** - पुं० జీర్ణము; జీర్ణశక్తి; పాచనము.

**हाजिम**-वि० జీర్ణించు; అరిగించు; పాచకము.

**हाजिर** - वि० ప్రత్యక్షముగానున్న; సమ్మకమున నున్న.

**हाजिर जवाब** - वि० వెంటనే సమాధానము చెప్పు చాకచక్యముగల; ప్రత్యుత్పన్నమతి.

**हाजिर बाश** - वि० ఎల్లప్పుడు హాజరుగా నుండువాడు.

**हाजी** - पुं० మక్కా యాత్ర చేసి వచ్చిన మహమ్మదీయుడు.

**हाट** - स्त्री० దుకాణము; సంత; సంతదినము.

**हाट करना** - मु० వ్యాపారము చేయుటకు సంతకు, మార్కెటుకు వెళ్ళుట.

**हाट लगना** - मु० సంత వస్తువులు దుకాణములలో సిద్ధపరచుట.

**हाट चढना** - मु० సంతలో అమ్ముడుబోవుటకు వచ్చుట.

**हाटक** - पुं० सोना ; బంగారము.

**हाटकपुर** - पुं० స్వర్ణపురి; రావణాసురుని

రాజధాని లంక.

**हाड** - पुं० ఎముక; వంశపు మర్యాద; కులీనత.

**हाता** - पुं० ప్రహరి; ఆవరణము; ప్రాంతము; హద్దు.

**हातिम** - पुं० అనుభవజ్ఞుడు; నిపుణుడు; ప్రాచీన అరబ్బు దేశపు ఒక దానశీలుడు ; గొప్పదాత.

**हातिम की कक्ष पर लात मारना**-मु० గొప్ప ఔదార్యము కలిగి పరోపకారము చేయుట (వ్యంగ్యము).

**हाथ** - पु० చెయి; హస్తము, మూర ( ఒక కొలత).

**हाथ में आना या पडना** - मु० లభించుట; వశమగుట.

**(किसी को) हाथ उठाना** - मु० సలాము చేయుట; నమస్కరించుట

**(किसी पर) हाथ उठाना** - मु० ఎవరినైనా కొట్టుటకు చెయ్యి ఎత్తుట; గుద్దుటకు గురిచూచుట.

**हाथ ऊँचा होना** - मु० దానము చేయుటలో నిమగ్నమగుట; సంపన్నమగుట.

**हाथकी मैल** - मु० తుచ్ఛవస్తువు.

**हाथ खुजलाना**-मु० చెయ్యి దురదపెట్టుట; కొట్టాలని అనిపించుట; కలసి వచ్చు లక్షణము కనిపించుట.

**हाथ खींचना** - मु० ఏదేని పనినుంచి వేరగుట; సహకరించకపోవుట; ఇవ్వడము ఆపుట.

**हाथ चलाना** - मु० కొట్టుటకు గురి చూచుట; కొట్టుట.

**हाथ छोडना** - मु० కొట్టుట.

**हाथ जोडना** - मु० చేతులు జోడించుట; నమస్కరించుట; వేడుకొనుట; ( దూరమునుంచే) ; సంబంధము తెగతెంపులు చేసుకొనుట; ప్రక్కకు తప్పుకొనుట.

**हाथ डालना** - मु० ఏదేని పనిలో చేయి కలుపుట; పనిలో సహకరించుట.

**हाथ तंग होना** - मु० ఆర్థికంగా ఇబ్బంది పడుట; చేతిలో డబ్బు లేకపోవుట.

**(किसी वस्तु या बात से) हाथ धोना** - मु० పోగొట్టుకొనుట; త్యజించుట; లభించు అవకాశములు లేకపోవుట.

**हाथ धोकर पीछे पडना** - मु० ఏదేని పనిలో మనస్ఫూర్తిగా నిమగ్నమగుట.

**हाथ पकडना** - मु० ఏదేని పనినుండి విరమింపజేయుట; ఆశ్రయమిచ్చుట; శరణు ఇచ్చుట; వివాహము చేసుకొనుట.

**हाथपर हाथ धरे बैठे रहना** - मु० పనిపాటు లేకుండా ఉండుట; సోమరిగా కాలము వెళ్ళబుచ్చుట.

**हाथ पसारना या फैलाना** - मु० చెయ్యి చాచుట; యాచించుట.

**हाथ पाँव चलना** - मु० చేతులు, కాళ్ళు పనిచేయుట; ఏదేని పని చేయుటకు సామర్థ్యము కలిగి యుండుట.

**हाथ पाँव ठंढे होना** - मु० చేతులు కాళ్ళు చల్లబడుట; చావుకు సిద్ధమగానున్న; భయమువలన స్తంభించిపోవుట.

**हाथ पाँव निकालना** - मु० లావెక్కుట; బలియుట; హద్దుదాటుట; కొంటె తనము చేయుట.

**हाथ पाँव फूलना** - मु० భయము, దుఃఖము వలనగాబరా పడుట.

**हाथ पाँव पटकना** - मु० చేతులు, కాళ్ళు కొట్టుకొనుట; ప్రయత్నించుట; శ్రమించుట.

**हाथ पैर जीडना** - मु० దీనముగా వేడుకొనుట.

**हाथ फेरना** - मु० చేవాటు తనము చేయుట; దొంగిలించుట.

**हाथ बाँधे खडा रहना**-मु०చేతులు కట్టుకొని నిలబడుట; సేవించుటకు హాజరుగా నుండుట.

**हाथ मारना** - मु० మాయము చేయుట; దొంగిలించుట.

**हाथ में करना** - मु० వశపరచుకొనుట; మోహించుట.

**हाथ रँगना** - मु० లంచము పుచ్చుకొనుట.

**हाथ रोपना या ओडना**-मु०చెయ్యిజాచుట; యాచించుట.

**हाथ लगना** - मु० లభించుట; చేతికి అందుట; ప్రాప్తించుట.

**हाथ लगना** - मु० ప్రారంభమగుట; ప్రారంభించుట.

**हाथ लगाना**-मु० ముట్టుకొనుట; తాకుట.

**हाथ साफ करना** - मु० కొట్టుట; దొంగలించుట.

**हाथों हाथ** - मु० చేతులమీదుగా.

**हाथों हाथ लेना** - मु० గౌరవపూర్వకముగా స్వాగతమిచ్చుట.

**लगे हाथ** - मु० చేతిలో పనితోపాటు; తోడుగా.

**हाथा** - पुं० పిడి; పసుపు కలిసిన అరచేతి ముద్ర.

**हाथा जोडी** - स्त्री० ఔషధమునకు ఉపకరించు ఒకమొక్క.

**हाथा पाई; हाथा बाँही** - स्त्री० బాహాబాహి కొట్లాట; ముష్టిఘాతముల కొట్లాట.

**हाथी** - पुं० ఏనుగు.

**हाथी की राह** - मु० ఆకాశగంగ.

**हाथी पर चढना** - मु० భాగ్యవంతుడగుట; ప్రతిష్ఠ కలుగుట.
**हाथी बाँधना** - मु० గొప్ప సంపన్నుడగుట.
**हाथी के संग गाँडे खाना** - मु० గొప్ప బలశాలితో పోటీపడుట.
**हाथी पाँव** - पुं० బోదకాలు రోగము.
**हाथीवान** - पुं० మావటివాడు.
**हादसा ; हादिसा** - स्त्री० కొత్త విషయము; ఘటన; దుర్ఘటన.
**हादिस** - वि० నవీనమైన; నశ్వరమగు.
**हादी** - पुं० ఉపదేశకుడు; మార్గదర్శకుడు; నాయకుడు.
**हानना** - स०क्रि० చంపుట.
**हानि** - स्त्री० నష్టము; అనిష్టము; అపకారము; విఘ్నము.
**हाफिज** - पुं० కురాను కంఠస్థము చేసినవాడు.
**हाफिजा** - पुं० స్మరణశక్తి.
**हामिल** - वि० బరువులు మోయు.
**हामिला** - स्त्री० గర్భవతి.
**हामी** - स्त्री० స్వీకృతి; స్వీకారము; సమర్థించువాడు; సహాయకుడు.
**हामी भरना** - मु० స్వీకరించు.
**हाय** - अव्य० శోకసూచకశబ్దము ; स्त्री० కష్టము; దుఃఖము; ఈర్ష్య.
**हायन** - पुं० साल ; సంవత్సరము.

**हार** - स्त्री० ఓటమి; అపజయము; అలసట; క్షతి.
**हार खाना** - मु० ఓడుట; అపజయము పొందుట.
**हार** - पुं० హారము.
**हारना** - अ०क्रि० ఓడుట; అలసిపోవుట.
**हारे दर्जे** - मु० నివశమైన.
**हारकर** - मु० వివశమయి; అసమర్థమయి.
**हार सिंगार** - पुं० పారిజాత వృక్షము లేక పువ్వు.
**हारिल** - पुं० ఎల్లప్పుడు తన ముక్కులో పుల్ల లేక పోచ పట్టుకొనియుండు ఒక పక్షి.
**हारी** - वि० అపహరించువాడు; దొంగిలించువాడు; తీసుకువెళ్ళువాడు; మోహింపజేయువాడు.
**हारीत** - पुं० దొంగ; దోపిడీదారుడు; దొంగతనము; దోపిడి.
**हार्दिक** - वि० హృదయమునుండి వెలువడిన; హృదయ సంబంధమైన; నిజమైన.
**हाल** - पुं० స్థితి; పరిస్థితి; సమాచాగము; వృత్తాంతము; సంజాయిషీ; వివరణ.
**हाल में** - मु० ఈమధ్యన; ఈ సమయమున.
**हाल का** - मु० నవీనమైన; ఇప్పటి.
**हाल चाल** - यौ० సమాచారము.
**हालगोला** - पुं० गेंद ; బంతి.

**हाल डोल** - पुं० గల్లంతు; ప్రకంపనము; భూకంపము.

**हालत** - स्त्री० దశ; పరిస్థితి; ఆర్థికదశ.

**हालना** - अ०क्रि० दे० हिलना.

**हालाँकि** - अव्य० यद्यपि ; అయినప్పటికి.

**हाला** - स्त्री० शराब ; మద్యము.

**हालात** - पु० हाल का बहु० పరిస్థితులు; స్థితిగతులు.

**हालिक** - पुं० వ్యవసాయదారుడు ; రైతు.

**हाली** - अव्य० తక్షణమే; पुं० వాడుకలోని నాణెము ; वि० నేటి.

**हाव** - पुं० మనోహరమైన ఆంగిక చేష్ట.

**हावभाव** - पुं० హావభావములు.

**हावी** - वि० నలువైపుల నుంచి చుట్టు ముట్టి వశపరచుకొనువాడు; కుశలుడైన.

**हाशिया** - पुं० తటము; అంచు.

**हाशिए का गवाह** - मु० దస్తావేజు చివరిలో జోడించబడిన సాక్షి.

**हाशिया चढाना** - मु० ఏదేని విషయములో మనోరంజనము కొరకు తగిన మాటను జోడించుట.

**हास** - पुं० हँसी ; నవ్వు; పరిహాసము.

**हासिद** - वि० ఈర్ష్యాపరుడు; శత్రువు; ఈర్ష్యాలుడు.

**हासिल** - वि० లభించియున్న; ప్రాప్తించిన.

**हास्यक** - पुं० चुटकुला ; చలోక్తి.

**हास्यास्पद** - पुं० హాస్యాస్పదమైనవాడు; పరిహాసింపబడువాడు.

**हाहाकार** - पुं० చీత్కారము; సాయము కొరకు ; బాధా జనితమైన చీత్కారము.

**हाही** - स्त्री० ఏదో కొంత పొందుటకై; 'హాయహాయ' అని అరచుట.

**हिकरना** - अ०क्रि० दे० हिनहिनाना.

**हिंकार** - पुं० హుంకారము; ఆవు అరచు శబ్దము.

**हिंगु** - पुं० हींग ; ఇంగువ.

**हिंगोट** - पुं० इंगुदी ; గారచెట్టు; గారపప్పు.

**हिंडोल; हिंडोला** - पुं० झूला ; ఊయల

**हिंद** - पुं० భారతదేశము; హిందుస్థానము

**हिंदवी** - स्त्री० హిందీభాష.

**हिंदी**-वि० భారతదేశమునకు సంబంధించిన; భారతదేశ నివాసి ; स्त्री० హిందుదేశపు భాష.

**हिंदुस्तानी** - वि० హిందుస్తానమునకు సంబంధించిన; पुं० హిందుస్తానపు నివాసి, హిందుస్తానపు భాష; జన సాధారణపు వాడుక భాష.

**हिवार** - पुं० హిమాని; మంచు; చలి.

**हिंस** - स्त्री० हिन हिनाहट ; గుఱ్ఱపు సకిలింపు.

**हिंस्र ; हिंस्रक** -वि० క్రూరమైన; హింసించు; హింసచేయు.

**हिआब** - पुं० दे० हिजाब.

**हिकमत** - स्त्री० విద్య; తత్త్వజ్ఞానము; యుక్తి; ఎత్తు; వైద్య శాస్త్రము.

**हिकमती** - वि० కార్యపటు; యుక్తిపరుడు; పొదుపుగల.

**हिकायत** - स्त्री० కథ; వృత్తాంతము.

**हिकारत** - स्त्री० नफरत ; ఏవగింపు; అగౌరవము; అప్రతిష్ఠ.

**हिक्का** - स्त्री० ఎక్కిలి; ఎక్కిళ్ళ రోగము.

**हिचक** - स्त्री० జంకు; సంకోచము.

**हिचकना** - अ०क्रि० జంకుట; సంకోచించుట.

**हिचकिचाना** - अ०क्रि० दे० हिचकना.

**हिचकिचाहट** - स्त्री० दे० हिचक.

**हिचकी** - स्त्री० ఎక్కిలి; ఉండి ఉండి ఎక్కి-ఎక్కి ఏడ్చుట.

**हिचकियाँ लगना**-मु० మరణాసన్నమగుట; చావు దగ్గరపడుట.

**हिचर मिचर** - स्त्री० आनाकानी ; పెడ చెవిని పెట్టుట; టాలాటోవ చేయుట.

**हिजडा** - पुं० నపుంసకుడు; కొజ్జా.

**हिजरत** - स्त्री० పరదేశనివాసము; కాందీశికునిగా పరదేశములో నివసించుట.

**हिजरी** - पुं० 15 జూలై 622 నుండి ప్రారంభమైన ముసల్మానుల సంవత్సరము; మహమ్మదు ప్రవక్త మక్కా వదలి మదీనా చేరిన తేదీ 15 జూలై 622.

**हिज्जे** - पुं० వర్ణక్రమము; ఉచ్చారస్వరము.

**हिज्र** - पुं० వియోగము; ఎడబాటు.

**हित** - पुं० లాభము; హితము; మంచి చేయు లేక కోరువాడు; वि० కొరకు; కై.

**हितकर ; हितकारक** - पुं० మంచి చేయునది లేక చేయువాడు; హితము చేయువాడు; ఆరోగ్యము కలుగచేయువాడు లేక చేయునది.

**हितचिंतक** - पुं० మంచిచేయువాడు ; మంచి కోరువాడు.

**हिताई** - स्त्री० नाता ; సంబంధము.

**हिताना** - अ०क्रि० అనుకూలించుట; ప్రేమ యుక్తమగుట.

**हिताहित** - पुं० మంచి-చెడు; హితాహితములు; లాభ-నష్టములు.

**हिती; हितू** - पुं० శుభము కోరు లేక చేయువాడు; సంబంధీకుడు; బంధువు; మిత్రుడు.

**हितैषी** - वि० శుభము కోరువాడు.

**हिदायत** - स्त्री० ఆదేశము; ఆదేశాత్మకమైన ఉపదేశము.

**हिनहिनाना** - अ०क्रि० గుఱ్ఱము సకిలింపు.
**हिना** - स्त्री० मेंहदी ; గోరింట.
**हिनाई** - वि० గోరింట ఎరుపు ; ఎఱ్ఱదనము; గోరింట రంగు కలసిన.
**हिनाबन्दी** - स्त्री० మహమ్మదీయులలో పెళ్ళికి ముందు పాటించు ఒక ఆచారము; గోరింట.
**हिफाजत** - स्त्री० రక్షణ; భద్రత; సంరక్షణ.
**हिब्बा** - पुं० గింజ; దానము.
**हिब्बाभर** - मु० బహుకొద్దిగా; అల్పముగా.
**हिब्बानामा** - पुं० దాన పత్రము.
**हिम** - पुं० మంచు; హిమము; చలి; చల్లని.
**हिमउपल** - पुं० వడగల్లు.
**हिमकर** - पुं० చంద్రుడు.
**हिमकिरण** - पुं० చంద్రుడు.
**हिमवान** - वि० మంచుగల; पुं० హిమాలయ పర్వతము; కైలాస పర్వతము; చంద్రుడు.
**हिमांशु** - पुं० दे० हिमकर.
**हिमाकत** - स्त्री० बेवकूफी ; మూర్ఖత; అనధికార చేష్ట.
**हिमानी** - स्त्री० తుషారము; మంచు; మంచు బండలు.
**हिमाम दस्ता** - स्त्री० ఇనప కల్వము; గూటము.
**हिमायत** - स्त्री० సమర్థన; పక్షపాతము.
**हिमायती** - वि० సమర్థించువాడు; సహాయము చేయువాడు; పక్షము వహించు.
**हिम्मत** - स्त्री० సాహసము; పరాక్రమము.
**हिम्मत हारना** - मु० సాహసము వదలుట ధైర్యము వీడుట.
**हिम्मती** - वि० సాహసముగల; సాహసి; పరాక్రమి.
**हिय ; हियरा** - पुं० హృదయము; మనస్సు.
**हिय हारना** - मु० సాహసము వీడుట; జంకుట.
**हिया** - पुं० హృదయము; మనస్సు.
**हिये का अंधा** - मु० అజ్ఞాని; మూర్ఖుడు.
**हिये की फूटना** - मु० బుద్ధిలేకపోవుట.
**हिये जलना**-मु० క్రోధముతో మండిపడుట
**हिये लगना** - मु० కౌగిలించుకొనుట.
**हिये पर लोन सा लगना** - मु० చాల చెడుగా అనిపించుట.
**हियाव** - पुं० సాహసము; స్థైర్యము.
**हियाव खुलना** - मु० సాహసము కలుగుట; గుండె నిబ్బరముగా నుండుట; జంకు వీడుట.
**हियाव पडना** - मु० సాహసోపేతముగా నుండుట.
**हिरण्य**-पुं० సువర్ణము; బంగారము; వీర్యము; ఉమ్మెత్త.

**हिरण्यनाभ** - पुं० విష్ణువు.
**हिरन** - पुं० हरिन ; లేడి.
**हिरन होजाना** - मु० పారిపోవుట.
**हिरनौटा** - पुं० లేడిపిల్ల; మృగశావకము.
**हिरफत** - स्त्री० హస్తకళ; విద్య; ధూర్తత; హస్తలాఘవము.
**हिरफत बाज** - वि० चालबाज ; టక్కరి.
**हिराना** - अ०क्रि० పోవుట; చేజారిపోవుట; మాయమగుట; లేకుండా పోవుట; स० क्रि० ధ్యాసలో. లేకపోవుట; మరచి పోవుట.
**हिरास** - स्त्री० నిరాశ; భయము; జంకు.
**हिरासत** - स्त्री० నిర్బంధము; ఖైదు.
**हिर्स** - स्त्री० లోభము; తృష్ణ; పోటీపడాలనే కోరిక.
**हिर्स छूटना** - मु० పేరాశపడుట.
**हिलकोर ; हिलकोरा** - पुं० అల; తరంగము.
**हिलग** - स्त्री० సాంగత్యము; కలుపుకోలు తనము; ప్రేమ.
**लगना** - अ०क्रि० అంటుకొనుట; కలసిపోవుట; చిక్కుట; ఆప్యాయత ఏర్పడుట.
**हिलगाना** - स०क्रि० చిక్కించుట; సాంగత్యము ఏర్పరచుట; పరిచయము; అనురాగము కలిగించుట.
**हिलना** -अ०क्रि० కదలుట; చంచలమగుట; పరిచయమగుట; అనురక్తమగుట.
**हिलना - डोलना** - मु० చలించుట; ప్రయత్నించుట.
**हिलना मिलना** - यौ० కూడా కూడా తిరుగుట; ఆప్యాయముగా నుండుట.
**हिलाना** - स०क्रि० కదిలించుట; కంపింప జేయుట.
**हिलोर ; हिलोरा** - पुं० అల; తరంగము.
**हिलोरे लेना** - मु० తరంగాయి తమగుట.
**हिलोल ; हिल्लोल** - पुं० తరంగము; ఆనంద తరంగము.
**हिस**-स्त्री०ఇంద్రియజ్ఞానము; ఇంద్రియాను భూతి పొందుట; సంవేదనము.
**हिसका** - पुं० ఈర్ష్య; పోటీ; ఇతరులనుండి ఏదేని వస్తువు లేక విషయమును పొందవలె ననే కోరిక.
**हिसाब** - पुं० గణితము; లెక్క; లెక్కింపు; వ్రాయబడిన ఆదాయ వ్యయముల పట్టిక; అంచనా; గణిత శాస్త్రము.
**हिसाब चुकाना या चुकता करना** - मु० ఇవ్వవలసిన బాకీ ఇచ్చివేయుట.
**हिसाब करना** - मु० दे० हिसाब चुकाना.
**हिसाब देना** - मु० జమా- ఖర్చుల వివరణ

**थूक देना** - పసందు చెయ్యకపోవుట; ఏవగించుట.

**थूकना** - ద్వేషించుట; ఏవగించుట; ఉమ్మి వేయుట.

**थूकने भी न आना** - పూర్తిగా తిరస్కరించి వదలివేయుట.

**थूक लगाना** - అవమానించుట.

**थूकसे सत्तू सानना** - నీచాతినీచమైనపొదుపు పాటించుట.

**थैली करना** - చితకబాది మూటకట్టుట.

**थोडा थोडा होना** - లజ్జపడుట; సంకుచితమగుట.

**थोडा बहुत** - కొద్ది; కొన్ని.

**थोडे ही- नहीं** - లేదు; కాదు.

**थोपडा सुजाना** - మూతి ముడుచుకొని యుండుట; కోపగించుట; అలుగుట.

## द

**दंग रह जाना या रहना** - ఆశ్చర్యమునొందుట; కలతజెందుట.

**दंगा-फसाद करना** - ఘర్షణపడుట; కొట్లాడుట.

**दंड डालना** - జుర్మానా వేయుట; పన్ను విధించుట.

**दंड भरना** - విధించిన శిక్షను అనుభవించుట; జుర్మానా కట్టుట.

**दई का घाला होना** - దురదృష్టవంతుడగుట.

**दकी का बाकी न रखना** - అన్ని యుక్తులు ప్రయోగించుట.

**दक्षिण होना** - అనుకూలించుట.

**दधिसुत-सुत** - విద్వాంసుడు; పండితుడు.

**दफा - दफान होना** - శాంతించుట.

**दबंग होना** - ప్రభావశాలియగుట.

**दबा लेना** - కాజేయుట.

**दबाव डालना** - ఒత్తిడి చేయుట.

**देबी बिल्ली का चूहे से कान कटाना** - ప్రతికూలపరిస్థితిలో దుర్బల వ్యక్తి కూడ పై చేయి అగుట.

**दबे पाँव निकल जाना** - చడీచప్పుడు చెయ్యకుండా జారుకొనుట.

**दम चढना** - శ్వాస త్వత్వరగా ఆడుట.

**दम चुराना** - ధ్యాసపెట్టక పోవుట.

**दम छोडना या छोड देना** - చనిపోవుట.

**दम झाँसा देना** - దగా చేయుట.

**दम तोडना** - అంతిమశ్వాస వదలుట.

**दम देना** - దారి తప్పించుట; దగా చేయుట.

**दम-पट्टी पढाना; दम-पट्टी पिलाना** - दे० दम झाँसा देना.

**दम फना होना** - స్పృహ లేకపోవుట.

**दम मारना** - అలసట తీర్చుకొనుట;

గంజాయి తాగుట.

**दम में आना** - దూపడుట.

**दम में दम आना** - మనస్సు స్థిరపడుట; శాంతించుట.

**दमामा पीटना** - ప్రచారము చేయుట.

**दर-किनार होना** - దూరమగుట.

**दर-गुजर करना** - నిర్లక్ష్యము చేయుట; క్షమించుట; తొలగించుట; ప్రక్కకు నెట్టివేయుట.

**दर-दर की धूल फाँकना** - అందరిచేత ఛీ అనిపించుకొనుట; దుర్దశాగ్రస్తమగుట.

**दरबार बाँधना** - లంచము నిర్ధారించుట.

**दरवाजा दिखाना** - ఇంటినుండి వెళ్ళగొట్టుట.

**दरवाजे पर नाक रगडना** - ముఖస్తుతి చేయుట.

**दर्द की दवा होना** - పనికి ఉపకరించుట.

**दलदल में गर्दन तक डूब होना** - కష్టాలలో కూరుకు పోవుట.

**दलदल में फँसना** - విపత్తులో చిక్కుకొనుట.

**दस्तंदाजी करना** - జోక్యము చేసుకొనుట.

**दस्तक बाँधना** - అనవసరమైన ఖర్చును నెత్తినవేయుట.

**दहलीज का कुत्ता** - వెంటుండువాడు.

**दही दही करना** - తన వస్తువును అమ్ముటకు వీధి వీధి తిరుగుట.

**दही में का मूसर होना** - పానకములో పుడక అగుట.

**दाँत काटी रोटी खाना** - గాఢమైన మైత్రి కలుగుట.

**दाँत खट्टे करना** - ఓడించుట.

**दाँत तले उँगली दबाना** - ఆశ్చర్య చకిత మగుట.

**दाँत तालू में जमना** - కష్టకాలమువచ్చుట.

**दाँत पर मैल न जमना** - బొత్తిగా పేద యగుట.

**दाँत पैने करना** - పొంచి ఉండుట.

**दाँत बजाना** - పోట్లాడుట.

**दाँत रखना** - ఈర్ష్య వహించుట; వైరము వహించుట.

**दाँतों में उँगली दबाना** - दे० दाँतों तले उँगली दबाना.

**दाई से पेट छिपाना** - ఎరిగినవాని దగ్గర రహస్యము దాచుట.

**दाग लगाना** - మచ్చవేయుట; కళంకితము చేయుట.

**दाढ गरम करना** - లంచము ఇచ్చుట.

**दाढी पेट में होना** - పిన్నవయస్సులోనే తెలివి వికసించుట.

**दाढी बनाना** - మోసగించుట.

**दाना-पानी उठना या उठ जाना** - ఏ దారి లేకపోవుట; నిరాధారమగుట.

**दाने दाने को तरसना** - నిష్ఠదరిద్రుడగుట.

**दाने बिखेरना** - మరిపించుటకు యుక్తులు పన్నుట.

**दाब दिखाना** - భయపెట్టుట; బెదిరించుట.

**दाम उठना** - అమ్ముడుపోవుట.

**दामनगीर होना** -వెంటపడుట; నెత్తికెక్కుట.

**दामन छुडाना** - కొంగు వదిలించుకొనుట.

**दामन पकडना** - శరణుజొచ్చుట.

**दायर करना** - వ్యాజ్యమువేయుట.

**दायाँ हाथ** - కుడిభుజము.

**दार पर चढाना** - ఉరికంబమెక్కించుట; ఉరితీయుట.

**दाल न गलना** - యుక్తిపారకపోవుట.

**दाल-भात का कौर समझना** - చాలా సులభమని తలచుట.

**दाल-भात में मूसलचंद बनना** - పానకములో పుల్లయగుట.

**दाल में कुछ काला होना ; दाल में कुछ काला-काला होना** - శంకించుట; అనుమానము కలుగుట.

**दाँव खेलना** - మోసగించుట.

**दाँव पर रखना** - పందెము ఒడ్డుట.

**दाँव-पेंचका आदमी** - చతురుడు; దగాకోరు.

**दिक करना** - వేధించుట.

**दिन को तारे दिखाई देना** - కష్టసమయమున బుద్ధి పని చెయ్యకపోవుట.

**दिन चढना** - పొద్దెక్కుట.

**दिन छिपना या डूबना** - సూర్యుడు అస్తమించుట.

**दिन ढलना** - సాయంత్రమగుట.

**दिन दहाडे** - పట్టపగలు.

**दिन दूना रात चौगुना होना** - త్వరత్వరగా అభివృద్ధినొందుట.

**दिन भारी होना** - చెడుకాలము వచ్చుట.

**दिन होना** - సూర్యోదయమగుట.

**दिनों को धक्के देना** - రోజులు గడవకపోవుట; అతి కష్టమీదకాలము గడుచుట.

**दिमाग खपाना** -ఎక్కువగా ఆలోచించుట.

**दिमाग खाना** - ఎక్కువ మాట్లాడి విసిగించుట.

**दिमाग चढना** - విర్రవీగుట; నిక్కుట.

**दिमाग झडना** - అభిమానము వీగిపోవుట.

**दिल उचाट होना** - दे० जी उचटना.

**दिल ओंटों तक आना** - అతిగా గాబరా పడుట.

**दिल कडा करना** - గుండె నిబ్బరము చేసుకొనుట.

**दिल का खरा** - నిజాయితీపరుడు.

**दिल का बादशाह** - ఇష్టానుసారము వ్యవహరించువాడు; అతి వ్యయపరుడు.

**दिल का बुखार निकालना** - అక్కసుతీర్చుకొనుట.

**दिल की गाँठ खुलना** - వైమనస్యము నశించుట.

**दिल की दिल में रहना** - కోరికతీరక పోవుట.

**दिलकी हवस निकलना** - కోరికతీరుట.

**दिल के फफोले फूटना** - మనస్తాపము నశించుట.

**दिल को मसोसना** - మనస్తాపమును మనస్సులోనే ఉంచుకొనుట.

**दिल खटक जाना या खटकना** - సందేహము కలుగుట; అనుమానము కలుగుట; నిశ్చయము జారిపోవుట.

**दिल खट्टा करना** - చెడుభావము కలుగుట; ఏవగింపు కలుగుట.

**दिल खट्टा होना** - ఏవగింపు కలుగుట; మనస్సు విముఖమగుట.

**दिल चुटकी लेना** - వెక్కిరించుట; వ్యంగ్యముగా మాట్లాడుట.

**दिल चुराना** - మోహించుట; పనిలో మనస్సులేకపోవుట.

**दिल जमई करना** - ఓర్చుకొనుట; సంతోషించుట.

**दिल जमना** - మనస్సు లగ్నమగుట.

**दिल जलाना** - ఈర్ష్యపడుట; కష్టపెట్టుట; వెక్కిరించుట; కోపము తెప్పించుట.

**दिलजोई करना** - ఓదార్చుట.

**दिल ठंडा होना** - ఉత్సాహము లేకపోవుట.

**दिल ठिकाने लगाना** - మనస్సును కుదుట పర్చుకొనుట.

**दिल डूबना या डूब जाना**- మూర్ఛపోవుట; గాబరాపడుట; ఉత్సాహము లేకపోవుట.

**दिल दहलना** - భయముతో మనస్సు కంపించిపోవుట.

**दिल पर पत्थर रखना** - దుఃఖమును సహించుటకు మనస్సును చిక్కబట్టుకొనుట.

**दिल पर मैल आना** - ద్వేషము కలుగుట; ప్రేమ లేకపోవుట.

**दिल पर साँप लोटना** - శోకించుట.

**दिल पसीजना या पसीज जाना** - మనస్సు కలుగుట; జాలిపడుట..

**दिल बहलना** - दे॰ जी बहलना.

**दिल बासों उछलना** - గాబరాపడుట.

**दिल बुझना** - హతోత్సాహమగుట.
**दिल बैठ जाना** - మనస్సు వ్యగ్రమగుట; ఉత్సాహము లేకపోవుట.
**दिल भटकना** - మనస్సు చంచలమగుట.
**दिल भरजाना या भरना** - ముఖము మొత్తుట; కోరిక లేకపోవుట.
**दिल मसोसकर रहजाना-दिल मसोसना;** కోపమును దిగమ్రింగి ఉండుట.
**दिल में आग लगना** - అశాంతమగుట.
**दिल करार होना** - మనశ్శాంతి కలుగుట.
**दिल में फफोले पडना** - ఎక్కువగా దుఃఖము కలుగుట; గుండెమండుట.
**दिल से दूर करना** - ధ్యాసలేకపోవుట; మరచిపోవుట.
**दिल्लगी उडाना** - వేళాకోళము చేయుట; పరిహాసము చేయుట.
**दिवाला निकलना** - నష్టము వచ్చుట; దివాళా తీయుట.
**दिशा जाना** - బహిర్భూమికి వెళ్ళుట.
**दिसावर उतरना** - విదేశములలో వస్తువులు చౌకఅగుట.
**दीठ उतारना** - దిష్టితీయుట.
**दीठ करना** - చూచుట.
**दीठ खा जाना** - దిష్టికొట్టుట.
**दीठ पर चढना** - నచ్చుట; మంట కలుగుట.
**दीठ भर देखना** - బాగుగా చూచుట.
**दीठ मिलना** - ఎదుట పడుట.
**दीठ लगना** - దిష్టికొట్టుట.
**दीठ लगाना** - దిష్టి కొట్టించుట.
**दीदा-दलेल होना** - నిర్లజ్జమగుట.
**दीदा फाडकर देखना** - ఏకాగ్రతతో చూచుట.
**दीदा लगना** - మనస్సుకు నచ్చుట.
**दीदे का पानी ढल जाना** - సిగ్గులేని వాడగుట.
**दीदे निकालना** - కళ్ళురిచేయుట; కోపించుట; కళ్ళు పీకుట.
**दीन-दुनिया की खबर न होना** - ప్రపంచానికి బొత్తిగా తెలియకపోవుట.
**दीपक बुझना** - నిర్వంశమగుట; వంశానికి వంశం నాశమగుట.
**दीया जलाना** - దివాళా తీయించుట.
**दीया जलाने का समय**-సంధ్యాసమయము.
**दीया ठंडा करना** - దీపమార్పుట.
**दीये का हँसना** - దీపమునుండి పూలు రాలుట; వివాహము అగు సూచన లేక సంతానము కలుగు సూచన అగుట.
**दीवार उठाना** - గోడకట్టుట.
**दीवार में चुनना** - బతికి ఉన్న మనిషిని గోడలో ఉంచి కట్టుట.

**दीवार चाटना** - కాలము గడుపుట.

**दुआ माँगना** - ప్రార్థించుట.

**दुआ लगना** - ప్రార్థన ఫలించుట.

**दुकान उठाना** - దుకాణము మూయుట.

**दुकान करना** - దుకాణము పెట్టుట; దుకాణము తెరచుట.

**दु:ख का घूँट पीना** - దుఃఖమును మెదల కుండా సహించుట.

**दुखडा पीटना** - అతి కష్టముమీద జీవనము చేయుట.

**दु:ख-बटाना** - కష్టసమయములో వెంట నుండుట.

**दु:ख-दर्द में शरीक होना** - కష్టము సాయము చేయుట.

**दुनियाँ उजडना** - సర్వస్వము నాశమగుట.

**दुनियाँ की हवा लगना** - ప్రాపంచక విషయముల జ్ఞానము కలుగుట.

**दुनियाँ दारी की बात** - కృత్రిమ విషయము; మోసపూరిత విషయము; వ్యవహార సంబంధమైన విషయము.

**दुनियाँ देखना** - అనుభవము గడించుట.

**दुपट्टा तानकर सोना** - నిశ్చింతగా నిద్రించుట.

**दुम दबा कर भागना** - తోకముడుచుకు పారి పోవుట.

**दुम में घुसा रहना** - ఎల్లప్పుడు ముఖస్తుతి చేయుట.

**दुर-दुर करना ; दुर-दुराना** - అవమానించి పారద్రోలుట.

**दुलत्ती झाडना** - వెనక రెండుకాళ్ళు ఎత్తి తన్నుట (గాడిద, గుఱ్ఱము).

**दुशाले में लपेट कर मारना** - తియ్య తియ్యని వ్యంగ్య వాక్యములతో వేధించుట.

**दुहाई देना** - తనను రక్షించుమని ప్రార్థించుట; పాలు పితుకుటకు మజూరి ఇచ్చుట.

**दूज का चाँद होना** - అరుదుగా కనిపించుట; దుర్లభమైన వస్తువగుట.

**दूधका धोया** - కళంకములేకుండా; మచ్చ లేని; నిష్కళంకమైన.

**दूधकी कुल्लियाँ करना** - సుఖవైభములతో ఓలలాడుట.

**दूध की मक्खी** - పనికిమాలిన వస్తువు.

**दूध देनेवाली गाय की लात खाना** - లాభము కలుగజేయువాని చివాట్లు సహించుట.

**दूध के जले का मट्ठा फूँक -फूँक कर पीना** - పెద్ద నష్టము పొందిన తరువాత సాధారణమైన పనిలో కూడ జాగ్రత్త పడుట.

**दूध तोडना** - పాడి అయిపోయిన తరువాత ఆవులు-గేదెలు ఎండిపోవుట.

**दूध पीता बच्चा** - చంటి పిల్లవాడు.

**दून की सूझना** - సామర్థ్యమును మించి ఆలోచించుట.

**दूर की हाँकना** - గొప్ప గొప్ప విషయములు చెప్పుట; కోతలు కోయుట.

**दूर के ढोल सुहावने होना** - దూరపు కొండలు నునుపుగా ఉండుట.

**दूर ही से सलाम करना**- దూరముగానుంచే తిరస్కరించుట; ఏవగించుట.

**दूसरों के घर में आग लगाकर हाथ सेंकना** - ఇతరులకు నష్టము కలిగించి తను లాభము పొందుట.

**दूसरों के सिर ठीकरा फोडना** - ఇతరులను దోషులుగా ధ్రువపరచుట.

**देखते ही देखते** - వెంటనే; తక్షణమే.

**देखा जाना** - తరువాత ఆలోచించుట.

**देवता कूच कर जाना** - ఎక్కువగా భయ పడుట.

**देश-निकाला देना** - దేశ బహిష్కరణ దండన విధించుట.

**दो आँसू बहाना** - దుఃఖము వ్యక్తము చేయుట; కొద్దిగా ఏడ్చుట.

**दो कौडी का** - తుచ్ఛమైన.

**दोटूक** - స్పష్టముగా; స్పష్టమైన.

**दोटूक जवाब देना** - మంచి-చెడు చూడ కుండా స్పష్టమైన సమాధాన మిచ్చుట.

**दो दिन का मेहमान** - అనతికాలములో చనిపోవువాడు; త్వరగా ఎక్కడికైన వెళ్ళు వాడు.

**दो दो हाथ करना** - పోట్లాడుట; కొట్లాడుట.

**दो नावों पर चढना ; दो नावों पर पैर रखना** - పరస్పర విరుద్ధమైన రెండు పనులు ఒకే పర్యాయము చేయుట.

**दौड-धूप करना या मचाना** - అతిగా ప్రయత్నించుట; శ్రమించుట.

**दौरा आना** - రోగము తిరగ బెట్టుట.

**दौरा करना** - తనిఖీ చేయుటకు తిరుగుట.

**द्वारा खुलना** - యుక్తిపని చేయుట.

**द्वारचार होना** - ద్వారపూజగుట; పెళ్ళి వారు కన్యాదాత ఇంటికి పెళ్ళికి ముందుగా వచ్చుట.

## ध

**धँधले में आना** - ఇతరుల మోసములో చిక్కుకొనుట.

**धकेल देना** - నెట్టి పడవేయుట.

**धक्कम - धक्का करना** - గుంపులో జనము తోపులాడుకొనుట.

**धक्का खाना** - హాని భరించుట; ఎదురు దెబ్బతినుట.

**धजा हो जाना** - బక్కచిక్కుట; ముక్కలు ముక్కలుగా అగుట.

**धज्जियाँ उडना** - దుర్దశాగ్రస్తమగుట; అగౌరవము కలుగుట.

**धज्जियाँ उडाना** - నిందించుట; ముక్కలు చేయుట.

**धडक खुलना** - సంకోచము పోవుట.

**धडल्ले के साथ** - నిస్సంకోచముగా; శీఘ్రముగా.

**धडी-धडी करके लूटना या लूट लेना** - భాగా దోచుకొనుట.

**धडी भरना** - తూచుట.

**धत बनना, धत होना** - వెళ్ళిపోవుట.

**धता करना** - తొలగించుట.

**धतूरा खाए फिरना** - మస్తుగా తిరుగుట; పిచ్చివానిగా తిరుగుట.

**धन उडाना** - దూబరా ఖర్చుచేయుట.

**धनिये की खोपडी में पानी पिलाना** - ఎక్కువ వ్యాకులపడుట; దాహముతో చంపుట.

**धन्नासेठ का नाती** - ఎక్కువ డబ్బు లేకపోయిన సంపన్నుడువలె వ్యవహరించుట (వ్యంగ్యము).

**धन्नासेठ होना** - అధిక సంపన్నుడగుట; తనని తను మహా ధనికునిగా భావించువాడు.

**धब्बा लगना** - మచ్చపడుట; అపకీర్తి కలుగుట.

**धमा-चौकडी मचाना** - అతిగా కోలాహలము చేయుట.

**धरती पर पाँव न पडना** - భూమిమీదకాళ్ళు పడకుండుట; ఆనందముతో విర్రవీగుట.

**धरना देना** - ఏదేని సాధించుటకు మొండిగా పాతుకు కూర్చొనుట.

**धरा रह जाना** - వ్యర్థముగా ఉండిపోవుట; అవసరానికి పనికివచ్చుట.

**धाक जमना** - ప్రభావము పడుట; ప్రభావితము చేయుట.

**धागा देना** - మోసగించుట; దగా పరచుట.

**धाडा मार कर रोना** - అరుస్తూ ఏడ్చుట; తీవ్రముగా విలపించుట.

**धार चढाना** - పదును పెట్టుట.

**धार मारना** - మూత్ర విసర్జన చేయుట.

**धावा बोलना** - ఆక్రమించుటకు ఆదేశమిచ్చుట; ఆక్రమణ చేయుట.

**धावा मारना** - త్వర త్వరగా దూరము వెళ్ళుట.

**धींगा-धींगी करना** - బలాత్కారించుట; ఉపద్రవము చేయుట.

**धीरज बँधाना** - ఓదార్చుట; ధైర్యము కలిగించుట.

**धुआँ-धक्कड करना** - ధూమపానము చేయుట.

**धुएँ का धरोहर** - త్వరగా నాశమగు; నశ్వరమైన.

**धुए के बादल उडाना** - గప్పాలుకొట్టుట; ధూమపానము చేయుట.

**धुन बाँधना** - సంకల్పించుట.

**धुन सवार होना** - చెయ్యాలని వెర్రి సంకల్పము చేయుట.

**धूप खाना** - ఎండలో కూర్చొనుట.

**धूप में बाल सफेद न करना** - అనుభవజ్ఞుడగుట.

**धूप उडाते फिरना** - కష్టాలు పడుతూ తిరుగుట.

**धूल उडना** - అపకీర్తి కలుగుట.

**धूल झाडना** - దుమ్ముదులుపుట; దేహశుద్ధి చేయుట.

**धूल फाँकना** - నోట్లోమట్టికొట్టుకొనుట; కష్టాలు అనుభవించుట; అబద్ధమాడుట.

**धूल में मिलाना** - నాశము చేయుట.

**धोखा पडना** - భ్రమపడుట.

**धोखे की टट्टी** - చూడడానికి మంచిగా, కాని నిజానికి చెడుగా నుండుట.

**धोते दीली होना** - భయపడుట.

**धोबी का कुत्ता होना** - అక్కరకు రాకుండుట; పనికిమాలిన.

**ध्यान रखना** - ధ్యాస ఉంచుట.

## न

**नंगा कर देना** - అగౌరవపర్చుట.

**नंगा-धडंगा**- బొత్తిగా దిశా; వివస్త్రము

**नंबर दागना** - స్త్రీతో సంభోగించుట.

**नकेल हाथ में होना** - వశమగుట ; కళ్ళెము చేతిలో నుండుట.

**नक्कार खाने में तूती की आवाज होन** ఎంతమాత్రము ప్రభావము లేకపోవు పెద్దగలభాలో వినిపించకపోవుట.

**नक्कू बनना** - తనని గొప్ప అనుకొను అహంకరించుట.

**नक्शा जमना या जमा होना** - ప్రభావ పడుట.

**नखरा-तिल्ला करना** - ఒయ్యారము పోవుట.

**नखास की घोडी** - వేశ్య.

**नखास पर भेजना** - బజారులో అమ్ము బోవుటకు పంపుట.

**नगाडा बजना** - చాటింపు అగుట.

**न घर का होना न घाट का होना** - రెండు విధాల నష్టము కలుగుట.

**नजर आना** - కనిపించుట.

**नजर उतारना** - దిష్టితీయుట.

**नजर करना** - కానుక సమర్పించుట; దృష్టిఉంచుట; సంరక్షించుట.

**नजर पर चढना** - నచ్చుట; అప్రియమగుట.

**नजर बंद करना** - ఖైదు చేయుట.

**नजर मारना** - వక్రచూపులతో చూచుట; కనుసైగచేయుట.

**नजरों में खटकना** - అప్రియమగుట.

**न तीन में न तेरह में होना** - ఎక్కడా లేకుండుట; ఏ శ్రేణిలోనూ లేకుండుట.

**नथनों में दम करना** - दे० नाकों दम करना.

**नपी तुली बात कहना** - ఆచి తూచి చెప్పుట; అవసరానికి సరిపడ చెప్పుట.

**नमक अदा करना** - కృతజ్ఞతతో ఉండుట.

**नमक का हराम होना** - కృతఘ్నతతో నుండుట; తినకుండుట.

**नमक का हलाल होना** - కృతజ్ఞతతో నుండుట.

**नमक मिर्च मिलाना ; नमक मिर्च लगाना** - అలవలు-చిలవలు చేసి చెప్పుట.

**नमक हराम** - కృతఘ్నుడు.

**[illegible]** - కృతజ్ఞుడు.

**नमकीन होना**-చాలా అందముగా నుండుట; బాగుగా నుండుట.

**नया गुल खिलना** - అద్భుతమైన సంఘటన సంభవించుట.

**नरम-गरम उठाना** - సుఖ-దుఃఖములు సహించుట.

**नल चलना** - గారడీద్వారా దొంగలకు జాడతెలియుట.

**नशा उतरना** - గర్వము భంగమగుట.

**नशे का किर किरा हो जाना** - పానకములో పుడక అగుట; నిశామజా చెదిరిపోవుట.

**नशा हिरन हो जाना** - నిశాహఠాత్తుగా జారిపోవుట.

**नस ढीली पडना**-అలసిపోవుట; నపుంసకుడగుట.

**नस-नस का पता होना** - అంతాబాగుగా తెలియుట; అణువు అదునును పసికట్టుట.

**नस-नस में** - శరీరమంతటా.

**नसीब आजमाना** - అదృష్టమును పరిక్షించుట; శక్తిని పరిక్షించుట.

**नसीब चमकना** - యశస్సు వ్యాపించుట; అదృష్టము ప్రకాశించుట.

**नसीब होना** - ప్రాప్తించుట; లభించుట.

**नसीहत मिलना** - విద్యలభించుట;

ఉపదేశము ప్రాప్తించుట.

**नसें ढीली पडना** - అలసిపోవుట.

**नहार तोडना** - ఫలహారము చేయుట.

**नहारू केलिए गाय मारना** - చిన్నపని కొరకు పెద్ద అఘాయిత్యము చేయుట.

**नाक ऊँची होना** - ప్రతిష్ఠ ఇనుమడించుట.

**नाक कटना** - అప్రతిష్ఠకలుగుట.

**नाक काटना** - అగౌరవము కలిగించుట.

**नाक का बाल** - గాఢమైన స్నేహితుడు లేక సలహాదారుడు; బహు ఇష్టుడు.

**नाक के बाल नचाना** - ఎక్కువగా వ్యాకుల పరచుట.

**नाक चढना** - కోపించుట; ఏవగించుట.

**नाक चढाना** - ఏవగించుట.

**नाक ढाई हाथ की होना** - అతిగా అవమానించుట.

**नाक पकड कर घुमाना** - ఇష్టమొచ్చినట్లు పనిచేయించుట.

**नाक पर गुस्सा होना** - ముక్కుమీద కోపముండుట; మాటిమాటికి కోప గించుట.

**नाक पर मक्खी न बैठने देना** - బహు నిజాయితీగా నుండుట.

**नाक बहना** - రొంప పట్టుట; చీమిడి కారుతూ ఉండుట.

**नाक-भौ चढाना;नाक-भौ सिकोडना** - ఏవగించుట.

**नाक में नकेल डालना** - ముక్కుతాడు వేయుట; అతిగా వ్యాకులపరచుట.

**नाक में दम होना** - ఎక్కువగా వ్యాకుల పడుట.

**नाक रख लेना** - గౌరవమును రక్షించు కొనుట.

**नाक रगडकर रह जाना** - ప్రయత్నించి కూడా సాఫల్యము పొందలేకపోవుట.

**नाक रगडना** - ముఖస్తుతి చేయుట.

**नाक से आगे न देख पाना** - అతి సంకు చితమైన దృష్టి కలిగి యుండుట.

**नाकों आना** - వ్యాకులపడుట.

**नाकों चने चबवाना** - అతిగా వ్యాకుల పరచుట.

**नाखून नीले होना** - మరణాసన్నమగుట.

**नागवार गुजरना** - అప్రియమగుట.

**नागा करना** - గైరు హాజరగుట.

**नाज करना** - గీరపోవుట; గర్వించుట; నిక్కుట.

**नाडी खोलना** - సంభోగించుట.

**नाडी चलना** - నాడి ఆడుట; జీవించి యుండుట.

**नाता टूटना** - సంబంధ విచ్ఛేదమగుట.

**नादरी चढाना** - పూర్తిగా ఓడించుట.

**नानी का घर होना** - సుఖము కలిగించు ఇల్లగుట; అమ్మమ్మ ఇల్లగుట.

**नानी मर जाना; नानी याद आना या आजाना** - స్పృహలేకపోవుట; బెంగ పడుట; విలపించుట.

**नाम उछालना** - అప్రతిష్ఠ కలుగచేయుట.

**नाम उठना** - పేరుకేనుండుట; అప్రతిష్ఠ కలుగుట; చనిపోవుట.

**नाम करना** - పని బాగుగా చేయుట; పేరు పొందుట; ప్రతిష్ఠ పొందుట.

**नाम को** - నామ మాత్రానికి; కొద్దిగా.

**नाम को नही** - ఒక్కటి కూడా లేదు; ఒక్కడు కూడా లేడు.

**नाम को थूवाना** - ఏవగించుట; చీదరించుట.

**नाम चमकना** - యశస్సు వ్యాపించుట.

**नामजद करना** - ఎన్నుకొనుట.

**नाम डुबोना** - కళంకితము చేసుకొనుట; గౌరవము పోగొట్టుకొనుట.

**नाम निकलना** - ఏదేని విషయములో పేరు పొందుట.

**नाम निकालना** - దోషిని బయటపెట్టుట; పేరు బయట పెట్టుట.

**नाम पर जान देना** - మర్యాద కొరకు ప్రాణ త్యాగము చేయుట.

**नाम बाकी रहना या होना** - పేరు మాత్రము ఉండుట; కీర్తి మాత్రము శేషించి యుండుట.

**नाम-लेवा, पानी-देवा न रहना** - వంశములో ఏమీ లేకపోవుట.

**नाम होना** - పేరు కలుగుట; ప్రసిద్ధి నొందుట.

**नामो-निशाँ न होना** - పూర్తిగా ధ్వంసమగుట; సమూలము వినష్టమగుట.

**नारदी विद्या** - కలహములు పెట్టు అలవాటు.

**नालिश करना** - దావా వేయుట.

**नाव डूबना** - ఎక్కువగా నష్టము కలుగుట.

**नाव में खाक उडाना** - అవసరముగా కళంకము రుద్దుట; తలాతోకలేని మాటలు మాట్లాడుట.

**निकल चलना** - వృద్ధిచెందుట.

**निगाहबानी करना** - కాపలా కాయుట; సంరక్షించుట.

**निज करके** - అవశ్యము; తప్పకుండా.

**निन्नानवे के फेर में पडना** - డబ్బుప్రోగు చేయుపనిలో నిమగ్నమగుట.

**निबट जाना** - తీరికపొందుట; భోగించుట.

**निबाह देना** - నిర్వహించుట; ఏదో విధముగా జీవనము చేయుట.

**निबुआ-नोन चटा देना या चाटना** - ఏమీ ఇవ్వకపోవుట; ఏమీ పొందకపోవుట.

**निसार करना-निछावर करना** - సమర్పించుట; దిగతుడుచుట.

**निहाल होना** - ప్రసన్నచిత్తమగుట; సంతుష్టమగుట.

**निहोरा मानना** - కృతజ్ఞతతోనుండుట.

**नींद का दुखिया** - నిద్రబోతు (వ్యంగ్యము); ఎక్కువగా నిద్రించువాడు.

**नींद हराम होना** - బొత్తిగా నిద్రించక పోవుట.

**नीचा खाना** - సిగ్గునొందుట; ఓడిపోవుట; తిరస్కృతమగుట.

**नीठ नीठ कर के-** ఏదోవిధముగా; ఎలాగోలా.

**नीम लगाकर आम खाना** - చెడు పనిచేసి మంచి ఫలము పొంద నాశించుట.

**नीयत डावाँडोल होना** - నిజాయితీలో తేడా వచ్చుట.

**नीयत बद होना** - చెడు ఆలోచన కలిగి యుండుట.

**नीर ढल जाना** - నిర్లజ్జుడగుట.

**नील का खेत होना** - కళంక ప్రదేశమగుట.

**नील की सलाई फिर वा देना** - కళ్ళు పోగొట్టుట; గుడ్డివానిగా చేయుట.

**नील बिगडना** - చెడు పుకారు వ్యాపించుట; హానికలుగుట; ఆచరణచెడుగా మారుట.

**नीलम पर चढना** - వేలమగుట.

**नींव का पत्थर होना** - పునాది రాయి అగుట; మూలాధారమగుట.

**नींव जमाना** - ప్రారంభించుట.

**नुकताचीनी करना** - దోషములు ఎత్తి చూపుట.

**नुकीला स्वर** - తీవ్రమైన స్వరము.

**नूर का तडका-** పెందలకడ; తెల్లవారజాము.

**नेकी कर कुएँ में डालना** - మేలు చేసి మరిచిపోవుట.

**नेग करना** - శుభ ఘడియలో ప్రారంభించుట.

**नेवता फिरना** - ఇంటి-ఇంటికివెళ్ళి ఆహ్వానించుట.

**नोन-तेल-लकडी की चिंता** - సంసార నిర్వహణ; చింత.

**नौ-दो-ग्यारह होना** - తక్షణమే వెళ్ళి పోవుట.

**नौबत आ जाना** - స్థితి చెడిపోవుట.

**नौबत बजाकर** - చాటింపువేసి.

## प

**पंक का पंकज होना** - మట్టిలో మాణిక్యమగుట.

**पंख में पडना** - ఆపదలో చిక్కుకొనుట.

**पंख जमना** - చావుదగ్గర పడుట.

**पंच की भीख** - అందరి దయ; సార్వజనిక చందా.

**पंजर पंजर ढीला होना** - అపరిమితముగా అలసిపోవుట.

**पंच देखना ; पंच सेना - राह देखना ;** వేచియుండుట.

**पंजा-छक्का करना** - జూదమాడుట.

**पकवाई देकर कच्चा खाना** - డబ్బు ఖర్చు పెట్టిన మీదట కూడ పనిపాడై పోవుట.

**पक्का कागज** - టికెట్టుకు సంబంధించిన కాగితము.

**पक्का पान होना** - చాలా ముసలివాడగుట.

**पगडी उछालना** - వేళాకోళమాడుట.

**पगडी उतारना** - గౌరవము పాడుచేయుట.

**पगडी बदलना** - స్నేహము చేయుట.

**पगडी में फूल रख जाना** - అప్రతిష్ఠ పాలుచేయుట.

**पटक देना** - నేలకేసి కొట్టుట; అవమానించుట.

**पटरी जमाना** - పని సాధించుట; పనిసాధించుటకు పొంచియుండుట.

**पटरी पर आना** - సరైన దారికి వచ్చుట.

**पटाका जमाना** - చెంపకాయ కొట్టుట.

**पट्टी पढना** - మోసము నేర్చుకొనుట.

**पट्ठा जवान** - బలమైన యువకుడు.

**पट्ठा-पछाड** - ప్రబలమైన స్త్రీ.

**पड मरना** - జీవిత పర్యంతము తోడు వదలకుండుట.

**पतंगे लगना** - నిప్పంటుకొనుట; తీవ్రముగా కోపమొచ్చుట.

**पत उतारना** - అవమానపరచుట.

**पत पानी** - ప్రతిష్ఠ; గౌరవము.

**पतला कान** - దేనిదైననూ త్వరగా నమ్మువాడు.

**पताका उडना** - అధికారమగుట; అందరి కంటెగొప్ప అగుట; ప్రసిద్ధినొందుట.

**पतंगा होना** - గొప్ప ప్రేమికుడగుట.

**पते का** - తెలిసినవాడు; జ్ఞాని.

**पते की** - చాలా గొప్ప; మహత్వ పూర్ణమైన.

**पत्ता खडकना** - ఆకు చప్పుడగుట.

**पत्ता तोडकर भागना** - నెత్తినకాళ్ళు పెట్టుకొని పారిపోవుట.

**पत्ता हो जाना** - పారిపోవుట.

**पत्थर की लकीर**-శాశ్వతముగా నుండునది.

**पत्थर छाती पर धरना** - మనస్సును బలవంతముగా ఆపుకొనుట; ఓర్చుకొనుట.

**पत्थर को जोंक लगाना** - అసంభవమైన కార్యము చేయుట.

**पत्थर बरसना** - వడగళ్ళు పడుట.

**पनीर चटाना** - పని సాధించుటకు ముఖ స్తుతి చేయుట.

**परदाकाश होना** - గుట్టురట్టగుట.

**परले सिरे का** - మొదటి తరగతికి చెందిన.

**परवान चढना** - పెళ్ళి అగుట; ఆయుర్దాయము సంపూర్ణమగుట.

**पराये घर की होना** - బాలికకు పెళ్ళి అగుట.

**परे बैठना** - దూరముగా కూర్చుండుట; వేరుగా కూర్చుండుట.

**परोसा थाल होना** - సరళ కార్యమగుట.

**पलक-पाँवडे बिछाना** - ఆదరముగా స్వాగతమిచ్చుట.

**पलक लगना** - కునుకుపట్టుట.

**पलकों से नमक उठाना** - ప్రేమపూర్వముగా సేవించుట; పీనాసితనము పోవుట.

**पल्ला पकडना** - విశ్వసించుట.

**पल्ला पार होना** - పనిపూర్తిఅగుట.

**पल्ले पडना** - బాధ్యతలోనికి వచ్చుట; భాగము లోనికి వచ్చుట; వివాహమగుట.

**पल्लेपर आना** - మకురుపట్టు పట్టుట.

**पशम न उखाडना** - ఏమీ చెయ్యలేకపోవుట.

**पशोपेश करना**-వెనకముందు గుంజులాడుట; సంకోచించుట; సంశయించుట.

**पसीने की कमाई** - కష్టార్జితము.

**पस्त करना** - ఓడించుట; పడవేయుట.

**पहल करना** - ఏదేని పనిని ప్రారంభించుట

**पहाड हो जाना** - భారమగుట; కష్టము మీద గడుచుట.

**पहेली बुझाना** - డొంకతిరుగుడుగా చెప్పుట.

**पाँचों ऊँगली घी में होना** - ఆనందముతో సుఖముగా కాలము గడచుట.

**पाँचों उँगली बराबर न होना** - ఐదు వేళ్ళు సమానముగా ఉండవు; అందరు సమానముగానుండరు; అంతా సమానముగా ఉండదు.

**पाँव अडाना** - కాలు అడ్డంపెట్టుట; ఆటంకము కలిగించుట.

**पाँव उखड जाना** - అస్థిరముగానుండుట; ఓడిపోవుట.

**पाँव-खाक होना** - తనని పనికిమాలిన వానిగా భావించుట; ఇంకొకరి అధీనములో నుండుట.

**पाँव टूटना** - ఎక్కువగా అలసిపోవుట.

**पाँव निकालना** - భ్రష్టాచారము చేయుట; నియమోల్లంఘన చేయుట.

**पाँव पडना** - దీనముగా ప్రార్థించుట.

**पाँव फिसलना** - కాలుజారుట; తప్పు చేయుట; ఆచరణ సంబంధమైన తప్పు

చేయుట.

**पाँव फूँक-फूँक कर रखना** - ఆలోచించి ఆలోచించి ముందుకు సాగుట.

**पाँव फूलना** - అధికముగా భయపడుట; అలసిపోవుట.

**पाँव फैलाकर सोना** - కాళ్ళు జాచుకుని పడుకొనుట; నిశ్చింతగా నిద్రించుట.

**पाँव फैलाना** - ఇంకా పొందుటకు మొండి పట్టు పట్టుట.

**पाँव मुरीद** - ఆజ్ఞను పాటించువాడు.

**पाँव में मेहंदी पडना** - నడకలో జాగు చేయుట.

**पाँव साबित रखना** -ధైర్యము వీడకుండుట; లొంగకుండుట.

**पाँसा उलटना** - పరిస్థితి మారుట.

**पाक करना** - శుద్ధిచేయుట; ముగించుట.

**पाकेट गरम करना** - లంచము పుచ్చుకొనుట.

**पान देना** - ప్రతిజ్ఞచేయించుట; 'ఊ' అనిపించుట.

**पानी उतारना** - అవమానించుట.

**पानी की तरह साफ होना** - పూర్తిగా స్పష్టమగుట.

**पानी का बतासा** - నీటి బుడగ.

**पानी के मोल** - కారుచౌకగా.

**पानी खुलना** - వర్షము ఆగిపోవుట.

**पानी को भी न पूछना** - ఎంతమాత్రము గౌరవించకపోవుట.

**पानी ढलना** - వయసుమళ్ళుట; లావణ్యము, తళుకు - బెళుకు లేకపోవుట.

**पानी देना** - నీళ్ళొదులుట; పూర్వీకులకు తర్పణ చేయుట.

**पानी देनेवाला** - వంశములోనివాడు.

**पानी-पानी करना** -ఎక్కువగా సిగ్గునొందునట్లుచేయుట.

**पानी पीकर जात पूछना** - పనిచేసి పశ్చాత్తాపపడుట; అసమయమున విచారించుట.

**पानी पी पीकर कोसना** - అతిగా అనుక్షణము తిట్టుచూ ఉండుట.

**पानी फिरना** - పాడగుట; నాశమగుట.

**पानी बचाना** - ప్రతిష్ఠను కాపాడుకొనుట.

**पानी में आग लगाना** - అసంభవాన్ని సంభము చేయుట.

**पानी में बसकर मगर से वैर करना** - నీళ్ళలో నుండి మొసలితో వైర ముంచుకొనుట; ఉన్నచోట బలవంతునితో విరోధము పెట్టుకొనుట.

**पानी सिर से ऊँचा होना** - శక్తికిమించిన పోట్లాట అగుట.

**पानी होकर बट जाना** - నాశమగుట;

వినష్టమగుట.
**पाप कटना** - కష్టము అంతమగుట.
**पापड बेलना** - ఎక్కువగా కష్టములు సహించుట; ఎక్కువగా శ్రమించుట.
**पाबंद करना** - కాళ్ళు కట్టుట; ఆటంక పరచుట.
**पामाल करना** - కాలితో రాచివేయుట; నాశము చేయుట.
**पार पाना**-అంతుతెలిసికొనుట; విజయము సాధించుట.
**पार होना** - స్వార్థము నెరవేరుట.
**पारा उतरना** - క్రోధము శాంతించుట.
**पारा उतारना** - కోపము శాంతపరచుట; కోపము చల్లార్చుట.
**पारा चढना** - కోపము వచ్చుట.
**पाला पडना** - చలిగాలి వీచుట; ఎక్కువ మంచుపడుట; సంబంధము కలుగుట ; నెత్తిన పడుట.
**पाले पडना** - నెత్తినపడుట; అక్కరకు రాని సంబంధము కలుగుట.
**पास-पास** - పరస్పరము; దగ్గర దగ్గరగా.
**पास-पास होना** - ముక్కముక్కలగుట.
**पासा उलटना** - జూదములో ఓడిపోవుట.
**पासा पडना** - జూదములో గెలుచుట.
**पिंड छुडाना** - పీడ వదిలించుకొనుట.
**पिंड पडना** - పీడవెంటనంటుట.
**पिछाडी मारना** - తన్నుట (కాలితో).
**पित्ता मारना** - కష్టమైన పని చూసి గాబరా పడుట.
**पिनाक होना** - పనికఠినమగుట; కష్టసాధ్య మగుట.
**पिल पडना** - మనస్ఫూర్తిగా నిమగ్నమగుట.
**पीछा करना** - వెంటబడుట; వ్యాకుల పరచుట.
**पीछा छुडाना** - వెంట వదిలించుకొనుట.
**पीछे पैर देना** - నిశ్చయము నుంచి తొలగుట.
**पी जाना** - బాధ, అవమానము సహించుట.
**पीठ ठोंकना** - వీపుతట్టుట; ఉత్సాహ పరచుట.
**पीठ दिखाकर जाना** - అనురాగహీన మగుట; ఓడి పారిపోవుట.
**पीठ देना** - వీడ్కోలు పుచ్చుకొనుట; సమయానికి ఉపకరించకపోవుట; నిద్రించుట.
**पीठ पर खाना** - పారిపోతూ వీపుమీద దెబ్బలు తినుట.
**पीठ फेरना - दे० पीठ ठोंकना.**
**पीठ पीछे** - చాటున.
**पीठ फेरना** - వెళ్ళిపోవుట.

**पीठ में छुरा भोंकना** - విశ్వాసఘాతకము చేయుట.

**पीला होना** - శరీరములో రక్తలోపము కలుగుట.

**पीपल के पत्ते की तरह काँपना** - రావి ఆకువలె కంపించిపోవుట; భయముతో కంపించిపోవుట.

**पीलू पडना** - పళ్ళు మొదలగు వాటిలో పురుగులు పడుట; కుళ్ళుట.

**पीस डालना** - కష్టము కలిగించుట; వినష్ట పరచుట; నూరి వేయుట.

**पुचारा देना** - ముఖస్తుతి చేయుట.

**पुरसा देना** - చావు కబురు చెప్పుట; పరామర్శకు వెళ్ళి స్త్రీలు మృతుని ఇంటి స్త్రీలతోపాటు ఏడ్చుట.

**पुराना घाघ** - చాతుర్యముగల అనుభవజ్ఞుడైన వృద్ధుడు; అన్ని విషయములు తెలిసిన వాడు; బహుగడుసు మనిషి.

**पुल बँधना** - కుప్ప ఏర్పడుట; అధిక మగుట.

**पुश्तक मारना** - రెండు కాళ్ళు ఎత్తి తన్నుట (గాడిద, గుఱ్ఱము).

**पूँछ पकड कर चलना** - ఆధారము పొంది ముందుకు సాగుట; వెన్నంటి నడచుట.

**पेच काटना** - చిక్కు తీసివేయుట.

**पेच में आना** - పేచీలో పడుట; మోస పోవుట.

**पेट की बात** - గుప్తమైన విషయము.

**पेट देना** - గుప్త విషయమును బైటపెట్టుట - చెప్పి వేయుట.

**पेट पर छुरी चलाना** - పొట్టమీద కొట్టుట; తిండి లేకుండా చేయుట.

**पेट फूलना** - కడుపుబ్బుట; పోటీ అగుట; అప్రియమగుట ; తెలుసుకొనుటకు తహతహలాడుట.

**पेट मारना** - ఆత్మహత్య చేసుకొనుట.

**पेट-मुँह चलना** - విరేచనములు - కక్కులు అగుట.

**पेट में पानी न पचना** - అంతా చెప్పివేయుట.

**पेट से पाँव निकालना** - గీరగా నడచుట; నిక్కుట.

**पेशाब बंद होना** - అతిగా భయపడుట; కలరావ్యాధి ఉద్భూతమగుట.

**पैरा हुआ** - చతురుడు; పారంగతుడు.

**पोटा तर होना**- ఆర్థికస్థితిగురించి నిశ్చింతగా ఉండుట; సంపన్నత కలిగియుండుట.

**पोल खुल जाना** - బండారము బైటపడుట; గుట్టురట్టగుట.

**पोल खोलना** - గుట్టురట్టుచేయుట; బండారము బైటపెట్టుట.

**पौ बारह होना** -గెలుచుట; పని సాధించుట; పని నెరవేరుట.

**प्याला भर जाना या भरना** - హద్దు మీరుట; మితిమీరుట.

## फ

**फंदा पडना** - ఉచ్చుపడుట లేక వేయ బడుట.

**फंदे में पडना** - ఉచ్చులో చిక్కుకొనుట.

**फक हो जाना** - గాబరా పడుట; తెల్ల బోవుట.

**फक्कड लडना** - దుర్భాషలాడుట.

**फगुआ खेलना** - హోలీపండుగన ఒకరి మీద ఒకరు రంగు చిమ్ముకొనుట; వివాహ సందర్భమున ఒక ఆచారమును పాటించుట.

**फजीहत करना** - దుర్దశచేయుట.

**फजीहत होना** - దుర్దశ అగుట.

**फटकार बताना** - చివాట్లు పెట్టుట.

**फट से** - వెంటనే.

**फटा-फटा रहना** - మనస్సు వికలమగుట.

**फटे हाल होना** - చింపిరిదశ అగుట ; దరిద్రుడగుట.

**फतूर उठाना ; फतूर खडा करना** - తిరుగు బాటు చేయుట; కలహించుట.

**फब जाना** - శోభిల్లుట; సరిపడుట.

**फबती कहना** - వేళాకోళమాడుట; సందర్భమునను సరించి చెప్పుట.

**फरागत पाना** - విముక్తి పొందుట.

**फरागत होना** - ముక్తమగుట; నిశ్చింత మగుట; శౌచ నిర్వర్తియగుట.

**फर्जी होना** - కృత్రిమమగుట.

**फयदि करना** - మొరపెట్టుట.

**फर्राटा मारना** - వేగముగా పరుగెత్తుట.

**फसाद खडा करना** - కలహము లేవనెత్తుట; పోట్లాట పెట్టుట.

**फाँसी खडी होना** - ప్రాణాలకు ముప్పు కలుగుట.

**फारखती लिखाना**- బాకీరసీదు వ్రాయుట; అప్పు తీరినట్లు రసీదు వ్రాయుట.

**फाल बाँधना** - ఎగిరి దూకుట.

**फिर क्या है ?** -ఇంకా చెప్పవలసినదేముంది? అడగవలసినదేముంది ?

**फिराक में रहना** - విరహములోనుండుట; అన్వేషణలోనుండుట.

**फुरेरी आना** - దయ, భయము, చలిలో వళ్ళు గుర్పొడుచుట.

**फूँक-फूँक कर पैर रखना**- బహు జాగ్రత్తగా వ్యవహరించుట.

**फूट डालना** - కలహము పెట్టుట.

**फूटी आँख का तारा** - అత్యంత ప్రియమైన

బాలుడు.

**फूटी आँखों न देख सकना** - కుళ్ళుట; ద్వేషించుట.

**फूटी आँखों (नजरों) न भाना** - ఎంత మాత్రము నచ్చకపోవుట; అప్రియ మగుట.

**फूटी कौडी भी नहीं** - గుడ్డిగవ్వకూడ లేదు.

**फूटे मुँह से न बोलना** - రెండు మాటలు కూడా మాట్లాడకపోవుట; దూర దూరంగా ఉండుట; ఇష్టపడకపోవుట.

**फूल कर कुप्पा होना ; फूल कर नक्कारा होना** - ఆనందముతో ఉప్పొంగిపోవుట.

**फूल झडना** - నోటినుండి తియ్యని మాటలు వెలువెడుట.

**फूल सूंघ कर रहना** - బహుస్వల్పముగా తినుట.

**फेरफार की बातें** - దగాకోరుమాటలు; డొంక తిరుగుడు మాటలు.

**फेरी देना** - ప్రదక్షిణ చేయుట.

**फोकट का होना** - వెల లేకపోవుట; వట్టినే లభించుట.

**फौज दारी करना** - దెబ్బలాడుకొనుట.

**फौत होना** - मौत होना ; చనిపోవుట.

**फौलादी पंजा** - ఉక్కు పిడికిలి.

# ब

**बाँगई करना** - కొంటెతనము చేయుట.

**बंदगी बजा लाना** - సేవచేయుట.

**बंद-बंद ढीला करना** - చితకబాదుట.

**बंदर की तरह आँख बदलना** - మాటి మాటికికోపగించుట.

**बंदर घुडकी देना** - వట్టొట్టిగా బెదిరించుట.

**बंदर-बाँट** - ఎదుటివారి కలహమువలన తనకు లాభము.

**बंधीगत बजाना** - నలుగురు చెప్పినట్లు చెప్పుట; చేసినట్లు చేయుట.

**बकरा होना** - కాముకుడగుట.

**बकरी होना** - ఎప్పుడూ దవడాడించుట; ఎల్లప్పుడూ తాంబూలము నములుతూ ఉండుట; బలహీనమగుట.

**बकरे की माँ का खैर मनाना** - ఎలాగూ వినష్టమగు దానిని ఆపుటకు వ్యర్థ ప్రయత్నము చేయుట.

**बखिया उधेडना** - గుట్టురట్టు చేయుట; బండారము బైట పెట్టుట.

**बखेडा खाडा करना** - కలహము లేవదీయుట.

**बगल गरम करना** - సంభోగించుట; డబ్బు తీసికొనుట; లంచము పుచ్చుకొనుట.

**बगली घूंसा** - వెన్నుపోటు.

**बगलें झाँकना** - ఎటో అటు పారిపోవుటకు ప్రయత్నించుట; సమాధానము ఇవ్వలేక సిగ్గుపడుట.

**बगलें बजाना** - చంకలు కొట్టుకొనుట; అమితముగా ఆనందపడుట.

**बचन तोडना** - వచనభంగము చేయుట.

**बच्चा होना** - అనుభవములేకపోవుట.

**बछिया का ताऊ ; बछिया का बाबा** - మహామూర్ఖుడు.

**बजा लाना** - పాటించుట.

**बट्टा लगना** - కళంకమగుట; మచ్చపడుట.

**बट्टे खाते डालना ; बट्टे खाते लिखना** - వసూలుకాని లేక అవని బాకీల ఖాతాలో వ్రాయుట.

**बडी नाक होना** - మానాపమానముల యెడల ఎక్కువ ధ్యాస వుండుట.

**बडे घर की हवा खाना** - జైలుకి వెళ్ళుట.

**बतासे सा घुलना या घुल जाना ; बतासे सा बैठ जाना** - క్షణభంగురమైన ; త్వరగా బలహీనపడుట.

**बत्तीसी दिखाना** - నవ్వుట.

**बत्तीसी बजाना** - అసహ్యమైనచలివేయుట.

**बंद कर** - కావాలని; సవాలుచేసి; పందెము వేసి.

**बदा होना** - అదృష్టములో వ్రాసియుండుట.

**बधिया बैठना** - నష్టము కలుగుట; దివాళా అగుట.

**बन पडना** - సంభవించుట; సాధ్యపడుట.

**बनाए रहना** - బ్రతకనిచ్చుట; ఉండనిచ్చుట.

**बनारसी चाल चलना** - చాలా తెలివిగా మోసగించుట.

**बबूल लगाकर आम चाहना** - చేసినపనికి విరుద్ధ పరిణామము పొందనాశించుట.

**बरफी खाने के बाद गुड खाना** - మంచి వస్తువు తరువాత చెడ్డ వస్తువు లభించుట.

**बला सिर पर लेना** - కావాలని ఆపదలో చిక్కుకొనుట.

**बसेरा करना** - నివసించుట ; మకాము చేయుట; నివసించుట.

**बस्ता बाँधना** - దస్తరము కట్టుట; వెళ్ళుటకు సిద్ధమగుట; సామాను ప్రోగుచేసుకొనుట.

**बहती गंगा में हाथ धोना** - మంచి అవకాశము చూచి లాభము పొందుట; అందరితోనూ సహకరించి తమ కూడా లాభము పొందుట.

**बहरा पत्थर** - బండ, మొండి, చెవిటి.

**बहार पर आना** - వికసించుట; యవ్వనదశకి వచ్చుట; అధికముగా వృద్ధి నొందుట.

**बहाल होना** - మరల నియోగింపబడుట;

స్పష్టతనొందుట.

**बाछे खिलाना** - అధికముగా ఆనందించుట.

**बाँस पर चढना** - అపకీర్తినొందుట.

**बासों उछलना**-ఎక్కువగా సంతోషించుట.

**बाकी न उठा रखना** - అంతా చెప్పివేయుట.

**बाज आना** - పోగొట్టుకొనుట; వేరు పడుట; విసుగుజెందుట.

**बाजार गर्म होना** - ప్రియమగుట; బేరాళ్ళు వచ్చుట; ఎక్కువగా పని జరుగుట.

**बाजार में आग लगना** - వస్తువులు అతిగా ప్రియమగుట.

**बाजारू आदमी** - చెడు నడవడి మనిషి.

**बाजी मारना या मार लेना** - పందెము గెలుచుట; గెలుచుట.

**बाटजोहना** - దారిచూచుట; నిరీక్షించుట.

**बाट पारना ; बाट मारना** - దోచుకొనుట.

**बात का धनी** - ఖచ్చితమైన మనిషి; వచన బద్ధుడు.

**बात का बतंगड करना** - కొస్త విషయాన్ని గంపంతచేయుట.

**बात चबा जाना** - చెబుతూ చెబుతూ ఆగిపోవుట.

**बात पर आना** - మకురపట్టు పట్టుట.

**बात पेट में डालना** - మాటను గోప్యముగా నుంచుకొనుట.

**बात बनाना** - दे० बात गढना.

**बात लाना** - పెళ్ళి సంబంధము తెచ్చుట; ప్రసంగము తెచ్చుట; మచ్చవేయుట.

**बातें बनाना** - ముఖస్తుతి చేయుట; కోతలు కోయుట; అబద్ధాలు ఆడుట.

**बादल में थिगली लगाना** - అసంభవమైన పనిచేయుట.

**बायाँ पाँव पूजना** - ఓటమి ఒప్పుకొనుట.

**बायें हाथ का खेल होना** - చాలా తేలిక పని అగుట.

**बारह-बाट करना या कर देना** - అస్త వ్యస్తము చేయుట; చెల్లాచెదరు చేయుట.

**बाल का कबल बनाना** -చిన్న విషయాన్ని పెద్దదిగా చేసి చూపుట.

**बाल की खाल निकालना** -మాట నుంచి మాటలాగుట; సూక్ష్మాతి సూక్ష్మమును వెలికితీయుట.

**बाल बनाना** - క్షౌవరము చేయుట; తల దువ్వుకొనుట.

**बाल-बाल बचना** - ప్రాణాపాయము నుండి క్షణములో తప్పించుకొనుట.

**बाल भी बाँका न होना** - ఏమాత్రము హాని కలగకుండుట.

**बाला-बाला** - బైటికి బైటే; పైకిపైనే.

**बावन तोले पाव रत्ती** - పూర్తిగా సరిగా నున్న; ఖచ్చితముగా నున్న.

**बासी कढी में उबाल आना** - వృద్ధాప్యములో యవ్వనపు ఊపు అందుకొనుట.

**बासी बात में खुदा का साझा ; बासी बात में भी खुदा मियाँ का हिस्सा होना** - పనికిమాలిన వస్తువు కూడ భగవంతుని దయవలన సంప్రాప్తించుట.

**बाहर जाना**- అవతలికి వెళ్ళుట; బహిర్భూమికి వెళ్ళుట.

**बिगडा दिल** - మాటిమాటికికోపగించుట.

**बिधना के अक्षर** - విధివ్రాత; అదృష్టము; ప్రారబ్దము.

**बिलारी के भाग छींका टूटना** - అనుకోకుండా; అకస్మాత్తూగా ఏదేని పనికి వచ్చు వస్తువు లభించుట.

**बिस्मिल्ला ही गलत होना** - ప్రారంభమే అవకతవకమగుట.

**बिस्तर गोल करना** - వెళ్ళిపోవుటకు సిద్ధమగుట.

**बीच खेत** - అందరి సమక్షమున.

**बीच में रखकर कहना** - ఒట్టుపెట్టుకొనుట; శపథము చేయుట.

**बीडा उठाना** - ఏదేని పనిచేయుటకు శపథము పూనుట.

**बीस होना** - బలవంతుడగుట; మించుట.

**बुढापेकी लकडी** -వృద్ధావస్థలో ఆధారము.

**बुत्त देना** - మోసగించుట; వంకలేకనెపము పెట్టుట.

**बुलबुल पालना** - రోగమును పెంచుకొనుట; ఇబ్బందిని పెంచుకొనుట.

**बूँदा बूँदी होना** - కొద్దిపాటి వర్షపు జల్లు పడుట.

**बेगार टालना** - అయిష్టముతో ఏదో పని చేసి వేయుట.

**बेडा पार लगाना ; बेडा पार करना** - ఎవరినైనా ఆపదనుంచి రక్షించుట.

**बेडा पार होना** - కష్టమునుండి విముక్తి పొందుట; పనిపూర్తి అగుట.

**बे-नकेल के ऊँट होना** - ఎవరిమాటను లక్ష్యపెట్టకుండా ఇష్టానుసారము సంచరించుట.

**बेपेंदी का लोटा** - అమాయకుడు; కొంపగోడు లేనివాడు; ఏ సిద్ధాంతము లేనివాడు.

**बेवक्त की शहनाई बजाना** - అక్కరకు రాని పనిచేయుట.

**बे-सिर-पैर की बात कहना** - అసంభవమైన; అక్కరకురాని వాగుడు వాగుట.

**बैठी रहना** - పెళ్ళికాకుండా ఉండిపోవుట; నిరీక్షణలోనుండుట.

**बैर काढना** - పగతీర్చుకొనుట.
**बैसाख का गदहा होना** - అమితముగా బలిసిపోవుట.
**बोया हुआ काटना** - కర్మఫలము అనుభవించుట.
**बोल जाना** - చనిపోవుట.
**बोलती मारी जाना** - మాటపడిపోవుట.
**बोलवाला होना** - సమ్మానము కలుగుట; ప్రసిద్ధినొందుట.
**बोहनी होना** - బోణీ అగుట.
**बौखला जाना** - వ్యాకులపడుట; వెర్రెక్కుట.
**बैने का चाँद पकडना** - అనామకుడు ఘన కార్యము చేయుట.
**ब्यौहार चलाना** - వడ్డీవ్యాపారము చేయుట.
**ब्रह्म की शाम होना** - ప్రళయమాసన్నమగుట.
**ब्राह्मण और बाह्मन का अंतर होना** - బ్రాహ్మణుడు, బాపనాడు లో చూచుటకు కొద్ది తేడా ఉన్నా నిజానికి పెద్ద తేడా ఉంది.

## भ

**भंग छनना** - భంగు త్రాగబడుట.
**भंग छानना** - భంగుత్రాగుట.
**भंडा फूटना** - బండారము బయటపడుట; గుట్టురట్టగుట.
**भगवा पहनना** - సన్యాసము స్వీకరించుట.
**भनक पडना** - ఏదో విధముగా చెవినపడుట.
**भरती का** - పనికిమాలిన; వ్యర్థమైన.
**भरमार कर देना** - ఎక్కువచేయుట; గుట్టవేయుట.
**भर्राया स्वर** - బొంగురు స్వరము..
**भला-बुरा** - మంచి - చెడు.
**भाँडे भरना** - పశ్చాత్తాపడుట.
**भागते की लँगोटी** -పోయే డబ్బులో కొంత భాగము.
**भाड झोंकना** - తుచ్ఛమైన పనిచేయుట.
**भाड में झोंकना; भाड में डालना** - వినష్టముచేయుట; విసిరిపారవేయుట.
**भाडे का टट्टू** - కూలికిపనిచేయువాడు; అద్దెకు పనిచేయువాడు.
**भादों का भैंसा होना** - అతిగా బలిసి లావగుట.
**भारी पैर होना** - గర్భవతియగుట; గర్భము ధరించుట.
**भारी होना** - కష్టమగుట; బరువగుట.
**भाव ताव करना** - బేరమాడుట.
**भिगो - भिगोकर मारना** - చెప్పులు తడిపి కొట్టుట.
**भिड के छत्ते छेडना** - భయంకరునితో

వైరము పెట్టుకొనుట.

**भीगी बिल्ली होना या हो जाना** - బొత్తిగా మెదలకుండా ఉండిపోవుట; అణగారి ఉండుట.

**भीम का हाथी** - వెళ్ళి తిరిగి రానివాడు.

**भुगत लेना** - ఫైసలాచేయుట.

**भुरकुस निकलना या निकलजाना** - పిండి పిండి అగుట; వినష్టమగుట.

**भुरता करना या कर देना** - అణచి అణచి బజ్జీచేయుట; చట్నీ చేయుట.

**भूँज या भून डालना** - వేధించుట; వ్యాకుల పరచుట.

**भूमिहार होना** - దూకోరగుట; నికృష్టమైన స్వార్థము సాధించు నీచుడగుట.

**भोडिया धसान** - గుడ్డిగా అకరించుట; అనుసరించుట.

**भैंस से बीन की दाम लेना या देना** - దున్న పోతు కొమ్ముకి అత్తరు రాయుట.

**भोग सुनाना** - దుర్భాషలాడుట; తిట్టుట.

**भोर होना** - వినష్టమగుట.

**भौंह जोहना** - ముఖస్తుతి చేయుట.

**भौंह तानना–भौंह चढाना** - కోపగించుట; చిరాకుపడుట.

**भौंचक रह जाना** - నివ్వెరపోవుట.

**भ्रू मटकाना** - సైగచేయుట.

## म

**मंगता होना** - ముష్టివాడగుట.

**मंगनी करना** - పెళ్ళి నిశ్చిత్తాము చేయుట.

**मँजा होना** - సిద్ధహస్తమైన; అభ్యస్తమగుట.

**मंजिल मारना** - చాలా దూరము కాలినడకన వెళ్ళుట.

**मंडी लगना** - బజారు ప్రారంభమగుట.

**मक्खन मलना ; मक्खन लगाना** - ముఖ స్తుతి చేయుట.

**मक्खी की तरह निकाल फेंकना**-పూర్తిగా వేరు పరచి వెడలుగొట్టుట.

**मक्खी चूस होना** - పీనాసియగుట.

**मगज उडाना** - ఎక్కువగా మాట్లాడి వ్యగ్ర పరచుట.

**मगज खाली करना ; मगज पसी करना** - ఎక్కువగా ఆలోచించుట; అక్కరకు రాని వాగుడుతో విసిగించుట; పిచ్చి వానిగా చేయుట.

**मगज मारना** - మూర్ఖునికి తెలియజెప్పు టకు ప్రయత్నించుట.

**मगर–अगर करना** - టాలాటోలీ చేయుట.

**मजमून बाँधना** - ఉద్భావించుట; కల్పన చేయుట.

**मजा आ जाना** - ఆనందము కలుగుట; ఉల్లాసము కలుగుట.

**मजाक उडाना** - వెక్కిరించుట; వేళా కోళము చేయుట.

**मजा किर किरा होना या हो जाना** - పానక ములో పుడకవచ్చుట; ఉల్లాసము భంగ మగుట.

**मजे में** - ఆనందముతో.

**महिया मेट कर देना** - నాశముచేయుట; ధ్వంసము చేయుట.

**मट्टी पलीत करना** - దుర్దశ పట్టించుట.

**मद आना** - చుట్టుముట్టుట.

**मतलब के यार** - స్వార్థమిత్రులు

**मतलब गाँठना** - స్వార్థము సాధించుట.

**मत्थे डालना** - నెత్తిన రుద్దుట.

**मथानी पडना** - గడబిడయగుట.

**मन करना** - కోరిక కలుగుట.

**मन का मैला** - కపటి; ధూర్తుడు.

**मन की मन में रहना** - కోరిక తీరకపోవుట.

**मन के लड्डू खाना**-గాలిమేడలలో సంతోషిం చుట; ఊహాగానముతో తృప్తినొందుట.

**मन खट्टा होना** - మనస్సు విరిగిపోవుట; ఏవగించుట; నచ్చకపోవుట.

**मन चलना** - కోరిక కలుగుట.

**मन छोहा करना** - నిరాశపడుట.

**मन टटोलना** - మనసులోని విషయమును గ్రహించుట.

**मन टूटना या टूट जाना** - మనస్సు విసిగి పోవుట.

**मन देना** - మనస్పూర్తిగా చేయుట; మనస్సుని లగ్నము చేయుట.

**मन बहलाना** - మనస్సుని రంజింప జేయుట.

**मन माना** - ఇష్టానుసారము; స్వేచ్ఛగా.

**मन में घर करना** - స్నేహము కలుగుట; ఏదేని విషయము మనస్సులో స్థిరపడుట.

**मन में मथानी फिरना** - ఉద్విగ్నమగుట.

**मनसूबा बाँधना** - సాహసించుట.

**मनुहार करना** - ముఖస్తుతిచేయుట; బ్రతి మాలుట.

**मरहठी मचाना** - దోచుకొనుట; దోపిడీ కోలాహలమగుట.

**मरी पडना** - ప్లేగు వ్యాధి వ్యాపించుట.

**मलार गाना** - సంతోషముగా పాటపాడుట; ఆనందపడుట.

**मशविरा करना** - సంప్రదించుట.

**मस्त मौला होना** - నిర్లక్ష్యము చేయువాడు.

**महाजन होना** - ధనవంతుడగుట; వడ్డీ వ్యాపారము చేయుట.

**महीने से होना** - రజస్వల అగుట.

**माँग धोना** - వైధవ్యము పొందుట.

**माँग में कोयला दलना** - విధవ అగుట.

**माई का लाल** - వీరుడు.

**माँटी फाँकना** - ఈర్ష్యవహించుట; వైరము వహించుట.

**गात देना** - ఓడించుట.

**माथे मानना** - ప్రేమపూర్వకముగా అంగీకరించుట.

**मान करना** - అలుగుట.

**मामी पौना** - తన తప్పును అంగీకరించక పోవుట; అన్నమాటను ఉల్లంఘించుట.

**मारते मारते अँचार कर देना ; मारते-मारते भरकुस निकाल देना** - చితక బాదుట.

**मारा-मारा करना** - ఎక్కువగా శ్రమించుట; ఉరుకులు - పరుగులు తీయుట.

**मार्के का काम** - మహత్వపూర్ణమైన విషయము.

**माहुर की गाँठ** - చేదు మనిషి; విషపు మనిషి కటుభాషి.

**मिजाज गर्म होना**-కోపించుట;వెర్రెక్కుట

**मिजाज न मिलना** - గీర్వానుండుట.

**मिजाज सीधा होना** - గర్వయుక్తమగుట.

**मिट्टी के माधी** - మూర్ఖుడు.

**मिट्टी खराब करना; मिट्टी पलीत करना** - వినష్టపరచుట; దుర్దశపట్టించుట.

**मियाँ-मिट्ठू बनना** - మాటలతో ఉబ్బించుట; ముఖస్తుతి చేయుట.

**मिला लेना** - తన పక్షమున చేర్చుకొనుట.

**मिसरा लगाना** - సమస్యను పూరించుట.

**मीठी चुटकियों उडाना ; मीठी चुटकी लेना; मीठी छुरी मारना** - మధుర వాక్కులతో కటువ్యంగ్యము చేయుట.

**मीन-मेख निकालना** - దోషము ఎత్తి చూపించుట; ఛిద్రాన్వేషణ చేయుట.

**मुँह उजाले** - బహుపెందలకడే.

**मुँह उतरना**-ముఖము పాలిపోవుట; ముఖము కళావిహీనమగుట.

**मुँह का कौर** - తేలికపని.

**मुँह काला करना** - కళంకపరచుట.

**मुँह की खाना** - దభాలున పడిపోవుట లేక ఓడిపోవుట; మోసపోవుట; అప్రతిష్ఠ పాలగుట.

**मुँह के तोते उड जाना** -నోటిలోంచి మాట పెగలకపోవుట.

**मुँह खराब होना** - దుర్భాషలాడుట; తిట్టుట.

**मुँह चिढाना** - వెక్కిరించుట.

**मुँह चुराना** - ఎదుటపడకపోవుట.

**मुँह झुलसना**-ఇచ్చి పంపివేయుట; ముఖము మండుట (తిట్టు).

**मुँहतोड जवाब देना** - నోరుమూసే

సమాధానమిచ్చుట.

**मुँहपर** - ఎదుట; సమక్షమున.

**मुँहपर कालिख पोतना** - కళంకపరచుట; అవమానించుట.

**मुँहपर चूना पोतना** - అవమానించుట.

**मुँहपर पानी फिर आना** - ముఖము వికసించుట.

**मुँह पर बात आना** - మాట చెప్పాలను కొనుట.

**मुँह पीला पड जाना** - ముఖము ముడుచు కొనుట; ఔదాసీన్యము కలుగుట.

**मुँह-फॅट** - నిస్సంకోచముగా దుర్భాష లాడుట; కటువుగా మాట్లాడువాడు.

**मुँह फुलाकर बैठना** - మూతిముడుచుకొని కూర్చుండుట.

**मुँह फूलना** - అలుగుట; కోపగించుట.

**मुँह बाकर रह जाना** - నోరు తెరచుకొని ఉండిపోవుట; ఆశ్చర్య చకితమగుట.

**मुँह बाना** - నోరు తెరచుకొని యుండుట; ఆశతో నిరీక్షించుట; తీసుకొనకుం డుట.

**मुँह मारना** - మెరుగవుట; సిగ్గుపడునట్లు చేయుట.

**मुँह मीठा करना** - మిఠాయి పెట్టుట.

**मुँह में घी-शक्कर होना** - పరిస్థితి అను కూలించినప్పుడు సాధుశబ్దములు పలు కుట.

**मुँह में तिनका लेना** - దైన్యము వ్యక్తము చేయుట.

**मुँह में पानी भर आना** - నోరూరుట.

**मुँह में राम, बगल में छुरी होना** - గోముఖ వ్యాఘ్రమగుట.

**मुँह मोडना** - విముఖమగుట.

**मुँह लगना** - నెత్తికెక్కుట; అతిగా చనువు కలుగుట.

**मुँह लटकाना** - కోపగించుట; అలుగుట.

**मुँह से बात छीनना** - ఇతరులు చెప్పు మాటను తను చెప్పుట.

**मुँह से लार निकलना** -दे० मुँह में पानी आना.

**मुकर्रर-सिकर्रर** - ఎన్నో పర్యాయములు.

**मुकीम होना या हो जाना** - మకాము చేయుట.

**मुद्दत करटना** - వడ్డీ తీసుకొనుట; కాలము గడుపుట; ఎక్కువకాలము గడుపుట.

**मुजरा करना** - ముదరా తీసికొనుట; కూర్చొని పాడుట.

**मुटाई चढना** - లావెక్కుట; గీరెక్కుట.

**मुट्ठी गरम करना** - లంచము పుచ్చుకొనుట.

**मुट्ठी गरम होना** - డబ్బు లభించుట;

అంచము వచ్చుట.

**मुट्ठी में होना** - గుప్పెటిలోనికి వచ్చుట.

**मुनादी करना** - చాటింపువేయుట.

**मुरादों के दिन** - యవ్వనము; యువావస్థ.

**मुर्दा–दिल होना** - ఉత్సాహము లేకపోవుట.

**मुलाहिजा करना** - తనఖీచేయుట; ధ్యాస ఉంచుట.

**मुसलाधार बरसना** - కుంభవృష్టి కురియుట.

**मुहर लगना** - స్వీకృతి లభించుట.

**मुहर्रम की पैदाइश होना** - ఎల్లప్పుడు విచారముగా నుండుట.

**मुँहा–मुँही होना** - ఒకరిమీద ఒకరికి కోప మొచ్చి మాట్లాడకుండుట; ప్రేమతో ఒకరినొకరు ముద్దిడుట.

**मूँछ ऐंठना** - మీసము మెలివేయుట; గర్వించుట.

**मूँछ बीन लेना** - అగౌరవపరచుట.

**मूत देना** - అతిగా భయపడుట; ఉచ్చపోసుకొనుట.

**मूसलों ढोल बजाना** - అధికముగా ఆనందించుట.

**मेढक या मेढकी को जुकाम होना** - అసంభవము సంభవించుట; పనికిమాలిన దానిని కూడ పొందకోరుట.

**मेल खाना; मेल बैठना** - జోడు కుదురుట.

**मेला होना** - సంధి కుదురుట.

**मेहनत की रोटी खाना** - కష్టార్జితము అనుభవించుట.

**मैदान करना** - కుప్పవేయుట; చంపుట; యుద్ధము చేయుట.

**मैदान होना** - యుద్ధము జరుగుట; కుప్ప పడుట; విరేచనమగుట.

**मैल का बैल बनाना** - కాస్తమాటను గంపంత చేయుట.

**मोटी अकल** - మంద బుద్ధి.

**मोटी बात** - సాధారణమైన విషయము.

**मोटे हिसाब से** - స్థూలముగా.

**मोती ढलकना** - ఎక్కువగా ఏడ్చుట.

**मोम का पुतला** - కృత్రిమమైన; క్షణభంగురము.

**मोमकी नाक होना** - త్వరత్వరగా అభిప్రాయము మార్చుకొనుట.

**मोम दिल होना** - దయార్ద్రహృదయము.

**मोल करना** - కొనుట; బేరమాడుట.

**मोल देना** - అమ్ముట.

**मोहडा मारना** - ముందుగా పని పూర్తి చేసివేయుట.

**मोहनी लगना** - మోహించుట.

**मौका चूकना** - అవకాశము పోగొట్టు కొనుట.

**मौका पडना** - అవకాశము వచ్చుట.

**मौका मिलना ; मौका हाथ लगना** - అవకాశము లభించు; పందెముగెలుచుట.

**मौज उडाना ; मौज करना; मौज मारना** - ఆనందించుట; ఉల్లాసపడుట.

**मौत का तमाचा** - మృత్యువుని జ్ఞాపకము చేయు కార్యము.

**मौत को दुलत्ती मारना** - ఆపదనుకొని తెచ్చుకొనుట.

**मौरूसी होना** - వారసత్వమగుట.

**म्याऊ का ठौर** - భయంకరస్థితి; భయావహమైన వస్తువు.

**म्यान से निकलना** - కత్తివరలోంచి బయటికి వచ్చుట.

**म्यान से बाहर होना** - అతిగా కోపగించుట.

## य

**यकीन करना ; यकीन लाना; यकीन हाना** - విశ్వసించుట; నమ్ముట.

**यारी कट करना** - స్నేహము వదులుట.

**याँरी गाँठना; यारी जोडना** - స్నేహము చేయుట.

**योंही** - ఊరకేని; ఏ లక్ష్యము లేకుండా.

## र

**रंग उखडना या उखडजाना** - ప్రభావము లేకపోవుట.

**रंग चढना** - రంగుపడుట; ప్రభావము పడుట; రసికుడగుట.

**रंग जमना** - ప్రభావము స్థిరపడుట; దర్జా ప్రదర్శించుట.

**रंग टपकना** - యవ్వనము వికసించుట.

**रंग-ढंग** - స్థితి; దశ; వ్యవహారము; ప్రవర్తన; లక్షణము.

**रंगत आना** - ఆనంధము కలుగుట.

**रंग फक पड जाना ; रंग फक होना** - రంగు వెలిసిపోవుట.

**रंग बदलना** - కోపించుట; స్థితిమారుట; సిద్ధాంతము మారుట.

**रंग में ढलना** - ఇష్టానుసారము సంచరించుట.

**रंग रलना ; रंग रलियाँ करना** - ఆనందించుట; ఆనందముగా క్రీడించుట.

**रंगा सियार** - ధూర్తుడు; బయట-లోపల వేరు వేరుగా నుండుట.

**रंगे हाथ पकडा जाना** - కుకర్మచేస్తూ సప్రమాణముగా పట్టుబడుట.

**रंडापा झेलना** - వైధవ్యము అనుభవించుట.

**रखना पडना** - ఆటంకము కలుగుట;

జగడము కలుగుట.

**रग-रग पहचानना** - బాగుగా గుర్తించుట.

**रगें ढीली पडना** - అలసిపోవుట.

**रट लगाना** - మాటిమాటికి చెప్పుట; సంకల్పించుట.

**रत्ती भर** - స్వల్పముగా.

**रफा-दफा करना** - ముగింపజేయుట; సమాప్తపరచుట.

**रफू-चक्कर बनना ; रफू-चक्कर होना** - పారిపోవుట; అదృశ్యమగుట.

**रब्त-जब्त होना** - గాఢముగా స్నేహము కలుగుట.

**रवाना करना** - పంపుట.

**रवाना होना** - వెళ్ళిపోవుట.

**रसीद करना**-వేయుట; కొట్టుట; పంపుట.

**रसीद काटना** - రసీదు ఇచ్చుట.

**रह जाना** - వెళ్ళలేకపోవుట; ఉండిపోవుట; వెంటపడుట; మిగిలియుండుట; ఏమీ చేయలేకపోవుట.

**रहने देना** - పోనిచ్చుట; ఉండనిచ్చుట; మార్పుచేయుట.

**राई-नोन उतारना** - దిష్టితీయుట.

**राई-रत्ती** - కొద్దికూడా; కొంచెము కూడ.

**राई-रत्ती करके** - కొద్దికొద్దిగా.

**राजी-खुशी** - బాగుగా; సురక్షితముగా.

**रात-दिन बराबर होना** - ఎల్లప్పుడు కష్టదశలోనుండుట.

**रात भारी होना** - రాత్రి గడపడం కష్టమనిపించుట.

**रार करना** - ఘర్షణపడుట; తగాదా పడుట.

**रास आना** - అనుకూలమగుట; పడుట.

**रास्ता दिखाई देना** - ఉపాయము తట్టుట.

**रास्ता देखना** - నిరీక్షించుట ; వేచియుండుట.

**रास्ता नापना** - వెళ్ళిపోవుట; దారికొచ్చుట.

**रास्ता बताना** - పన్నాగము వేయుట; దగాచేయుట; దారిచూపుట.

**रास्ता भूलना** - చాలా రోజుల తరువాత వచ్చుట.

**रास्तेपर आना** - దారికి వచ్చుట; చెప్పింది అంగీకరించుట.

**राह मारना** - ఉన్నతిలో ఆటంకము కలిగించుట.

**रीझ पचाना** - తన సంతోషము ఎవరికీ తెలియనివ్వకపోవుట.

**रीढ टूटना** - అశక్తమగుట.

**रुख देखकर बात करना** - మనస్సును పసికట్టి అనుకూలముగా మాట్లాడుట.

**रुख देना** - ధ్యాస ఉంచుట.

**रुख फेरना** - దయాదృష్టి తొలగించుట;

దుఃఖము కలుగుట.

**रुपया ऐंठना** - మంచి-చెడు చూడకుండా డబ్బు గుంజుకొనుట.

**रुपया तुडाना** - రూపాయి చిల్లర మార్చుట.

**रुस्तम का साला बनना या समझना** - వీరుడగుట (వ్యంగ్యము).

**रुई की तरह तूम डालना या तूमना** - చిన్నా భిన్నము చేయుట; దుర్దశ కలుగజేయుట.

**रूखा पडना** - మొగమాటము లేకపోవుట; కఠోరమగుట; కోపగించుట.

**रेख में मेख भारना ; रेत पर नाव चलाना** - అసంభవమైన కార్యము చేయుట.

**रेल-पेल करना** - గుట్టచేయుట; గుంపు ఏర్పరుచుట.

**रेहन रखना** - తాకట్టు పెట్టుట.

**रोंगटे खडे होना** - భయముతో కంపించి పోవుట.

**रोक-टोक करना** - ఆపుట; ఆటంక పరచుట.

**रोक थाम करना** - సంరక్షించుట; అడ్డగించుట.

**रोजा खोलना** - పగలంతా ఉపవాసముండి సాయంత్రము భుజించుట.

**रोजा तोडना** - ఉపవాస భంగము చేయుట.

**रोटियाँ तोडना** - సోమరిగా భోజనము చేస్తూ వుండుట.

**रोटी की खाक झाडना** - ముఖస్తుతి చేయుట.

**रोडा अटकाना** - అడ్డుపెట్టుట.

**रोम-रोम जलना** - మిక్కిలి కోపగించు.

**रौनक होना** - శోభించుట.

**रौरव भोगना** - నరకము అనుభవించుట.

## ल

**लंक टूटना** - నడుము విరుగుట; ధైర్యము నశించుట.

**लंगर जारी करना** - దానమిచ్చుట; సహాయ పడుట.

**लंगोटिया यार** - బాల్యస్నేహితుడు.

**लंबा बनना- नौ - दो ग्यारह होना ;** పారి పోవుట; అదృశ్యమగుట.

**लंबी तानना** - నిశ్చింతగా నిద్రించుట.

**लंबी रस्सी देना** - అతిగా అలుసు ఇచ్చుట.

**लंबे हाथ मारना** - పెద్దమొత్తము డబ్బును దొంగిలించుట.

**लकीर का फकीर** - గుడ్డిగా పూర్వాచారమును పాటించువాడు.

**लगती बात कहना** - మర్మాంతకపు మాట చెప్పుట; వ్యంగ్యము పలుకుట.

**लगाव होना** - ప్రేమ జనించుట.

**लगे हाथ** - పనిలో మునిగి మరియొక పని

చేయుట.

**लच्छेदार भाषा** - ఆలంకారిత భాష.

**लटा हाथी भी नौ लख का होना** - బ్రతికి చెడ్డవాని ఖర్చు తగ్గకపోవుట.

**लट्ठ लिये फिरना** - పోట్లాటకు సిద్ధ పడుతూ ఉండుట.

**लट्ठ-सा मार देना** - కర్ర విరచినట్లు మాట్లాడుట.

**लडखडाती जीभ** - సంధిగ్ధముగా.

**लताड पाना** - చివాట్లు తినుట.

**लत्ते लेना** - మూర్ఖుని చేయుట.

**लपकी भरना** - దూరదూరముగా కుట్లు వేయుట.

**लपेट में आजाना** - ఉచ్చులోపడుట.

**लबड-धो-धो चलना** - నిజాయితీలేని నడత సఫలమగుట.

**लबाडिया होना** - అబద్ధాలకోరగుట.

**लल्ला जानना दद्दा न जाना** - తీసుకోవడం మాత్రము తెలుసు; ఇవ్వడం తెలియ కుండుట.

**लल्लो-चप्पो करना** - కాళ్ళవేళ్ళ పడుట; ముఖస్తుతి చేయుట.

**लहना चुकाना ; लहना साफ करना** - అప్పుతీర్చుట.

**लहर में आना** - కైపులోకివచ్చుట.

**लहालोट हो जाना** - మోహితమగుట.

**लहू का घूँट पीकर रह जाना** - క్రోధము దిగమ్రింగియుండుట.

**लहू-पसीना एक करना** - ఎల్లప్పుడు అతిగా శ్రమించుట.

**लहू पीना या पी जाना** - అతిగా వ్యాకుల పడుట.

**लहू सूखना** - జంకుట; భయపడుట.

**लाई-लुतरी** - చాడీ; కొండెము.

**लाख से लीख होना** - బహుగొప్పవాడు బహు పేదయగుట.

**लाग बाँधना** - వైరము వహించుట.

**लाग-लपेट रखना**-పక్షపాతము చూపించుట; స్పష్టముగా చెప్పకపోవుట.

**लाचार करना** - వివశునిగా చేయుట.

**लाज रखना** - ప్రతిష్ఠ కాపాడుట.

**लाजवाब कर देना** - ఓడించుట.

**लाठी चलना** - కొట్లాట జరుగుట.

**लाठी में तेल लगाना** - దెబ్బలాటకి సిద్ధ మగుట.

**लानत-मलामत करना**-చివాట్లు పెట్టుట.

**लार गिरना** - दे० लार टपकना.

**जी ललचाना** - నోరూరుట.

**लाल आँखे दिखाना** - కళ్ళు ఎర్రజేసి చూచుట.

**लालच देना** - పేరాశ కలుగజేయుట.

**लाल मिर्च** - బహుక్రోధము గలవాడు; కటుభాషి.

**लाले पडना** - ఎక్కువగా లోటు కలుగుట.

**लासा लगाना** - ఉచ్చులో ఇరికించుట.

**लाहौल भेजना** - ఏవగించుట; చీదరించుట.

**लिख लोढ पढ पत्थर होना** - బొత్తిగా చదువుకోనివాడు.

**लिफाफा खुल जाना** - రహస్యము బయట పడుట.

**लिफाफा बनाना** - బాహ్యాడంబరము చేయుట.

**लिहाज रखना** - ధ్యాస ఉంచుట.

**लिहाज रखना** - ప్రతిష్ఠ ఉంచుట; సరిగా ప్రవర్తించుట.

**लीक करके** - ప్రతిజ్ఞ చేసి.

**लीक** - అడుగుజాడ.

**लीक पीटना** - పూర్వాచారమును గుడ్డిగా అనుసరించుట.

**लीपना - पोतना** - శుభ్రపరచుట.

**लीप-पोत कर बराबर करना** - సర్వనాశము చేయుట; విధ్వంసపరచుట; మించిపోవుట.

**लुटिया डुबोना या डुबो देना** - కళంకితము చేయుట; విధ్వంసపరచుట.

**लू लगना** - వడగాలి తగులుట.

**लू-लू बोलना** - వెక్కిరించుట; పరిహాసము చేయుట.

**लेखा माँगना** - లెక్క అడుగుట; ఖర్చు వివరము అడుగుట.

**लेन-देन न होना** - ఏ సంబంధము లేకపోవుట.

**लेने के देने पडना** - ప్రాణముమీదికి వచ్చుట.

**लोट-पोट करना या कर देना** - విశ్రమించుట.

**लोटे-लोह हो जाना** - అనురక్తమగుట.

**लोन निकलना** - కృతఘ్నతకు ఫలితమను భవించుట.

**लोहा करना** - గుడ్డలకు ఇస్త్రీ చేయుట.

**लोहा गहना** - యుద్ధము చేయుట.

**लोहा लेना** - ఎదిరించుట.

**लोहे का चना** - బహు కఠినకార్యము.

**लोहे के घाट उतारना** - వధించుట; చంపివేయుట.

**लौ लगना** - దృఢమైన సంకల్పము కలుగుట.

**लौ लगाना** - లీనమగుట; నిమగ్నమగుట.

## व

**वंट-बंट होना** - 'నా' అనేవారు ఎవరూ లేకుండుట; ఏకాకిగా నుండుట.

